సాహిత్య ప్రస్థానం
ఏప్రిల్-జూన్ 2004
సంపుటి :1 సంచిక : 2



# సమాలోచనం

ప్రస్థానంలో మార్పులను, కొత్త సైజును అత్యధిక పాఠకులు, సాహితీ మిత్రులు ఆహ్వానించడం సంతోషకరం అయితే విషయానికి సంబంధించి సూచనలు అంతగా అందలేదు. ప్రగతి శీల సాహిత్య పత్రికలు రావాలని కోరుకుంటున్న మిత్రులు వాటిని కొనడంతో బాధ్యత తీరిపోదు. అవి వైవిధ్య భరితంగా అర్థవంతంగా ఆకర్షణీయంగా వెలువడటానికి తమ వంతు దోహదం చేయాలి. ఇంకో విధంగా చెప్పాలంటే వాటి రూపకల్పనలో భాగం పంచుకోవాలి– కనీసం భావాల పరంగానైనా.

ఈ సంచిక తర్వాత పత్రిక మెరుగుదలకు విస్తృతంగా సూచనలు సలహాలు అందుతాయని ఆశిస్తున్నాం.



ఈ సంచికలో కథలు, కవితలతోపాటు సాహిత్య చర్చకు సంబంధించిన అంశాలు చాలానే వున్నాయి. వాటిని పంపిన వారందరికీ కృతజ్ఞతలు. అయితే ప్రస్థానంలో వస్తున్న రచనలపైనా ఈ విధమైన విశ్లేషణలు జరగాలి. ఇతర పత్రికల్లోనూ, పుస్తక రూపంలోనూ వచ్చిన వాటిపై కూడా విమర్శలు రావాలి. ఆ విధమైన చర్చ ద్వారానే సాహిత్య సృజన సుసంపన్నమవుతుంది.



మతోన్మాద శక్తులు ఎన్నికల్లో ఓడిపోయిన నేపథ్యంలో ప్రగతిశీల కళా సాహిత్యకారుల పురోగమనానికి అవకాశాలు ఇనుమడిస్తున్నాయి. అందుకు అవసరమైన విశాల ప్రాతిపదిక సమకూర్చుకోవాలి. ఎక్కడికక్కడ ఆ విధమైన సమాలోచనలు జరగాలి.

ముఖచిత్రం : ఇర్ఫాన్
సహమత్ కార్టూన్ల పుస్తకం సౌజన్యంతో...
లోపలి చిత్రాలు : శేఖర్, ఏలేలక్ష్మణ్, అక్బర్

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

# ఆశావహ పరిణామాలు...

తెలకపల్లి రవి

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో కీలకమైన ఎన్నికల తీర్పుల ప్రభావం కేవలం పరిపాలనకో, రాజకీయాలకో పరిమితమై వుండదు. పరిస్థితులు చేయి దాటిపోకుండా చెలియలికట్టవేయగల వారు ప్రజలే. ఈ పని వారెన్నో సార్లు సమర్థంగా నిర్వహించారు. 1977 ఎన్నికల తీర్పు దేశంలో ప్రజాస్వామ్య స్ఫూర్తిని పెంపొందిస్తే 1989, 1996 లౌకిక ప్రత్యామ్నాయానికి దేశవ్యాపిత స్వభావమిచ్చి, రాష్ట్రాలకు చోటుకల్పించాయి. కాని 1998 తర్వాత కేంద్రంలో అధికారం సంఘపరివార్‌కు సోపానమైంది. ఇప్పుడు దాని స్థానంలో మరోసారి లౌకిక ప్రభుత్వాన్ని ప్రతిష్టించడం, అందుకు ప్రాతిపదికగా బలీయమైన వామపక్షాన్ని సృష్టించడం ఈ ఎన్నికలలో జరిగిన గొప్ప మార్పు. ప్రస్థానం గత సంచికలో మనం ఆహ్వానించిందీ ఇలాటి పరిణామాన్నే.

గత ఆరేళ్లుగా దేశం అనేక విషమపరిణామాలు చూసింది. అన్ని రంగాల్లోనూ. ఆటలు, పాటలు,బొమ్మలు, సినిమాలు ఏది చేయాలన్నా కత్తిమీద సాముగా మారింది. ఎఫ్.ఎం.హుస్సేన్ చిత్రాలైనా, మీరా నాయర్ సినిమా అయినా మతోన్మాదుల దౌర్జన్యానికి గురికాక తప్పలేదు. పిల్లలు చదువుకునే పాఠ్య పుస్తకాలలో చాందసం, మత విద్వేషం కూరారు. విశ్వ విద్యాలయాలలో చిలకజోస్యాలు ప్రవేశపెట్టారు. ప్రగతిశీల మేధావులను, విద్యా వేత్తలను వెళ్లగొట్టి కరుడుగట్టిన బాపతుకు పీట వేశారు. గుజరాత్‌లో మారణహోమంతో పాటు ప్రసిద్ధ కవి వలీ గుజరాత్ సమాధిని కూడా ధ్వంసం చేశారు. ప్రగతిశీ కళా సాహిత్యాలను నిషిద్ధాలు చేశారు. సంస్కృతికి వక్రభాష్యాలు చెప్పి భావ స్వేచ్ఛనే గాక జీవ స్వేచ్ఛను కూడా హరించి వేశారు. భిన్నత్వంలో ఏకత్వమనే తరతరాల సంప్రదాయాన్ని సర్వనాశనం చేసి, మనుగడనే మంటలపాలు చేశారు. వెమరో వైపున మార్కెట్ శక్తులకు పట్టపగ్గాలు లేకుండా చేసి విష సంస్కృతికి ద్వారాలు తెరిచారు. సాంస్కృతిక రంగంలోనూ సామాజిక జీవనంలోనూ ఈ ఆరేళ్లలో ఎదుర్కొన్న విషమ పరిణామాలు ఎన్నయినా చెప్పొచ్చు.

ఒకప్పటి ఈ అలీన అగ్రరాజ్యానికి అమెరికా ఆదేశాలకు అనుగుణంగా నడిచే అధ్వాన్న పరిస్థితి ప్రాప్తించింది. అవినీతి కుంభకోణాలు తెహల్కా టేపుల మీదుగా సియాచిన్ శిఖరాలకు చేరుకున్నాయి.. భగవంతుడికి భక్తుడికి మధ్య అనుసంధాన కర్తల్లా విశ్వాసాలతో రాజకీయాలు నడిపే వికృతి పరాకాష్టకు చేరింది. అహింసా మూర్తి జన్మభూమిలో సబర్మతిని రక్తనదిగా చేస్తూ సాగిన మారణహోమం దేశాన్ని ప్రకంపింపజేసింది. 'విలక్షణ' రాజకీయాలు విగ్రహారాధన స్థాయిలో వ్యక్తిగత భజనగా తయారై వెగటుపుట్టించాయి.

ఈ జోరులో ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, ప్రజల ప్రయోజనాలు ఇలాటి మాటలు అర్థం లేనివిగా అగుపించాయి కొందరికి. ప్రజా ఉద్యమాలు, పోరాటాలు కాలం చెల్లిన విషయాలై పోయాయి. మానవులందరూ ఒకటే నాయనా మనలో మనకు ఘర్షణలెందుకు అని చెప్పడం మహాపరాధమై పోయింది. అల్పసంఖ్యాకుల వేట తగదని చెప్పడం దేశ ద్రోహమైంది. క్రికెట్ మ్యాచ్‌లు చూసి చిందులేయడమే దేశభక్తికి పర్యాయపదమై కూచుంది. గాంధీ స్థానాన్ని గాడ్సే గురువర్యుడు ఆక్రమించేశాడు. స్వాతంత్ర పోరాటకాలంలోనూ, తదనంతరమూ పెంపొందిన విలువల్లో మంచివి అనేకం తలకిందులైపోయాయి. ఈ వూపులో ఎన్నికల పోరాటం కూడా రాజకీయ స్వభావం పోగొట్టుకుని ప్రచార ప్రహసనంగా మారి పోయింది. కుప్పకూలుతున్న జీవన ప్రమాణాల మధ్య ఏడవడానికి కూడా ఓపిక లేని జనాన్ని 'ఫీల్‌గుడ్, ఫీల్‌గుడ్' అని ఊదరగొడుతుంటే సత్య హరిశ్చంద్రుడు సప్త సముద్రాల అవలకు వలసపోవలసి వచ్చింది. మతతత్వం, మార్కెట్ తత్వాల మాయాజాలంలో ఇంకా చాలా చాలా జరిగాయి. ఇదిగో వాటన్నిటినీ భారతీయ ఓటర్లు ఒక్క నొక్కుతో వెనక్కు గొట్టి కొత్త చరిత్ర రాశారు.

గుజరాత్‌లో కూడా బిజెపి సీట్లు కోల్పోవడం, తమ మూడు వివాదాస్పద స్థలాలుగా నిర్ధారించిన అయోధ్య, కాశీ, మధుర మూడు చోట్ల కూడా ఓడిపోవడం, లోక్‌సభలో రెండవ స్థానానికి పడిపోవడం, దాని మిత్రుల బలం క్షీణించడం ఇవన్నీ అసాధారణ ప్రాధాన్యత గల విషయాలు. త్రిశతాధిక స్వప్నాలలో విహరించిన వారికి ఇదంతా ఆశనిపాతం కావచ్చు కాని జన చైతన్యం గురించి, వారి తీర్పుల తీవ్రత గురించి తెలిసిన వారికి ఇది ఏమాత్రం ఆశ్చర్యం కలిగించదు.

కాని కొంతమంది ఇప్పుడైనా తీర్పు స్ఫూర్తిని సక్రమంగా స్వీకరించలేక తమకు తోచిన భాష్యాలు చెబుతున్నారు. యాంటీ ఇంకంబెన్సీ తప్ప జాతీయ ప్రాధాన్యత ఏదీ లేదని సూత్రీకరిస్తున్నారు. కాని వాస్తవం ఏమిటంటే మధ్య భారతం

మినహా మిగిలిన అన్ని ప్రాంతాలలోనూ బిజెపి కూటమి దెబ్బతిన్నది. అందుకే ఇది అన్నిటినీ మించి మతతత్వ వ్యతిరేకమైన తీర్పు.

ఈ తీర్పు వల్లనే కాంగ్రెస్ ఎనిమిదేళ్ల తర్వాత మళ్లీ అధికారం అందుకోగలిగింది. ఎన్నికలలో అదే పెద్దపార్టీగా వచ్చింది. కానైతే దాని సంఖ్యాబలం 1998తో పోలిస్తే దాదాపు అంతే వుంది. 1999లో తగ్గిన దాన్ని తిరిగిరాబట్టుకోవడమే జరిగింది. లౌకికశక్తులతో పొత్తులు, సర్దుబాట్లే దానికి ఊపిరిపోశాయనేది నిజం. కాంగ్రెస్ ఫలితాలను వాస్తవికంగా అంచనా వేసుకుంటేనే మేలు జరుగుతుంది. ఏమైనా ఇది చాలామంది కొట్టిపారేసిన తృతీయ శక్తి ప్రాధాన్యతను, దానికి మూల స్తంభం లాటి వామపక్షాల పట్టును వెల్లడించే పరిణామం.వైవిధ్యభరితమైన ఈ దేశానికి రెండు పార్టీల సిద్ధాంతం ఈ దేశానికి సరిపడదని చాటే ఫలితం.

మనకాలంలో మతతత్వం సామ్రాజ్యవాదంతోనూ, శతకోటీశ్వరులతోనూ విడదీయరాని సంబంధం కలిగివుంటుంది. అందుకే గత ఆరేళ్లలోనూ స్వదేశీ నినాదాల వెనక విదేశీ తిమింగళాలకు దేశాన్ని అప్పగించే విధానాలు తీవ్రమైనాయి. ఇవి రెండూ కవల పిల్లలు. ఇక్కడే వామపక్షాల పాత్ర వస్తుంది. అవి ఆర్థిక విషయాలలో ప్రత్యామ్నాయాన్ని ప్రతిపాదించాయి. దానిపై ప్రజలను సమీకరించి పోరాడాయి. తాము పాలిస్తున్న చోట్ల ప్రత్యామ్నాయ విధానాలు అమలు జరిపి ఫలితాలు సాధించాయి కూడా. లోక్‌సభలో బలాన్ని అపూర్వంగా పెంచుకున్నాయి. వాటికి అన్నిస్థానాలున్నందున అస్థిరత్వం బెడద వుండదని చాలా మంది వూపిరి పీల్చుకున్నారు.

కాని అది కొంతమందికి చేతకాదు- ఇష్టమూ వుండదు. అందుకే ఫలితాలు వెలువడిన వెంటనే స్టాక్ మార్కెట్ సంక్షోభం విరుచుకుపడింది. వామపక్షాలు రావడం పై ఆందోళన వ్యక్తం చేస్తూ పెట్టుబడులు ఉపసంహరించుకున్నాయి. మామూలుగానే ఎక్కడ చీమతుమ్మినా స్టాక్ మార్కెట్‌కు ఉపయోగించుకోవడం కొందరు బ్రోకర్లకు వెన్నతో పెట్టిన విద్య.ఇన్ని ఆర్థిక సంస్కరణల హంగామా తర్వాత కూడా దేశంలోకి వచ్చింది పోర్ట్‌ఫోలియో పెట్టుబడులనే చీటిపాటల బాపతు తప్ప నిజంగా ఉపయోగం ఉపాధికలిగించేవి కావన్న విమర్శ దీంతో రుజువైపోయింది. ఇంత గొప్ప దేశం కొద్ది మంది షేర్‌దళారుల నాటకాలు బూటకాలపై ఆధారపడటం ఎంత ప్రమాదమో మొదటే అర్థంకావడం మంచిదే.

ఏమైనా తీర్పువల్ల రాబోయే రోజులలో మన సామాజిక ఆర్థిక జీవనంలోఅనేక ఆహ్వానించదగిన అనేక మార్పుల చోటు చేసుకోవడం తథ్యం. ఇంకా చెప్పాలంటే ఇక మీదట ఎవరైనా ఎవరినైనా ప్రార్థన చేసుకునేందుకు, ఏ కవితైనా రాసేందుకు, బొమ్మగీసేందుకు, సినిమా తీసేందుకు స్వేచ్ఛ లభించాలి. సంఘీయ శక్తులు గాని మరొకరు గాని అందుకు ఆటంకాలు కల్పించడాన్ని అనుమతించరాదు. విదేశాంగ విధానంలో అలీనతను పునరుద్ధరించుకోవడం, ఆర్థికరంగంలో సామాన్యుల సంరక్షణ కల్పించడం జరగాలి. భిన్నత్వంలోఏకత్వం మళ్లీ పరిఢవిల్లాలి.

◇◇◇

అలాటి ఘట్టమే రాష్ట్రంలోనూ చూశాం. అత్యధిక కాలం పాలించిన చంద్రబాబు నాయుడు ఓటమి, ఆ స్థానంలో కాంగ్రెస్ ప్రభుత్వాధినేతగా వైఎస్ రాజశేఖరరెడ్డి అధికారం చేపట్టడం దేశాన్నే ఆకర్షించిన పరిణామం. దీనికి ముందు రాష్ట్రంలో ఉధృతమైన ఉద్యమాలు చూసింది. తెలుగునాట ప్రగతిశీల కవులు రచయితలూ కళాకారులూ హైటెక్ ప్రపంచీకరణపై, మతోన్మాదరాజకీయాలపై కలాలు సంధిస్తూనే వున్నారు. సాహిత్య కారులలో సరికొత్త సంచలనానికి, సమీకరణాలకు,సృజనకూ ఈ కాలం ఆలవాలమైంది. ఇంతటి ఆగ్రహావేశాలు వ్యక్తమవడానికి కారణాలు సుస్పష్టం. తొమ్మిదేళ్లలో చంద్రబాబు నాయుడు ప్రభుత్వం రాష్ట్రాన్ని ప్రపంచ బ్యాంకు ప్రయోగ శాలగా మార్చిన మేరకు ప్రతిఘటనకూ రాష్ట్రం కేంద్రబిందువైంది.

ఎన్నికలకు చాలా కాలం ముందు నుంచే ప్రజా ఉద్యమాలు ప్రారంభమై విస్తృతి సంతరించుకున్నాయి. స్వాతంత్ర్య పోరాట కాలంనాటి జలియన్‌వాలాబాగ్‌ను తలపించేలా బషీర్‌బాగ్‌లో విద్యుత్ ఉద్యమంపై తూటాల వర్షం ఈ పోరాటానికి తారస్థాయి. ఇంత జరుగుతున్నా ఏలిన వారు కళ్లు తెరవలేదు. వల్లకాళ్లవుతున్న పల్లెల గోడు చెవిసోకలేదు. వేల సంఖ్యలో రైతులు ప్రాణాలు తీసుకుంటే అది మతిస్తిమితం లేని వారి పనిగా కనిపించింది. నిజాన్ని చూడనిరాకారించినట్టు నటిస్తున్నా భయం తలుపు తడుతూనే వుంది కనక ముందస్తు తలపెట్టారు. ఈ లోగా అలిపిరి ఘటనతో సానుభూతి తోడవుతుందనుకున్నారు. కాని ఆ అంచనాలన్ని పటాపంచలైనాయి. ఎందుకంటే ప్రజల సుదీర్ఘ జీవితానుభవం ఇలాటి చిట్కాలకు లోబడే స్థితి ఎప్పుడో పోయింది. వారి చైతన్యమూ పెరిగింది. అదే అంతిమంగా ఫలితాలలోనూ ప్రతిబింబించింది. ప్రజా వ్యతిరేక విధానాలు అనుసరించిన తెలుగుదేశం ఎన్నడూ లేనంత తక్కువకు పడిపోయింది.

◇◇◇

ప్రభుత్వాలు మారినంత మాత్రాన ప్రతిదీ మారిపోతుందని అన్నీ జరిగిపోతాయని ఆశించడం అవాస్తవమవుతుంది. కాని ప్రత్యేక పరిస్థితుల్లో ప్రజాగ్రహం కారణంగా పాలించే ప్రభుత్వాలు పోయినపుడు కొత్తగా అధికారంలోకి వచ్చినవారు కొన్ని సానుకూల చర్యలు తీసుకోవడం అనివార్యం. కేంద్రంలో నిరంకుశ పోటా చట్టాన్ని రద్దు చేస్తామని, మత హింసను అడ్డుకునే బిల్లు తెస్తామని ప్రకటించారు. రాష్ట్రంలో కొత్త ప్రభుత్వం కూడా రైతుల ఆత్మహత్యల నిరోధక చర్యలు ప్రకటించడంతో పాటు పీపుల్స్‌వార్‌తోచర్చలకు ఆహ్వానం పంపించింది. బూటకపు ఎన్‌కౌంటర్ల నిలిపివేస్తున్నట్లు ప్రకటించింది. నిలిపివేసిన నియామక ప్రక్రియను పునరుద్ధరిస్తానంటున్నది. ఇవన్నీ ఆహ్వానించదగిన చర్యలే.



# 'ఫాతెహా'

మాలన్ బీ పెరంట్ల మల్లె పందిరి పక్కపొంటి నులక మంచం మీన కూసున్నది. పక్కింట్ల ఉండె రిజ్వానా బేగం" పేట్‌కా టీవీ ఎక్స్‌రా నికాల్లే. జైసా డాక్టర్ని బోల్తా వైసా కర్... జాదా సోచ్ నక్కో మై జారీ" అన్కుంట అప్పుడే పొయ్యింది. నిన్నటికెల్లి మల్ల ఒగటే రక్తం పోతున్నది. మల్ల పోవాల దవాఖానకు. డాక్టర్ని తిడ్తది.

గీతాంజలి



మొన్న జూసి "మాలన్ తుమ్మారె బచ్చేదానీ మే గడ్డా హై జైసా లగ్‌రా. స్కానింగ్ నికాల్‌నా పడ్తా" అన్నది. అప్పుడ్కే ఒక మయిన అయితున్నది పోబట్టి, మందులు వాడినంక తగ్గుతది - మల్ల బ్లీడింగ్ అయితనే వుంటది. టీవి ఎక్స్‌రెల ఏమెత్తదో ఏమో అన్న భయంకు ఇప్పన్దాంక బోలె... ఒక్క పని చాతనయితలేదు. అంత పెద్ద బిడ్డ తబస్సుం చేస్తున్నది. ఇంతట్ల పెరంట్లకు తబస్సుం వచ్చింది. చీపుర్తోని పెరడంత ఊడ్చి నీల్లు జల్లింది. కోల్లకిన్ని నూకలు జల్లింది. ఇప్పన్దాంక బాసండ్లు తోమింది. ఇగిప్పుడు రాత్రికి రోటీ తయారు చెయ్యనీకి పిండి గల్పుతది కూర జేస్తది. పసిబిడ్డ తొమ్మిదేండ్లు లెవ్వుదానికి తను మంచంల బడ్డంక పన్లన్ని దాని నెత్తిమీనె బడ్డయ్. అత్త ఒగ పుల్లముట్టది అన్నీ బీమారిబిడ్డ తనతోని తబస్సుంలోని చేయిచ్చుకుంటది. తబస్సుం బేటీ ఇంట్ల చాకిరీ చెయ్యనీకి బడి గూడంగ బందు చేసింది. "నక్కోబేటీ మై కర్ లేతుం కైసాతోభీ తూ స్కూల్‌కో జారె గుడియా" అంటే "జాన్‌దేవ్ అమ్మీ ఆప్ జాదానక్కో సోచో ఆప్‌కే తబియత్ ఠీక్ హానే దో బాద్ మే జాతుమ్' అంటది పెద్ద దానితీరు. పొద్దున్న లేసినసంది పనె దానికి. ఇద్దరు సెల్లెండ్లను తయారుజేసి బడికి పంపుతది ఒంట జేత్తది 'అబ్బా ఉఠో' అని వాళ్ళ అబ్బాని లేపి చాయ్ ఇస్తది. ఆయ్యెన పన్లకు పోయెస్తడని డబ్బ కట్టిస్తది. మల్ల 'దాదీ దాదీ' అన్కుంట అత్తకు పాయ్‌ఖానాల సుగ నీల్లు బెడ్తది. ఆమె పాన్ ఉమ్మిన హంగల్‌దాన్ కడ్గి బెడ్తది. ఇంగ మీదకెల్లి ఆడబిడ్డ వాండ్ల పిల్లలు, ఆమె షౌహర్ వస్తనే వుంటరు. పోతనే వుంటారు. ... వర్కి తబస్సుం బేటీనే చూడాలి. కండ్ల పొంటి కారే నీల్లను తుడ్సుకున్నది మాలన్ బీ. రొట్టెలపిండి తడ్పినంక తల్లి తానకు వచ్చింది తబస్సుం 'అమ్మీ క్యా తర్‌కారీ కా టూ' అన్కుంట. ఎట్లనో బిడ్డ కల్పిన పిండి పిసికి రొట్టెలు జేస్తది మాలన్ బీ అట్లనే కూర 'బైంగన్ కాట్‌కే రఖ్ దే మై కర్‌తీ" అన్కుంట లేసింది మాలన్‌బీ.

అత్త మునీరా పక్కిట్లుండే సైనా బేగంతోని మాట్లాడుతున్నది. గోడవతల నిలబడి "అల్లాకో పసంద్ హోనా మేరా బేటా బే ఔలాధ రహెనా బోల్‌కో అల్లా లిఖాహైతో క్యా కర్‌నా.. అబ్‌తోమైనా వారీ (బహిష్టు) రహనా భీ బంద్ హో గయా - మైనా పూరా కప్‌డా హోరా... ' మునీగా నికారంగా మొకంబెట్టి కోపంగ అంటున్నది.

మహిన అంత రక్తం పోతుంటె కోడలు బీమార్తెతుందని లేదు. గని కడుపు కావాల మరద్‌బచ్చా కావాల. తనకు మాత్రం వారం వారం బీపీ చెక్ చేపిచ్చుకుంటది.

మాలన్‌బీ ఎట్లనో ఒక తీరంగ రొట్టెలు, కూరా చేసింది. మాలన్ బీ మొగడు అఫ్సర్ వచ్చిండు. అందరు గలిసి తిన్నరు.

పిల్లలు తొమ్మిందాంక చదువుకుని నిద్రకు బట్టిన్రు. రసోయీ ఘర్ అంత సాప్ చేసినంక - గోలీలేస్కున్నది మాలన్‌బీ. కడుపునొప్పితోని సుదరాయిస్త లేదు. రోజూ ఈ రక్తం పోవుడేందో... కడ్పు మీన చెయ్యేస్కున్నది మాలన్ బీ. ఎత్తుగున్నది. గిది బీమారి గడ్డ కాకుంది అమన్ అయితే ఎంత మంచిగుండు? అదీ మరద్ బచ్చా అయితే ఇంగింతమంచిది. మొగన్ది అత్తది గోస తప్పతది పీడ ఇర్గుతది అన్కుంది. అన్నం దిని బయటకు దోస్తులలోని బాతాఖానీ కోసం 'పోయిన అఫ్సర్ మస్తుగ తాగి వచ్చిండు. దర్వాజ బంద్ జేసి మాలన్ తన జాగల తను పన్నది. పాగలోని తీరు వాగుతున్నడు అఫ్సర్. రోజుండెలొల్లె. మెల్లంగ కునుకు పడ్తున్నది మాలన్ బీకు. ఒక్కసారి తన మీద ఏదో పడ్డట్లయింది. మెల్కచ్చింది. అఫ్సర్ మీదబడి రొప్పుతున్నడు... "నక్కో.. అచ్చా నై హై పేట్ దరద్ సే తడప్‌రీ ఖూన్ జారా నక్కో ఛోడ్‌దేవ్...." మాలన్ బీ పెనుగులాడుతున్నది. "కుత్తీ తేరెకు ఖూన్ కబ్‌నై బహెతా... కహా జానె నై దేతీ - ఖుద్ మాన్ తీభీ నై మాదచ్ఛోద్ చుప్‌కర్" అన్కుంట అఫ్సర్ రెచ్చి పోతున్నడు. మాలన్‌బీ పెనుగులాడుతుంటే చెంపల మీద కొట్టుకుంట పిడిగుద్దులు గుద్దుకుంట తన పని కానిచ్చిండు అఫ్సర్. కడుపునొప్పితోని విలవిలలాడుకుంటూ ఎక్కువైన బ్లీడింగ్‌తోని బాత్‌రూంలకు ఉర్కింది మాలన్ బీ.

పెరెట్లున్న బాత్‌రూంల బట్టలు మార్చుకుని ఆడనే గచ్చుమీన కూలబడి ఎక్కెక్కి ఏడ్సింది. ఇంట్ల ఏడిస్తే మల్ల గుద్దులు పడ్తయ్. పిల్లలు లేస్తారు. చాలా సేపడ్డాకా అట్లనే కూసుని కడ్పుల దుఃఖం దునియాకు తెల్వద్దని ఆస్మాన్‌లున్న చాంద్ తారె - వాటి చుట్టూ ఉన్న చీకట్లకు పంచింది మాలన్ బీ! మల్లింట్లకు పొయ్యి పశువు లెక్కనే గుర్క పెడ్తున్న మొగని పక్కనే ముడ్చుకొని పన్నది- కసాయోని ఇంటి గుంజెకు కట్టిన మేకపిల్ల తీరు!



✧✧✧

తెల్లగ పొద్దెక్కింది. మాలన్ బీ కండ్లు తెర్సింది. కడ్పుల నొప్పెక్కువైంది. మెల్లంగ లేసింది బాత్‌రూంకు పోవాల్నని. అంతే రెండుకాల్లమద్దెల కెల్లి నల్లిప్పినట్లె రక్తం కారబట్టింది. కండ్లు తిర్గినయ్ దబ్బున కూలబడ్డది. 'తబ్బూ' అన్కుంట. అప్పుడే లేసిన తబ్బు 'అమ్మీ' అని లాశిగ ఏడ్సుకుంట "అబ్బా అబ్బా అమ్మీ బేహోష్ హోగయి ఉఠో" అని అర్చింది.

మాలన్ బీకు హోషచ్చింది. హోషచ్చినంక డాక్టర్ని వచ్చిన హోష్ మళ్ళీ పోయెటట్లు మస్తు తిట్టబట్టింది. "కిత్‌నే బార్ బోల్‌నా అక్కల్ నై హై క్యా బచ్చేదానీమె గడ్డాహై టీవీ ఎక్స్‌రా నికాల్‌నా..." అన్కుంట అఫ్సర్‌ను బయటకు పంపిచ్చి మల్ల పరీక్ష చేసింది డాక్టరమ్మ. మాలన్ బీ రాత్రి జర్గింది చెప్పింది. అందుకే ఇంత గనం రక్తం పోతున్నదని చెప్పింది. చెప్పుకుంటనే ఏడ్చింది. ఏడ్చుకుంటనే డాక్టరమ్మ రెండుచేతులు పట్కొని కండ్లకద్దుకుంట "జర బోలో డాక్టరమ్మ ఓ జాన్వర్‌కో ఏ బీమారీ కమ్ హోనే తలక్ మేరెకో ఛూనా నై బోల్‌కో - బొహోత్ తడపీ రాత్ భర్" అన్నది. మాలన్ బీను దగ్గర్కి తీస్కుని "ఏడ్వకు అఫ్సర్‌కు నేను సమ్జాయిస్త" అన్నది. ముఖమంత ఎర్రబడ్డది డాక్టరమ్మకు.

మాలన్ బీ దవాఖానాల రెండు దినాలున్నది. టీవీ ఎక్స్‌రేలైనై రక్త, మూత్ర పరీక్ష లైనై. మాలన్ బీ గర్భసంచిల పెద్ద గడ్డ వుందని ఎల్లింది. ముక్క పరీక్షైంది. ఎంటనే బచ్చేదానీ తీసెయ్యాలని చెప్పింది. లేకుంటె రక్తం సానా పొయ్యి మాలన్ బీ పానంకు డేంజరని చెప్పింది డాక్టరమ్మ. మాలన్ బీ పాగల్ దాని తీరు 'నై' అన్కుంట ఏడ్చింది. యాఖుదా అని కుళ్ళికుళ్ళి ఏడ్చుకుంట నేను బచ్చేదానీ తీపిచ్చుకోను నాపానం పోనీ ఏమన్న కానీ అన్కుంట జిద్దు చేసింది. మాలన్ బీ కేస్ షీట్‌ల 'అడ్వైస్‌డ్ హిస్టెరెక్టమీ' అని రాసింది డాక్టరమ్మ. రెండు రోజులు ఎంత సమ్జాయించినా గని మాలన్ బీ జిద్దు ఇడ్వలె. డాక్టరమ్మ విసిగిపోయింది. అఫ్సర్ అందరి ముంగట మాలన్ చెంపలు పగలగొట్టిండు "మాస్ లే బేషరం ఔరత్" అన్కుంట "అల్లా ఆకోబోలెతో భీ నై మాన్‌తీ జావ్" అన్కుంట ఇంగింత ఏడ్సింది మాలన్ బీ.

డాక్టరమ్మ కోపానికచ్చింది. ఇంక ఇనదని కన్సెంట్ తీస్కుని నీ ఖర్మని డిశ్చార్జి చేసింది.

మాలన్ బీని పంపెముంగట అఫ్సర్‌ను లోపట్కి పిల్చి ఆమె తబియత్ ఠీకైనంకనే ఆమెను ముట్టాల్నని అన్ని దినాలు ఓపిక పట్టాల్నని చెప్పింది. అఫ్సర్ ముఖం ఎర్రబడ్డది. "తీన్ మహినే సే సబర్ కర్రా హు ఔర్ కితనే దిన్ కర్ నా మేడం! మాఫ్ కర్నా" అన్కుంట ఎల్లి పొయ్యిండు. డాక్టర్‌మ్మకు తెల్వదా అఫ్సర్ ఎంత శీలవంతుడో? పిల్లలందరు పన్నరు అత్త సుగ కునుకు తీస్తున్నది మొగడింక రాలె - తాగి గాని రాడు.

మొగడు అఫ్సర్ యాదికి రాంగనే మాలన్ బీ రక్తం పొంగింది. హరాం ఖోర్! తనకు తబియత్ మంచిగుండంగనే ఇద్దరు పిల్లలైనంక గూడంగ రెండో నిభాచేస్కుంటనని మస్తు ఖోషిష్ చేసిండు ఎంత సతాయించకు తింటుండె వర్సగ ఔరత్ బచ్చీలు పుట్టిన్రని? ఇంగ మరద్ బచ్చా పుట్టడని బూటకం పుట్టిచ్చి ఒక దినం ఒక ఔరత్‌ను తీస్కొచ్చిండు. తనప్పుడు జిజ్జీతోని వున్నది. ఐదో నెల నడుస్తున్నది దినాం అల్లాకు దువా చేస్తున్నది ఈసారి మరద్ బచ్చాపుడితె జహంగీర్ దర్గా కచ్చి ఒక బక్రీ నిస్తనని 'న్యాజ్' చేసింది.

ఇగ ఆమెను తీస్కొచ్చిండు గద? తమ చీపురుపట్టి తరిమినా పోయిందా ఆ బేషరం ఔరత్? తను ఖానాపీనా బందు చేసింది. రాత్ దిన్ ఒక్క తీరంగ ఏడ్సింది. అయినగని పోలె అది. బేషరంగ గా ఔరత్‌లోని అన్నీ చేపిచ్చుకుంటుండె. తనతోని గొడ్డుచాకిరి చేపిచ్చుకుడునె అత్త గూడంగ చప్పుడు చెయ్యలె. అత్త కాళ్ళు పట్కొని ఏడ్సింది. "మై క్యాకరూ మాలన్? తూ మరద్ బచ్చా కోనై దియీన?" అన్నది గాద? ఇగ అమ్మాబావాలు -పిన్నమ్మలు గూడంగ మస్తు చెప్పినగని ఇన్నడ బాడ్‌కవుగాడు? ఇది ఇట్ల కాదని తను ఇంట్లున్న పుర్గుల మందు తాగింది. బేహోష్ అయిన తనని దవాఖానల ఏసిన్రు. కష్టం మీన బత్కింది. బత్కెదంక హోష్ అచ్చినప్పుడల్ల తన పిల్లల కోసానకు బత్కియ్యమని అల్లాకు దువా చేస్తనేవుంది. అల్లా కా సుకర్! తను బత్కిపొయ్యింది. పోలీస్ కేసయితదని అది దెంక పొయ్యింది. మొగుడు గూడంగ నాల్గు దినాలు చెహ్‌రా చూపియ్యలె.

తర్వాత షంషాబాద్ అవతలున్న జహంగీర్ పీర్ దుర్గాకు పొయ్యి న్యాజ్ తీర్చుకున్నది. పకీరోల్లకు, లంబడోల్లకు మాంసంతోని బగారన్నం తిన్పించింది. మరద్ బచ్చాకోసానికి కాదు గని గా సౌతి పీడ పోయినందుకు. మల్లగూడంగ ఔరత్ బచ్చీనే పుట్టింది. సూడు అల్లా ఇసిత్రం! ఇంగేమన్న ఉన్నదా? అత్త షాహర్ ఇద్ద రెక్కిన్రు తన మీద.

గిదంత జరిగిప్పట్కి ఐదేండ్లయ్యింది.

'ఔలాన్ కో నహీ దేసక్‌తీ బేషరమ్ బహు' అన్కుంట అత్త ఊరంత తిరుక్కుంట చెప్పుకుంట చేరింది. మీదకెల్లి ఇంట్ల గునుగుడు ఎక్కువ చేసింది. మొగడు కొట్టుడెక్కువ చేసిండు. ఒకసారి కఱ్ఱతోని కొట్టిండైతే తలపగిలి పదికుట్లు పడినై. "మరద్ బచ్చాకోపైదా కరనా ఏక్ తేరేహి బస్ మే హై క్యా?" అన్కుంట. అమ్మా బావ మస్తేడ్సిఱ్ఱు. అఫ్సర్ కాల్లుపట్కున్నరు తమ బేటీనిట్ల కొట్టద్దని. ఇన్నడా కసాయోడు? పిల్లలకోసానికి బరిచ్చుడుగని...! ఈ సారైన గని ఒక మరద్ బచ్చాని కనాల వీల్లనోల్లు మూయించాల... ఎట్ల? ఏం చేస్తే మరద్ బచ్చ పుడ్తడు? మల్ల జహంగీర్ బాబానే దిక్కైతడు... ఈసారి పదకొండు మందికి కాదు ఇరవైమందికి దర్గాకాడ తిన్పియ్యాల... క్యా - కర్‌నా ఫిర్... గిట్ల పరేషానైతుండగనే గీ బీమారి! తన కడ్పుల గడ్డ వుందనంగనే అత్త "ఇంగ నీ చేతిల ఏం లేకుంటైంది నీ బచ్చేదాని ఖరాబ్ అయ్యింది నీకింక పిల్లలె పుట్టరు. నాకొడ్కుకు వేరె నిఖా జేస్త" అన్కుంట వెంట తగిలింది" య్యాఖుదా! గీ ఔరత్‌లకు అయితె గియితే అమన్ల మీద అమన్లు! లేకపోతే అబార్షన్లు అది గూడ లేకపోతే గిట్ల కడ్పుల గడ్డలు - ఖూన్‌బహానాలు - ఆపరేషన్లు! థూత్ గీ ఔరత్ కీ జిందగీ! ఈ జిందగీ మీద మన్నువడ! మల్ల నిన్నటి సంది నల్ల ఇప్పినట్లె రక్తం పోతున్నది. పెయ్యింత ఒణ్కుతున్నది. కండ్లముందు అంధేర అంధేర అయితున్నది. నాల్గడుగులు ఏస్తెసాలు దమ్మంటె దమ్మస్తున్నది. ఏం జెయ్యాల్నో సమజ్ అయితలేదు. దవాఖానాలకు బోతె బచ్చెదానీ తీసెయ్యాలన్న మాట తప్ప ఇంగొక మాట రాదు. ఇంగక్కడ్కి పోవద్దు. ఏమైన చెట్ల మందెన్కోవాల - గి ఇమ్తియాజ్ బీబీ కాడికి బొయ్యి తన గడ్డ తగ్గనీకి దువా చెయ్యమనాల - ముప్పై అగ్గుతది కావచ్చు. ఇద్దాం తియ్య. రేపమావాస్ దినం పోవాల. ఈ యాడాది అల్లా మెహబూ సుభానీ గ్యార్వి షరీఫ్‌ల న్యాజ్ బేపిచ్చి ఫాతెహా ఇప్పియ్యాల (నైవేధ్యం) ఏమైనా కాని. మాలన్ బీకి నిద్రపడ్తలేదు. ఆలోచనలతోని పరేషాన్ అయితున్నది. పిల్లలు ముగ్గురు నిద్రపోతున్నరు. ఆల్లను జూస్కుంట మేరె బచ్చె అన్కుంట కుములుతున్నది మాలన్ బీ! తనకేమైతే తన మారద్‌కేందీ? పీనిగ లెవ్వకముందె ఇంగొక దాన్ని తెచ్చుకుంటడు గా ఉంచుకున్నదాన్నె తన పిల్లలు ఏమవ్వాల?" య్యా ఖుదా ముఝె బచా" అన్కుంట కండ్లపొంట కార్తున్న కన్నీళ్ళను కొంగుతోని తుడ్చుకున్నది మాలన్ బీ!

"మాలన్! తెరె జాన్ సె జ్యాదా నై హై మరద్ బచ్చా! ఏ ఔరత్ బచ్చోంకే లియె మెరె లియె ఆప్రేషన్ కర్‌వాలె" అని ప్రేమతోని అఫ్సర్ అడుగుతడేమోనని ఎంతాశతోని ఎదురుచూస్తున్నది. మాలన్ తూ ఉత్ నా ఖుష్ నసీబ్ నహీహై... క్యా? మాలన్ బీ తనలో తను తన నసీబ్‌ను ఎక్కిరించుకున్నది - ఇంకోసారి కారె కన్నీళ్ళను తుడ్చుకుంటా

✧✧✧

ఇమ్తియాజ్ బీబీ ఇంటికి పోయెటాలకల్ల పొద్దెక్కింది ఆడ అప్పట్కె మస్తుమంది జమయ్యిఱ్ఱు. తబస్సుం అమ్మీ చెయ్యి బట్కోని నడ్పించుకంట లోపట్కి తీస్కపోయింది. ఆదున్న జనంను చూసి మాలన్ బీ పరేషాన్ అయ్యింది. హాయ్‌రె అల్లా! దునియామే కిత్‌నె పరేషానియా హై అన్కుంది. షౌహర్ వదిలేసిన రమీజా, మొగడు చనిపోతె ఐదుగురు పిల్లలతోని బిచ్చమడుక్కుంట బత్కుతున్న ఫాతీమా, దుబయ్ తీస్కపోతనని లగ్గం చేస్కుని కడుపచ్చినంక పారిపోయిన లతీఫ్, మల్లొస్తడేమోనని ఎదురుచూస్కుంట గడ్పుతున్న ఖతీజా, కట్నం సరిపోలేదని బిడ్డను ఎల్లగొట్టిఱ్ఱని పరేషానైతున్న ఎల్లమ్మ, బ్యాంకిలోను కట్టలేక పుర్గులమందు తాగి మొగడు సచ్చిపోతె అప్పులు తీర్చనీకి చిన్నచిన్న పోరగాండ్లను తీస్కుని బస్తీకచ్చి మూడిండ్లల్ల పాచీపని చేస్తున్న నల్గొండ సత్తెమ్మ.... అందరు ఎంత భక్తితోని ఆడకూసున్నరు. అల్ల ముందర ఇమ్తియాజ్ బీబీ కూసున్నది. అందరు అప్పుడె వచ్చిన మాలన్‌బీను ఖైరియత్ అడ్గుతున్నరు. మాలన్ బీ అచ్ఛీ హు అల్లాకి సుకర్ అన్కుంట... ఒకల్లకొకతీరు చెప్తున్నది. ఓపిక లేకపోయినగని మనిషి చెమటతోని చిత్తడైతున్నగని... ఎట్లైన గీ బీమారికెల్లి తనను తప్పియ్యమని... అస్సలైతె తన నసీబు ఎట్లుందో తెల్సుకుందామని వచ్చింది. ఇమ్తియాజ్ బీబీకి అమాశ నాడు అల్లాకి సవారివస్తది. ఇట్లనే పరేషాన్ల ఉన్నోళ్ళు వచ్చి తమ నసీబు ఎట్లుంటదని ఆడ్గనీకి వస్తరు.

ఇంతట్లనే ఇమ్తియాజ్ బీబీకి సవారి వచ్చింది. మనిషి మెల్లంగ ఊగుతున్నది. ఒక్కొక్కోల్లు పోతున్నరు. ఆల్ల బాధలు ఎట్ల తీర్తయో అన్ని చెప్తున్నది ఇమ్తియాజ్ బీబీ! ఒక్కోల్లు ఏడుస్తున్నరు - ఒక్కోల్లు కుములుతున్నరు ఆల్ల ల్ల ఆల్లె. మాలన్ బీ వంతచ్చింది "గ్యార్వీ షరీఫ్ మే న్యాజ్ కర్‌కే సాతేహె దేదే ఏ సాల్... తేరె పరేషానియా దూర్ హో జాతై..." అని మస్తు చెప్పింది ఊక్కుంట. 'ఆగ్ లె జుమ్మెరాత్ కో కర్‌దే' అని కూడా చెప్పింది ఇంతియాజ్ బీబీ. మాలన్ బీకి సంతోషంతోని కండ్లల నీల్లచ్చినయ్. మెల్లంగ అందర్కి ఖుదాహాఫిజ్ చెప్కుంట ఇంటి దారి బట్టింది. గని ఇల్లు చేరనే లేదు దార్లనే బేహోష్ అయిపోయింది.

✧✧✧

"బచ్చెదానీ మె హైసో గడ్డా నికాల్‌దో డాక్టరమ్మ - బచ్చేదానీ నక్కో మై జరీబూటీ దవా బీ ఖారీ హు - కమ్ హోరా భీ..." అన్కుంట కుమలుకుంట ఏడుస్తున్నది మాలన్ బీ. దవాఖానల రక్తం ఎక్కుతున్నది మాలన్ బీకి.

"నై మాలన్! మేరీ బాత్ మానో! ఏ వైసా మామూలీ గడ్డానైహై కేన్సర్ మే బదల్ సక్‌తా హై! బచ్చేదానీ పూరాగ తీసెయ్యాల నెలంత రక్తం పొయ్యి జిసంల రక్తమే లేకుంట సచ్చిపోతవ్ నా మాటిను" డాక్టరమ్మ చెప్తున్నది.

'ఇన్‌కీ బాత్ నక్కోమానో డాక్టరమ్మ ఆప్రేషన్ కర్‌దో'' అఫ్సర్ కోపంగ చెప్తున్నడు. "నక్కో - నక్కో" అన్కుంట మాలన్ బీ ఏడుస్తున్నది. డాక్టరమ్మ ఏం చెయ్యలేక వార్డుకెల్లి బయటబడ్డది- 'ధూత్-తెరీకీ' మర్‌జాతీ క్యోనై" అని అఫ్సర్ చీదరింపు మాటలు విన్పిస్తుంటే.

ఆ రాత్రి.... డాక్టరమ్మ తన రెస్ట్ రూంల కూసుని ఆలోశెనలబడ్డది. ఎందుకు ఒద్దంటున్నది? ముగ్గురు బిడ్డల్ని పెట్టుకుని ఎందుకు ఇంత రిస్కు తీస్కుంటున్నది? గడ్డ తీసెయ్య మంటది బచ్చెదానీ ఉంచెయ్యమంటది. గదేందో కోట్లు ఖరీదు జేసే ఖజానా తీరె! అది లేకపోతే తనకు జిందగీ లేనట్లే! అది ఆమె జిసంల వుంటేనే ఆమెకి జిందగీ వుండది. రక్తం బాగాపోతున్నది. హీమోగ్లోబిన్ చానా తక్కువున్నది. ఎట్ల చెప్పాలె? ఇంకింత అనీమియాలకు దిగితే ఆపరేషన్ చేసుడుగూడంగ కుదరది. ఎట్ల సమ్జాయించాలి. డాక్టరమ్మ మెల్లంగ మాలన్ బీ వున్న

క్రమలకు ఎల్లింది. తొమ్మిదేండ్ల తబస్సుం తల్లిని కర్చుకుని పన్నది. నేల మీద మాలన్ వాండ్లమ్మీ పన్నది. మాలన్ బీ నిద్రపోతలేదు. ఏదో సోంచ్‌ల బడ్డట్లున్నది. డాక్టరమ్మ పిల్పుకు గభరాయించినట్లె అయ్యి మెల్లంగ తబస్సుం నిద్ర చెడకుంట చెయ్యి పక్కకు తప్పించుకుంట "సలాం మేడం బైటియె" అన్కుంట లేసి కూసున్నది. మనిసంత తెల్లచేపోలె అయిపోయింది పెదాలెండిపోయినై మనిషికి దమ్మున్తున్నది కొంచెం.

డాక్టరమ్మ స్టూలు మీద కూసున్నది. మాలన్ బీ ఖైరియత్ అడ్గింది. అడ్గినంక తనెందుకచ్చిందో చెప్పింది. ఇగనువ్వు చెప్పాలె మాలన్ అన్నది! మాలన్ బీ ముందుగల్ల నగింది! మల్ల మల్ల నగింది! అటెన్క ఏడ్సింది. అట్ల కొంచెం సేపద్దాంక ఏడుస్తనే వున్నది. అటెన్క డాక్టరమ్మ చల్లని చూపుతోని మెత్తని మాటతోని వెచ్చని స్పర్శతోని సల్లబడ్డది... సల్లబడి "ఏం చెప్పాలె డాక్టరమ్మ... నీకు తెల్వనిదేమున్నది, నువ్వేచేస్తివి నాకు కాన్పులు... నా గోస నీకు తెల్వద? ఔరత్ బచ్చీలు పుట్టిన ప్రతిసారి నేనేడిస్తే... ఊర్కో.... మాలన్! చాంద్ కా తుక్‌డా లైక్కున్నరు. ఏడ్వకనె దానవు కావూ ఎప్పుడైనగని! ఓ చాంద్‌కె తుక్‌డే మేరె దిల్‌మె అంగా రె బన్‌కె జల్‌రై మేడం! నా తబియత్ మంచి గున్నప్పుడె నా షోషర్ ఇంగొగ దాన్ని తెచ్చుకున్నడు. అది నీకెరికె! ఇసం తాగి నీ తానకే వస్తి. నువ్వె నా జాన్ బచాయించినవ్ యాది ఉన్నది కద! అప్పుడెట్లనో బెదిరిచ్చి దాన్ని దారి బట్టిచ్చిన – అన్ని దార్లబెట్టిన. ఇగ – ఇప్పుడు గీ బచ్చేదానీ నే తీసేస్తె... ఆనికి ఇంకే కావాల? ఇంక ఖుల్లా మోక ఇచ్చినట్లె కాద? నా సౌతిని వెంటనే తెచ్చి ఇంట్లబెట్టడ? ఇసీలియె గద్దా నికాల్‌దో – మగర్ బచ్చేదానీ నక్కో నికాలో. ఎ బచ్చేదానీ హి మేరీ జిందగీ హై డాక్టరమ్మ. ముఝె ఇలాజ్ కరో బీమారి కమ్‌కరో... అచ్ఛీ హొనేకే బాద్ మై మరద్ బచ్చాకో పైదాకర్ కో ఉన్‌కో – మేరి సాస్‌కో మూ తోడ్ జవాబ్ దూంగీ" మాలన్ బీ తన కడ్పుమీద చెయ్యి వేసి ఆయాసపడ్కుంట మాట్లాడ్తనే ఏడుస్తున్నది. మల్ల తనే..." హోనా బోలె తో ఖూన్ బన్‌నే కీ గోలియా దేవ్... టానికా – ఇంజెషనా దేవ్.... హరీసబ్జీ మస్త్ బాతుం మై మగర్ బచ్చేదానీ నక్కో నికాలో డాక్టరమ్మ.... హాత్ జోడ్‌తీ హు..." అన్కుంట డాక్టరమ్మ చేతులు పట్కొని కుమిలి కుమిలి ఏడుస్తున్నది. డాక్టరమ్మ దిమాకంత పిస పిస అయ్యింది. ఆమెకు గుండె బరువైంది. కండ్లపొంట నీల్లు తిర్గినయ్. ఇంతట్ల తబస్సుం – మాలన్ బీ తల్లి నిద్రలేసిన్రు. తబస్సుం తల్లిని చుట్కొని "రోనక్కో అమ్మీ రోనక్కో" అన్కుంట మాలన్ బీకి బుదరకిస్తున్నది. మాలన్ తల్లి 'క్యా కరూ డాక్టరమ్మ – జర సమ్జాదో ఏ పాగల్ ఔరత్ కో' అన్కుంట కన్నీలు కారుస్తున్నది.

వెంటనే డాక్టరమ్మ తేరుకున్నది... మాలన్ బీని పట్కొని "చూడు మాలన్ నా మాటిను. ఈ హాలత్‌ల నీకు బిడ్డపుట్టది. అమన్ వచ్చిన గని నిల్వది. గడ్డ బాగా ముదిరిపోయింది. నా మాటిను మరద్ బచ్చా లేకపోతే ఏంది? నేను నీ షోహర్‌కు అత్తకు సమ్జాయిస్త... పరేషాన్‌గాకు గీ పిల్లల గురించి సోంచాయించు రక్తం గిట్లనే పోతే డేంజర్లకు పోతవు..." డాక్టరమ్మ చెప్తనే వుంది. మాలన్ వింటనే వుంది. ఇంగొక డ్యూటీ డాక్టరమ్మ ట్యూమర్ దీస్తమని యుటిరస్ తీసేద్దామా? ఆమె భర్త కన్సెంట్ దీస్కుని ఆయెన చేసెయ్యమంటున్నడు అంటున్నది... తెల్లవారినంక అదే జిద్దుతోని ఆప్రేషన్ చేస్తే ఇసం తాగుతని బెదిరిచ్చి డిశ్చార్జి చేపిచ్చుకుని ఎల్లిపోయింది మాలన్‌బీ?

అట్ల మాలన్ బీ దవాఖాన గడప ఎక్కుడు – దిగుడు గుల్‌కోసులు ఎక్కించుకొనుడు– రక్తం ఎక్కించుకొనుడు ఒక రివాజ్ అయిపోయింది.

మాలన్ బీ వచ్చినప్పుడల్ల డాక్టర్లు ఆమెను పరీక్ష చెయ్యకుండనే ఆమె కేసు దెల్సె వాండ్లకు – "బ్లీడింగ్ పి/వి ఫైబ్రాయిడ్ యుటరస్ అడ్వైస్డ్ హిస్టెరెక్టమీ – పేషంట్ నాట్ విల్లింగ్ ఫర్ సర్జరీ' అని రాసేస్తరు – ఆమెను బత్మిలాడ్తరు – విసుక్కుంటరు కోపానికస్తరు.... మాలన్ బీ అట్లె జిద్దు జేస్తది. తన బచ్చెదానీని కాపాడుకొని దవాఖానాలకెల్లి బయటపడ్డది ఎప్పుడైనగని. ఇంగ మాలన్ బీ షొహర్ – అఫ్సర్ ఓపిక పొయ్యి బగ్గ కొట్టుడు షురు జేసిండు గని వాదా చేస్తలేదు. మాలన్ బీ 'బచ్చేదాని తీపిచ్చుకున్నంక నిఖా చేస్కోకుండ వుంటవ?" అంటె 'అదంత నీకెందుకు నువ్వాపరేషన్ చేపిచ్చుకో –ఇంగనీ మీద నేను పైసా పెట్టనంటడు. పెట్టేదంత మాలన్ అమ్మ బావలైన గని. డాక్టరమ్మ గూడంగ "అఫ్సర్ ఓ మర్ జాతీ – వాదా క్యోం నైకర్ తే" అనడిగితే ఇన్నడ? అత్తమునీరా "ఏ మేరె బేటెకో సతాసతాకో పరేషాన్ కర్రీ న మర్తీ హై న హమే జాన్ సే రహ నే దేతీ" అని శపిస్తున్నది. ఇంగందరూరుకున్నరు.

అఫ్సర్ పట్టించుకుంటలేడు. మాలన్‌ను వాళ్ళ అమ్మబావలకు అప్పచెప్పిన్రు. వాళ్ళ ఓపిక గూడంగ పోతున్నది. మాలన్‌ను విసుక్కుంటున్నరు. డాక్టర్లను బలవంతంగా ఆప్రేషన్ చేసెయ్యిమంటున్నరు. ఇంగ తమకు గూడ చేతగాక ఊకుంటున్నరు.

◇◇◇

మాలన్ బీకి రక్తం 'పోవుడు – బేహోష్ అవుడు' మనిషి డిలా పడిపోవుడు దవాఖానల షరీకవుడు మామూలైపోయింది. ఆమె దవాఖానలకు వస్తే సిస్టర్లు మాలన్ బీ బ్లడ్ గ్రూపు రక్తం ఎబి పాజిటివ్ వెంటనే తెప్పిస్తరు. రాంగనే గుల్‌కోసులు ఎక్కిస్తనే వుంటరు. ఎప్పుడచ్చినగని సిస్టర్లు "వో ఖూన్ బహానే వాలీ' – ఖూన్ చడానే వాలీ – ఎబి పాజిటివ్ గ్రూప్ వాలీ ఆగయా' అన్కుంటరు. కొందరేమో "బిచారీ మర్‌జాతీ ఏక్ దిన్ ఖూన్ బహా బహా కే" అంటరు జాలితోని.. అందరికిట్ల అలవాటైపోయింది.

◇◇◇

ఒగదినం... మాలన్ బీ మల్ల దవఖానల షరీకైంది... వెంట షొహర్ రాలె... సాస్ రాలె... అమ్మా బావలు వచ్చిన్రు. ఆమె పల్స్, బీపి పడిపోతున్నయ్ షాక్‌లకు పోతున్నది. రక్తం ఎక్కిస్తనే వున్నరు. గా బేహోష్ హాలత్‌లనే ఒగదిక్కు 'ఆప్రేషన్ నక్కోనక్కో' అన్కుంటనే... ఇంగో దిక్కు మేరె బచ్చె' అన్కుంటనే మాలన్ బీ... ఇగ మల్ల దవాఖానాలకు రాకుంట అక్కడ్నే ఇంతెఖాల్ అయ్యింది. ఆమె కోరుకున్నట్లె ఆమె బచ్చెదాని ఆమె జిసంలనె ఉండిపోయింది. మాలన్ బీ జిందగీ ఎవలకు ఫాతెహా అయ్యిందో ఎవలకు తెలవకుంటయ్యింది.

❖

(తీవ్రమైన అనీమియాతోని బాధపడ్తూనే భర్త ఎక్కడ రెండో నిఖా చేస్కుంటాడో నన్న భయంతో గర్భాశయంలో గడ్డను భరించడాకి రక్తహీనతను భరించడానికి సిద్ధమయ్యి 'హిస్టరెక్టమీ' ఒద్దని వలవల ఏడ్సిన నాదిరా బేగం కోసం కన్నీళ్ళతో ఈ కథ)

# ప్రపంచ పాత్రికేయుడు, పరిణత కవి డామ్ మొరేస్



**1938-2004**

*నేడు ప్రపంచీకరణ హోరెత్తి పోతున్నది. కాసులకు తప్ప మరి దేనికి విలువలేని రోజులివి. దేశాల మధ్య ఎల్లలు చెరిగిపోయాయని, ప్రపంచమే ఓ కుగ్రామంగా మారిందని చెబుతూ సామ్రాజ్యవాద దోపిడీ, దాని ననుసరించి వచ్చే విష సంస్కృతులు యధేచ్ఛగా చెలరేగిపోతున్నాయి. కాని నాలుగయిదు దశాబ్దాల క్రితమే ఓ ప్రపంచ పౌరుడి మాదిరి దేశదేశాలు తిరిగినా, చాలా కాలంపాటు పలు దేశాల్లో నివసించి పని చేసినా ఇలాంటి జాడ్యాలేమీ అంటని విశిష్ట వ్యక్తి డామ్ మొరేస్. చివరి రోజుల్లో తాను జన్మించిన భారతదేశానికే తిరిగి వచ్చి ఇక్కడి హిందూత్వ వాదుల మతోన్మాద మారణకాండను నిశితంగా ఖండించి ఆయన తన విలక్షణతను చాటుకున్నారు.*

**గుడిపూడి విజయరావు**

ప్రసిద్ధ కవి, పాత్రికేయుడు డామ్ మొరేస్ క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ 2004 జూన్ 2వతేదీన తన 65వ ఏట ముంబాయిలో కన్నుమూశారు. ఆయన జన్మించిందీ ముంబాయిలోనే. భారత దేశంలో పుట్టినా ఆయన తిరగని దేశం లేదు. ఒక్క అంటార్కిటికా తప్ప మొత్తం భూమండలం అంతా చుట్టివచ్చానని ఆయన చెబుతుండేవారు. ఆయన అనేక దేశాలలో పనిచేశారు. లండన్, హాంకాంగ్, న్యూయార్క్‌లలో పలు మేగజైన్లకు సంపాదకత్వం వహించారు. వియత్నాం, ఇజ్రాయిల్ యుద్ధాలలో విలేకరిగా పనిచేశారు. 1962లో అల్జీరియా విప్లవం, 1965లో ఇండోనేషియాలో కమ్యూనిస్టుల ఊచకోత గురించి కూడా వార్తలు సేకరించారు. ఐక్యరాజ్యసమితి అధికార ప్రతినిధిగా కూడ ఒకానొక సమయంలో వున్నారు. ఎక్కువ కాలం ఆయన ఇంగ్లండులో ఉన్నారు. బాల్యం మాత్రమే భారత దేశంలో గడిపిన డామ్ మొరేస్ ఇంగ్లండులో ఉన్నత విద్య అభ్యసించారు. ఆ తర్వాత కవిగా, రచయితగా, పాత్రికేయునిగా ఎక్కువకాలం విదేశాల్లోనే భారతదేశానికి అప్పుడప్పుడు వచ్చిపోతుండేవారు. భారతదేశంతో ఆయన తన అనుబంధాన్ని మరువలేదు. చివరికి భారతదేశానికే వచ్చి చేరుకున్నారు. ఇక్కడ ఆయన వివిధ పత్రికల్లో శీర్షికలు నిర్వహిస్తూనే తన ప్రవృత్తి కవిత్వాన్ని- మరింత గాఢంగా కొనసాగించారు. ఇంగ్లీషు మినహా, హిందీ కాని, మరే ఇతర భారతీయ భాష కాని ఆయనకు రాకపోవడం ఒక ఆశ్చర్యకరమైన విషయం. మౌలికంగా ఆయన ప్రజాస్వామిక, లౌకికవాది. ఆ భావాలను చిట్టచివరి వరకూ ఆయన వదిలి పెట్టలేదు. గుజరాత్ మారణహోమం జరిగినపుడు భయంకరమైన కాన్సర్ వ్యాధితో బాధపడుతూ సైతం ఆయన తన సహచరిణిని వెంటబెట్టుకొని ముంబాయి నుండి అహ్మదాబాద్ వెళ్లి ఆ ఘోరకలిని స్వయంగా తిలకించి తీరని ఆవేదనకు ఆగ్రహానికి గురయ్యారు. "నేను నివసించానని భావిస్తున్న దేశం అనేదే లేదనిపిస్తున్నది. ఇదో భయంకర అనుభవం." అంటూ బాధపడ్డారని ఆయన స్నేహితుడు చార్లెస్ కోరియా చెప్పారు. 'అవే ఫ్రం బిలీవర్స్' అనే పేరుతో పుస్తకాన్ని ప్రచురించి... డామ్ మొరేస్ ఈ దురంతంపై తన ఆక్రోశం వెలిబుచ్చారు. ఇలాంటి భావాలు, విలువలు కలిగిన వ్యక్తి రూపు దిద్దుకున్న వాతావరణం సహజంగానే అభ్యుదయ కరమైనదని వేరే చెప్పనక్కర లేదు. డామ్ మొరేస్ బాల్యం ఎంతో సుసంపన్న మయినది. వారిది సంపన్నమైన కుటుంబమే కాకుండా ఎంతో సంస్కారవంతమైన కుటుంబం కూడా.

డామ్ మొరేస్ తండ్రి ఫ్రాంక్ మొరేస్ కూడ పాత్రికేయుడు, రచయిత. ఆయన బారిస్టర్ చదివారు. కాని ఆయనకు సాహిత్యమంటే మక్కువ అధికం. అందుచేత ఆయన బారిస్టర్ వృత్తిని చేపట్టడానికి బదులు టైమ్స్ ఆఫ్ ఇండియాకు లిటరరీ ఎడిటర్‌గా చేరారు. ఆ తర్వాత ఆ పత్రికకు ప్రధాన సంపాదక బాధ్యత చేపట్టారు. టైమ్స్ ఆఫ్ ఇండియాకు ఫ్రాంక్ మొదటి భారతీయ ఎడిటర్. డామ్ మొరేస్ పూర్వీకులు గోవాకు చెందిన క్రిస్టియన్లు. ముంబాయికి వచ్చి స్థిరపడ్డారు. వారంతా విద్యాధికులు. మొరేస్ తాత ఇంజనీరుగా పనిచేశారు. మొరేస్ తల్లి మెరిల్ వైపువారుకూడ విద్యాధికులే. ఆమె తల్లిదండ్రులిరువురూ డాక్టర్లు. మెరిల్ కూడ వైద్య వృత్తినే చేపట్టారు. ఫ్రాంక్ మొరేస్ దంపతులు ఎంతో ఆధునిక భావాలు, అలవాట్లు కలిగిన వారు. ఇంట్లో ఇంగ్లీషు మాత్రమే మాట్లాడే వారు. పైగా ఫ్రాంక్‌కు ఇంగ్లీషు తప్ప మరో భాష రాదు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఇలాంటి జీవన శైలి కలిగిన వారిలో జాతీయవాద భావాలు పుష్కలంగా ఉండేవి. జాతీయవాదులతో సన్నిహిత సంబంధాలుండేవి. నెహ్రూ, గాంధీలను అభిమానించే వారు. జాతీయోద్యమంలో పనిచేస్తున్నవారు అనేక మంది వారింటికి వచ్చిపోతుండేవారు.

ఈ నేపథ్యం కలిగిన కుటుంబంలో డామ్ మొరేస్ 1938 జులై 19న జన్మించారు. ఆయన పుట్టి పెరిగిన వాతావరణం సహజంగానే ఆయనలో ఉన్నతమైన విలువలను పాదుకొల్పింది. సాహిత్యం పట్ల, రచనా వ్యాసంగం పట్ల ఆసక్తిని పెంపొందించింది. ముల్కరాజ్ ఆనంద్, జి వి దేశాని లాంటి సాహితీ ప్రముఖులు వారింటికి తరచూ వస్తుండే వారు. వారు ఆయన తండ్రికి మంచి మిత్రులు. 'మై సన్స్ ఫాదర్' (1968), 'నెవర్ ఎట్ హోమ్' (1992) అనే పేర్లతో రాసిన రెండు సంపుటాల ఆత్మకథలో డామ్ మొరేస్ తన బాల్యం గురించి, తల్లిదండ్రుల

గురించి వివరంగా తెలియ చేశారు. డామ్ మొరేస్ తండ్రి ఫ్రాంక్ తన కుమారుని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో చాలా శ్రద్ధ వహించేవారు. తన వృత్తిలో భాగంగా వివిధ దేశాల్లో పర్యటిస్తున్నప్పుడు డామ్‌ను కూడా వెంట తీసుకెళ్ళేవారు. ఫలితంగా డామ్ చిన్నప్పుడే ఆగ్నేయాసియా దేశాలను, పసిఫిక్ ప్రాంత దేశాలు, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, శ్రీలంకలనూ ఇతర దక్షిణాసియా దేశాలను సందర్శించారు.

ఆయన అతిపిన్నవయసులోనే కవిత్వం రాయడం ఆరంభించారు. 12 ఏళ్ల వయసులో తొలికవిత రాసిన డామ్ మొరేస్ 19 ఏళ్లకే తన తొలి కవితా సంపుటాన్ని ప్రచురించారు. దానికి అత్యంత ప్రతిష్టాత్మకమైన బ్రిటిష్ సాహితీ పురస్కారం హథాంర్నెండెజ్ ప్రైజ్ లభించింది. 1957లో 'ఎ బిగినింగ్' అనే పేరుతో ఈ సంపుటి ప్రచురించినపుడు మొరేస్ ఆక్స్‌ఫర్డ్‌లో చదువుతున్నారు. మొరేస్ ఆ పురస్కారం లభించిన అతి పిన్న వయస్కుడు మాత్రమే కాకుండా తొలి బ్రిటిషేతరుడు కూడ. ఆ తర్వాత వి ఎస్ నాయిపాల్, టెడ్ హఫ్స్, కోలిన్ థబ్రాన్, తిమోతి మో లాంటి వారికి కూడా ఆ పురస్కారం లభించింది. మొరేస్‌కు కవిత్వం గురించి భారత దేశంలో నిస్సిం ఈజెక్యెల్ సలహాలిస్తుండే వారు. ఇంగ్లండులో ఆయనను డబ్ల్యు హెచ్ ఆడెన్ బాగా ప్రోత్సహించారు. స్టీఫెన్ స్పెండర్ ఆయన కవిత్వాన్ని అచ్చువేశారు.

మొరేస్ 1960లో 'జాన్ నో బడీ' పేరుతోను, 1967లో 'బెడ్లామ్ అండ్ అదర్స్' పేరుతోను కవితా సంపుటాలను వెలువ రించారు. ఆ తర్వాత ఆయన కవితాసేద్యానికి సుదీర్ఘవిరామం ఏర్పడింది. పాత్రికేయునిగా, కాలమిస్టుగా, స్క్రిప్టు రైటరుగా, డాక్యుమెంటరీ చిత్రాల దర్శకునిగా పలు రకాల బాధ్యతలు నిర్వహించిన 17 సంవత్సరాల కాలంలో ఆయన కవిత్వం ఏమీరాయలేదు. ఈ కాలంలో ఆయన అనేక దేశాలు పర్యటించారు. దలైలామా టిబెట్ వదిలి భారత దేశం వచ్చిన వెంటనే మొరేస్ ఆయనను ఇంటర్వ్యూ చేశారు. నాజీ నేరస్తుడు అడాల్ఫ్ ఐక్మన్‌పై ఇజ్రాయెల్‌లో జరిగిన బహిరంగ విచారణను కూడ ఆయన కవర్ చేశారు. టైమ్స్ ఆఫ్ ఇండియా తర్వాత తన తండ్రి ఫ్రాంక్ మొరేస్ ఎక్కువ కాలం సంపాదకునిగా పనిచేసిన ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో కూడ కొన్నాళ్లు పనిచేశారు. తన వృత్తిని నిర్వహిస్తూనే ఆయన దాదాపు 30 పుస్తకాలు ప్రచురించారు. 1980లో ఆయన 'హెయిరెస్ ఆఫ్ డైనాస్టీ' (వంశానికి వారసురాలు) పేరుతో ఇందిరా గాంధి జీవిత చరిత్రను కూడ రచించారు. ఇవన్నీ అత్యధికం వచన గ్రంథాలు. పద్యమంటేనే తనకు మక్కువ

.............. ★ ..............

**భారత దేశాన్ని ప్రేమించడానికి ఏ భారతీయ భాష రాకపోవడం అవరోధం అని ఆయన ఎన్నడూ భావించలేదు. తన తండ్రికి కూడ ఇంగ్లీషు తప్ప మరే భాష రాదని అయినా ఆయన నూటికి నూరుపాళ్లు భారతీయునిగా గుర్తించ బడ్డారని మొరేస్ చెబుతుండేవారు. భారత దేశం అంటే ఇంత అనుబంధం పెంచుకోవడం వల్లనే గుజరాత్ మారణహోమానికి ఆయన అంతగా చలించి పోయారు.**

.............. ★ ..............

అని చెప్పే మొరేస్ కవిత్వంతో డబ్బు సంపాదించలేమని, బ్రతకాలంటే వచనం రాయక తప్పదని అంటుండేవారు. అయితే కవిత్వ రచనలో జర్నలిస్టుకు ఉండే వేగాన్ని ఆయన కనపరిచేవారు. ఎక్కడ అవసరమయితే అక్కడ తగిన పదం ఆయనకు అంత వేగంగా ఎలా స్ఫురిస్తుందోనని తోటి కవులు ఆశ్చర్యపడేవారు.

మొరేస్ ప్రపంచ దేశాలన్నీ తిరిగినప్పటికీ ఇంగ్లండు లోనే ఎక్కువ కాలం గడిపారు. అక్కడే వివాహం చేసుకున్నారు. ఆయనకు ఒక కుమారుడు కూడ ఉన్నాడు. కాని 1978లో భారత దేశానికి ఆయన ఒక్కడే తిరిగి వచ్చారు. ఇక్కడకు వచ్చిన తర్వాత ఆయన సరయూ శ్రీవత్సతో కలిసి జీవించారు. ఆయన సాహిత్యకృషిలో కూడ ఆమె పాలు పంచుకున్నారు. ఈ కాలంలో పలు పత్రికలకు రాశారు. ఆయన తన కవిత్వాన్ని క్రమంగా పునఃప్రారంభించారు. పాత వేగాన్ని పుంజుకున్న ఆయన కవిత్వం ఉధృతంగా కొనసాగింది. 1987లో ఓ కవితా సంకలనాన్ని ప్రచురించారు. 1990లో 'సెరెండిప్' పేరుతో ఒక సంకలనాన్ని, 2001లో 'ఇన్ సిన్నమాన్ షేడ్' పేరుతో మరో సంకలనాన్ని ప్రచురించారు. దీనికి సాహిత్యఅకాడమీ అవార్డు లభించింది. చివరిగా ఆయన గత ఏడాది 'టైప్డ్ విత్ వన్ ఫింగర్' అనే పేరుతో ఒక కవితా సంకలనాన్ని వెలువరించారు. 17వ శతాబ్దంలో భారతదేశం వచ్చిన బ్రిటిష్ పర్యాటకుడు థామస్ కోర్యాట్ గురించి 'ది లాంగ్ స్ట్రైడర్' అనే పేరుతో సరయూ శ్రీవత్సతో కలిసి ఆయన ఓ గ్రంథాన్ని రచించారు. గుజరాత్ దురంతంపై పుస్తకాన్ని కూడ ఆమెతో కలిసే రాశారు. డామ్ మొరేస్‌కు క్యాన్సర్ వ్యాధి సోకిందని కొద్ది సంవత్సరాల క్రితం గుర్తించబడింది. అయినప్పటికీ ఆయన ట్రీట్‌మెంట్‌ను నిరాకరించారు. రేడియో థెరపిలాంటి వాటితో తన శరీరాన్ని బాధపెట్ట దలచలేదని ఆయన చెప్పేవారు. ఆ వ్యాధి క్రమక్రమంగా ఆయన దేహాన్ని, చివరికి ప్రాణాలను హరించివేసింది.

భారత దేశంతో ఎంతో అనుబంధాన్ని పెంచుకున్న మొరేస్ ఇక్కడి సంస్కృతిలోని అభివృద్ధినిరోధకతను, మతోన్మాదాన్ని, హింసాధోరణులను ఏ మాత్రం వెనకాడకుండా ఖండించేవారు. 1950లలో తాను చూసిన భారత దేశాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ మొరేస్ తన చివరి రోజుల్లో ఇలా అన్నారు: "దేశమంతా ఏడాది పర్యటించిన తర్వాత నాకు మూడు రకాల భారత దేశాలున్నట్లు అర్థమయింది. ఒకటి, నగరాల్లో కనిపించేది. అదంటే నాకు ఇష్టంలేదు. రెండోది, పూర్తిగా భిన్నమైనది. దాన్ని పల్లెసీమల్లో చూశాను. అదంటే నాకు జాలి. అయితే అది నాకు అర్థం కాలేదు. మూడోది, బహుశా ఇప్పుడు లేదు. అది ఉండి ఉన్నట్లయితే ఎంతో అందంగా ఉంటుంది." భారత దేశాన్ని ప్రేమించడానికి ఏ భారతీయ భాష రాకపోవడం అవరోధంగా ఆయన భావించలేదు. తన తండ్రికి కూడ ఇంగ్లీషు తప్ప మరే భాష రాదని అయినా ఆయన నూటికి నూరుపాళ్లు భారతీయునిగా గుర్తించ బడ్డారని మొరేస్ చెబుతుండేవారు. భారత దేశం అంటే ఇంత అనుబంధం పెంచుకోవడం వల్లనే గుజరాత్ మారణహోమానికి ఆయన అంతగా చలించి పోయారు.

నేడు ప్రపంచీకరణ హోరెత్తి పోతున్నది. కాసులకు తప్ప మరిదేనికి విలువలేని రోజులివి. దేశాల మధ్య ఎల్లలు చెరిగి పోయాయని, ప్రపంచమే ఓ కుగ్రామంగా మారిందని చెబుతూ సామ్రాజ్యవాద దోపిడీ, దానిననుసరించి వచ్చే విష సంస్కృతులు యథేచ్ఛగా చెలరేగిపోతున్నాయి. కాని నాలుగయిదు దశాబ్దాల క్రితమే ఓ ప్రపంచ పౌరుడి మాదిరిగా దేశదేశాలు తిరిగినా, చాలా కాలంపాటు పలు దేశాల్లో నివసించి పని చేసినా ఇలాంటి జాడ్యాలేమీ అంటని విశిష్ట వ్యక్తి డామ్ మొరేస్. చివరి రోజుల్లో తాను జన్మించిన భారతదేశానికే తిరిగి వచ్చి ఇక్కడి హిందుత్వ వాదుల మతోన్మాద మారణకాండను నిశితంగా ఖండించి ఆయన తన విలక్షణతను చాటుకున్నారు. ప్రపంచీకరణ, మతోన్మాదాలపై పోరాటాన్ని మరింత ఉధృతం చేయాల్సిన కర్తవ్యం నేడు మన ముందుంది. అలాంటి తరుణంలో మొరేస్ లాంటి ఉన్నత విలువలు, సంస్కారం కల్గిన వ్యక్తి మరణించడం ప్రజాస్వామిక, లౌకిక పురోగామి శక్తులకు తీరనిలోటు.

❖

# బతుకే కళ

దర్భశయనం శ్రీనివాసాచార్య



Born to win అన్నవాడికో నమస్కారం
ఇవాళ గెలవడానికే బతుకట!

✣ ✣

పొద్దున్నే లేచి అరచేతుల్ని చూసుకుంటే
ఒక ఆకుపచ్చ దృశ్యం
అరచేతుల్లో పత్రాలూ పత్రాల్లో నదుల్లా ఈనెలు
నేను చెట్టునైనట్లు ఒక అందమైన ఊహ!
మిత్రుడితో అన్నాను
ఇవాళ ఒక ఊహ బతికించిందీ అని!
అతనన్నాడు
ఊహ రాశికా రంగానికా
ఎందుకు పనికొస్తుందీ అని!
గెలుపుకు పనికిరాని
ఊహలూ ఉపమలూ ఉత్త చెత్త అనీ!
అతనేనా అన్నదిలా
ఇపుడు దేశాలకు దేశాలే అంటున్నాయి
ఇది పోటీ కాలమనీ!
గెలుపే నాగరికత అనీ!
గెలుపొక్కటే బతికిస్తుందీ అని!

✣ ✣

పగటికీ రాత్రికీ నడుమ
వర్ణాలు మార్చుకుంటున్న ఆకాశాన్ని
చూస్తుంటే
ఓ సముద్ర నీలిమలో రంగులెన్నో
స్నానిస్తున్నట్లనిపించింది
మిత్రుడితో అన్నాను
ఇవాళ మనసు ఆకాశమై పోయిందీ అని!
అతనన్నాడు
ఆకాశాలూ అష్టదిక్కులూ
సముద్రాలూ మహారణ్యాలూ
విశాల ప్రతీకలన్నీ పాతశతాబ్దంలో
సమాధై పోయాయీ అని!
అతనేనా అన్నదిలా
ఇపుడు దేశాలకు దేశాలే
వెబ్‌సైట్లలో ఒదిగిపోయాయి కదా
విజయాల కోసం విశాలత్వాలెందుకని
విజయమొక్కటే ఉనికి చిరునామా అని!

✣ ✣

నన్ను నేను తీసుకెళ్ళి
పొలాల త్యాగాల దగ్గర నిల్చోబెట్టుకున్నా
నాగలి దున్నుతుంటే
నాగరికత కదులుతున్నట్లనిపించింది
మిత్రుడితో అన్నాను
ఇవాళ కర్రుతాకిన మట్టినైపోయానని!
అతనన్నాడు
కంప్యూటర్ చేతుల మీటల కాలంలో
మట్టి పాదాలకు చోటెక్కడని!
అతనేనా అన్నదిలా
పొలాల అంచుల్లో వేలవేల పల్లెటూళ్ళు
పెళాపెళా కూలిపోతుంటే
వినపడుతున్న చప్పుళ్ళ సారాంశమేంటి
నాగలికీ కంప్యూటర్‌కీ పోటీ!
గెలిచిందానిదే బతుకట!

✣ ✣

నన్ను నేను విడిపించుకుని
అలా రోడ్డు మీదికెళ్ళాను
ఓ పరిచితుడు విసవిసా అపరిచితుడిలా
వెళ్ళిపోయాడు
అపరిచితుడొకడు హఠాత్తుగా పరిచితుడిలా
కౌగిలించుకున్నాడు
మిత్రుడితో అన్నాను/నిన్నటి కరచాలనాలూ
కరవాలాలూ ఏవీ లేవు
దారి తప్పినట్లున్నానూ అని!
అతనన్నాడు
దారిపాతదే! ముఖాల్లోనే మార్పు!
గుర్తుపట్టాలంటే నటన తెలియాలీ అనీ!
అతనేనా అన్నదిలా
ఎటు చూసినా అన్ని రోడ్లలో
క్షణక్షణానికి మారిపోతున్న ముఖాలు
ఇవాళ ముఖం కోసం కాదు గెలుపు
గెలుపు కోసమే ముఖాలకు
రకరకాల ముసుగులు!

✣ ✣

ఊళ్ళో కాలేజ్ హాస్టల్లో
కుర్రాడొకడు ఉరిపోసుకున్నాడు
ఒక తల్లీ ఒక తండ్రీ
భూమీ సూర్యుడూ
సగం మరణించినట్లనిపించింది
మిత్రుడితో అన్నాను
చదువు బతికించాలి కదా
ఎలా చంపుతుందీ అని!
అతనన్నాడు
చదువులో అర్థంలేని పోటీ చంపింది
పోటీలో ఇమడలేక అతను బలి అని!
అతనేనా అన్నదిలా
పోటీలు తొక్కిళ్ళలో
ఊపిరి కోల్పోతున్న అన్ని సున్నితత్వాల
నిశ్శబ్ద నిష్క్రమణ ఇదే!

✣ ✣

ఆఖరికి చుట్టూరా చూస్తు చూస్తూ
ఇక మిత్రుడే అన్నాడు
నిన్నటికీ ఇవాళ్టికీ పోటీ
ఇవాళ్టికీ రేపటికీ పోటీ
మనిషికీ మనిషికీ పోటీ
మనిషికీ యంత్రానికీ పోటీ
కాలానికీ మనిషికీ పోటీ
గెలిస్తేనే రాజ్యమైనా, రాణింపైనా
ఓడితే బతుక్కి సమాధే అని!
రెండు శతాబ్దాల్ని వెంటేసుకుని
అనాది కాలాన్ని నెమరేసుకుని
నేనన్నాను
మిత్రమా!
బతుకంటే గెలుపు కాదు, అపురూప ప్రయాణం
అని!
నేనేనా అన్నదిలా
మట్టి మట్టంతా సాక్ష్యమై నిలుస్తుంది
చెట్లు కూలి మట్టయ్యాయి
మట్టి వెకిలి చెట్లు లేచాయి
ప్రయాణంలో గెలుస్తాం ఓడుతాం
గెలుపులోనూ ఓటమిలోనూ
బతుకుంది ఉంటుంది
బతకడమే ఒక కళ!
'Born to win' ఒక అసంపూర్ణ పదబంధం
'Born to love' ఒక విశాల జీవ నినాదం
బతుక్కి బతుకే వ్యాఖ్యానం
బతుకన్నాక
కాసిన్ని వెన్నెల్లూ
కాసిన్ని కన్నీళ్ళూ
వెన్నెలా జీవితమే
కన్నీరూ జీవితమే!

# సుశీల

"ఏందే! మణిసి మాటంటే అంత నీళ్ళ సెల్లాటం పనికిరాదమ్మాయ్! అవతల మణిసి పిలుస్తుండాడు. ఇవతల నేను కేకలేస్తుండాను అంత వద్దారం పనికిరాదు. కాస్తై సంసారి దాన్లాగా ఉండు. మరీ అంత లెక్కలేనితనమైతే ఎట్టమ్మాయ్! తరవాత టాయిలేటు అవుదువుగాని, ముందు వాడికి కూడుబెట్టవే" అంటూ కేకలేసింది కోటేశ్వరమ్మ.



మంచికంటి

"కంపెనీకి పోయే యాళయింది. అందరూ ఎప్పుడో బోయారు. పక్కింటి జయమ్మ ఎప్పుడనంగా కేకేసిందో ఇన్లేదా! నాలుగు పనులూ జవిరచ్చుకోని పరుగులెత్తుతా ఉంటే కనపళ్ళేదా!" అంటూ తల చిక్కుదీసుకుని జడేసుకుంది.

"అదిగాదే, వాడికి కూడు బెట్టేతలికి ఎంత ఆలిసెమైద్ది చెప్పు?" అంది మళ్ళీ అదే స్వరంతో కోటేశ్వరమ్మ

"అమ్మా తల్లీ! నీకొక దణ్ణం బెడతా. నీది మరీ అత్తసోప అయింది గదే నాకు. మంచంలో చచ్చిందానివి సావక నా యెదాన బడతావెందుకు? ఆడ నాలుగడుగులాలిసెమైతే చాలు గేటు నూకుతారు. నీకేం, నడిమంచంలో కూర్చోని మారాజు మాటలు మాట్టాడతావు. కూడేగిదా! పెట్టుకోని తింటానికేం మాయరోగమా!

"నాకుండయ్యి రెండు చేతులేగా! నీ కన్నీ నడిమంచంలోకి అందియ్యాలా పిల్లోణ్ణి సవిరిచ్చుకోవాలా! రాత్రింబగుళ్ళు మీ కోసమే రెక్కలు ముక్కలు జేసుకుంటన్నా పాపమని అన్నోళ్ళే లేరుగదా!"

ఈ మాయదారి బతుకు బతికేకంటే కళ్ళు మూసుకోని ఆ ఉప్పునీళ్ళబాయిలో దూకి చస్తే బాగుండు" అంటూ కేరేజీ తీసుకుని వాకిలి దాట బోయేసరికి వెనగ్గా వొచ్చిన నారాయణ చెయ్యిబట్టుకొని విసురుగా ఒక్క లాగులాగేడు.

ఊహించని ఆ కుదుపుకి సుశీల వెనక్కువాలింది. చేతిలో కేరేజీ కిందపడి గిన్నెలు వేరైపోయాయి. అన్నం చెల్లాచెదురైపోయింది.

"నీయమ్మ కడుపుగాల. నీ యెదాన బెట్టుకున్నావు! నిన్ను దల్చుకుంటా మజ్జేనం పేగులు కాల్చుకుంటాలే!" అంటూ కళ్ళల్లో ఊరే నీళ్ళతో బయట పడింది సుశీల.

అప్పటికే రోడ్డు మీద ఒక్క పురుగులేరు. అందరూ ఎప్పుడో వెళ్ళిపోయారు. నా తలరాత ఇట్టా ఉంటే చేసేదేముంది. నాయెదానొక గుదిబండని తగిలిచ్చింది. చాలక, దీని సతాయింపుతో చస్తుండా! పొద్దస్తమానం ఆ బాయిలేరు కాడ సచ్చిసున్నమై రొండు డూటీలు చేసినా, అరవై రూపాయలు చేతిలో బెట్టేతలికి కనా కష్టమైపోతుండే, ఇల్లూ వొళ్ళూ గుల్లజేసుకోని ఇంటికొచ్చే సరికి ఈ తంతయిపోయే! ఏం ఆ మారాజుకేం మాయరోగమా! కుంబం పగలగొట్టకోలేడా! తెల్లారేతలికి కడుపులో ఎలికలు తోడతయ్యి లాగుంది. ఆయన జేసే శాకిరీ ఏందంట? నాలుగ్గొడ్లు తిప్పకొస్తాడు. ఇంటి మీద పడి తింటాడు. దానికే కొండకట్టెలూ కోనేటి నీళ్ళూ తెచ్చినట్టు తెగనీలుగుతాడు.

అసలీ ముసిలి ముండననాలి. దీని అలుసు జూసుకోని వాడట్టా మిడిసిపడుతుంటాడు. నేం గూడా మూలన పడితేగానీ

రొండు చేతుల్తో తింటారు. వొళ్ళంతా పుచ్చిపోయి రసిగారతా ఈగలు ముసురుతున్నా అన్నీ సవిరిచ్చుకుంటా చిన్నపిల్లలకి జేసినట్టు బరిస్తుండేది చాలక, పైగా మాటలొకటి.

ఇంట్లో ఈగోలిట్టుంటే ఆడేమో ఆ యెదవ అల్లాడిచ్చి ఆకులు మేపుతుండాడు. యాడకనబడితే ఆడ ఒకటే సతాయిస్తా ఉండాడు. కాస్త తోలు ఎరుపుగా, మొకం నదురుగా కనబడితే చాలు చొంగ కార్చుకుంటా తిరుగుతాడు. సూపర్‌వైజర్‌గాడయిపోయేడు, లేకపోతేనా! యెదవ ఎప్పుడేమి జేస్తాడో ప్రాణాలు బిగబట్టుకోని పన్లోకి రావాల్సొస్తంది

ఇంకో కంపెనీకి పోదామంటే, ఆడా ఇట్టాంటి ముట్టుబట్టలుండరని గేరంటీ ఏంది? యాడైనా రూపాయికి ఆరణాలేగా! ఏరాయైతే ఏం! పళ్ళురాలగొట్టుకోవడానికి. అటుపోయి ఇటుపోయి రెంటికీ చెడ్డరేవడి కావడమెందుకు అనుకుంటూ ఊరుదాటింది. అయ్యో చూపు ఆనినంత దూరం ఒక్క మనిషన్నా కనబడ్డంలేదే అనుకొని చెంగుపైకిలాగి, బొడ్లోదోపుకుని పరుగులంకించుకుంది.

ఎంత పరుగుపరుగున వొచ్చినా గేటు ఎయ్యనే ఏసేరు. అనుకుంటానే మూసేసిన తలుపుని తోసుకుని లోపలికి పోతోంది.

ఎదురుగా కోటయ్య "ఏ లోకానుండావు. కళ్ళ ముందున్న మడిసి కూడా కనబడ్డంలేదా! ఇప్పుడే సుధాకర్ సూపరైజరొచ్చి గేటేయించి ఎవురొచ్చినా తియ్యొద్దన్నాడయమ్మా" అన్నాడు కోటయ్య.



"యేందయ్యా ఇదొక వేషమైపోయింది. టయానికి ముల్లు జూసి బల్లగుద్దినట్టేనా గేటెయ్యడం. కాస్తంత యెనకా ముందూ ఉండదా ఏంది? అప్పటికి మీరేందో గంటల ప్రకారము పని చేయించుకుంటా ఉండట్టు. మా చేతులు పడిపోయేటట్టు ఎట్టా జేయించు కుంటందీ ఆ మాత్రం తెలియదామాకు. మాకు కూలిచ్చే లెక్కల బొక్కు ఒకటీ, దొంగ ముష్టర్లేసే బొక్కొకటి. ఎవుడికి తెలియని బాగోతంలే" అంటుండగా సుధాకర్ అటుగా వొచ్చాడు.

"ఏం కోటయ్యా! ఏంది? పాయింట్లుబాగా లాగుతుందయ్యా" అన్నాడు కోటయ్య

ఇదుగో సుశీలా నీకు రోజూ ఇదే తంతయిపోయింది. రోజుకొక కత జెపుతుంటావు. ఇయ్యాల తలుపుతీసే పనేలేదు. నువ్వెబో కోటయ్యా" సుధాకర్ అనడంతో కోటయ్య లోపలికెళ్ళాడు.

సుధాకరా సుధాకరా ఇయ్యాల్టికి తియ్యవా! మా ఇంటికాడ సంగతులు తెలియనియ్యేంగాదుగదా! కాస్తె పెద్ద మనసు చేసుకో" అంటూ బతిమలాడింది.

"సుశీలా ఎంత మనసైనా చేసుకుంటా! అన్ని సంగతులూ తెలిసే కదా నిన్నడుగుతుంది. నువ్వు ఊ... అన్నావంటే, ఇంక నీకు బతిమలాడ్డాలూ బంగపడ్డాలూ ఉండవు కదా! ఎందుకంత నీలుగు తుండావు, మీ ఆయన ఎన్నెన్ని తిప్పలు బెట్టేదీ నాకు తెలియదా" అంటూ నసబెట్టాడు.

"రాత్రి పదిగంటల్దాకా దూటీ చేశానా! సీకటి మొకంతో లేసినా ఇదిగో ఇయ్యాల్టిప్పుడయింది. పని తెవిలిచ్చుకోని రావడానికి ఇప్పుడు నీతో వాదించే ఓపికలేదుగానీ ఇయ్యాల్టికిపోనియ్యి" అంటూ ఏడుపు మొకంతో గేటు మీద చెయ్యేసింది.

"ఇయ్యాలేగాదు రోజూ పోదువుగానీ. మాయిటి పూట కంపెనీ వొదిలినాక నీ కోసం చూస్తాడంటా. నీ ఇష్టం సుశీల" అంటూ గేటు తీసి ఆఫీస్ రూమ్ వైపు వెళ్ళిపోయాడు.

పోర్నాబట్టా ఎట్టాంటోళ్ళు పోతుండారు. నీకు రాలేదు. ఎంత మందిని పాడు జేస్తావురా! ఎప్పుడు దూము తగిలిపోతావో! ఈ కంపిని ఈడి అబ్బ సొమ్ములాగా ఇదైపోతుండాడు. ఆడదాన్ని చూస్తే పుట్టుద్దిరిమ్మ తెగులు. ఎవురి సేతిలో పడతాడోగానీ కుమ్మ సుద్దంగా నలగ్గొడతారు. అనుకుంటూ మిషన్ హాల్లోకి అడుగు బెట్టింది సుశీల

"ఏందీ సుశాలా! బాగా కాక మీదుండావే ఏంది సంగతి?" అన్నది మేస్త్రీ వెంకాయమ్మ.

"ఆ ఏముందీ! మనకొకకడుళ్ళా ముట్టుబట్ట. మన ఉసురు తగిలి ఎప్పుడుపోతాడో!" అంటూ కొంగుదోపుకొని వొంగి పనిలోకి దిగింది.

"ఎవురా గేట్లు ఏయిచ్చే ఆడంగిలోడా" అన్నది వెంకాయమ్మ

"ఆ వాడే సందు దొరకగూడదు. మిర్రి మిర్రి జూస్తాడు. కొంగు కనపడితే చాలు కాళ్ళూ చేతులూ కొంగర్లు పోతయ్యి" అంటూ పొగాకు పనదీసి గ్రేడింగ్ బల్లమీద పెట్టింది.

"ఇంకాపవే పాపం నీతిట్లు తగిలే పోతాడేమో! ఊరన్న తరవాత వల్లకాడుండట్టు పొగాకు కంపినీ అన్న తరవాత ఇట్టాంటోళ్ళు ఉంటారు గానీ, ఇట్రా నువ్వు బల్ల దగ్గిరకొచ్చి ఆకు జరుపు" అని వెంకాయమ్మ అనడంతో సుశీల గ్రేడింగ్ బల్ల దగ్గరకొచ్చింది.

ఇంకరారా ఎంకట్రావ్. వొచ్చి పెట్టెకట్టు అనడంతో వెంకట్రావు వొచ్చి చెక్కలు తీసుకుని బోల్టులు బిగించి కింద అట్టవేసి పెట్టెలోకి ఎక్కాడు. దానిలో వేసే పుగాకును అణగదొక్కడానికి.

"ఏంది? మేస్త్రీ ఇయ్యాల సుశీల మొకంలో సీమటపాకాయలు పేల్తుందయ్యా" అన్నాడు వెంట్రావు సుశీలవైపు చూస్తా.

"ఇంకా కన్ను పళ్ళేదూ.. ఏందా! నోరు మెదపలేదు ఏందా! అని చూస్తుండాను. మొదలు బెట్టేవా! ఏముంది నాయనా మామూలేగా! మీ మగమారాజుల్తోటి ఎప్పుడూ ఉండేదేగా! ఇయ్యాలేమన్నా కొత్తా మాకు" అంటూ సర్దిన పొగాకుని పెట్టెలో వేసింది.

"ఏంది సుశీలా అట్టంటావు! నువ్వంటే సుధాకర్‌కి వల్లమాలిన అభిమానమైతే. నువ్వు అట్టా తిడితే ఎట్టా!" అన్నాడు వెంకట్రావు.

"ఒరేయ్ ఎవురితోనంటే వాళ్ళతోగాదు నీ ఎగసికాలు. మాట్లాపి ముందు పనిజూడు" అంటూ విసుక్కుంది వెంకాయమ్మ.

"సుశీలా.. సుశీలా అటు జూడు... అటు జూడు.. పెళ్ళయిన రొండు నెల్లు అయిందోలేదో నాగమ్మ జూడు బొళిక్కి బొళిక్కి మని కక్కుతుంది" అన్నాడు వెంకట్రావు మాట మారుస్తా.

"ఒరే కోతోడా దానికి నాలుగు రోజుల్నుంచి ఒకటే జొరంరా! ఆ శూర గోతాలకి ఎత్తీ ఎత్తీ పీల్చింది పీల్చినట్టే ఉండే. అసలాడ ఎవురు పని చేసినా అంతే ముక్కుల్నిండా, నోటినిండా శూర పీల్చిపీల్చి పసురు ఎగదన్నుకొచ్చిద్ది. వాంతులు గాకేం జేస్తయ్యిగని మాటలాపి పని జూడరా ముందు. యాడేడ సంగతులన్నీ నీకే గావాల. ఔటేల గావొస్తంది, కానియ్ కానియ్" అంటూ రుసరుసలాడింది వెంకాయమ్మ.

"అబ్బా ఆ మాటెత్తబాక తల్లీ... సీదర బుడతంది.. ఔటుకు పోవాలంటేనే బయ్యం పుడతంది. ఇంత పెద్ద కంపినీ బెట్టుకోని కోట్లు కోట్లు సంపాయిచ్చుకుంటన్నారుగానీ, రవ్వంత షెడ్డు కట్టించటానికేం పోయే కాలం చెప్పు. అటు బోతే రోడ్డు, ఇటుబోతే రైలు కట్ట. వొచ్చే వోళ్ళు పోయేవోళ్ళు రామందాడి అయిపోయా! ఉగ్గబట్టుకోని ఉగ్గబట్టుకోని

ఇంటికిపోయి పోసుకోవాల్సొస్తందమ్మా. దీనివల్ల మంచి నీళ్ళు తాగాలంటేనే బయమేస్తంది, ఎప్పుడెప్పుడు పోవాల్సి వస్తదోనని" అంది వారం క్రితమే కొత్తగా పన్లోకి జేరిన సుబ్బాయమ్మ.

"ఓ యబ్బ కూతరా! లోకానికి ఇరుద్దంగా దీనికొక్క దానికే ఉందమ్మా. యాడలేని సోద్దెం గాకపోతే ఎన్నేళ్ళ నించి ఈ కంపినీలో పని చేస్తుండాము" అంటూ చురక అంటించింది రాములమ్మ.

★★★

ఎప్పట్లాగే ఆ రోజు కూడా ఆలస్యంగా వొచ్చింది సుశీల. అయితే ఆ రోజు పద్మతో కలిసి వొచ్చింది.

కావాలనే గేటు దగ్గర తచ్చాడుతున్నాడు సుధాకర్. మొన్న తప్పిచ్చుకున్నావ్. ఇయ్యాల ఎక్కడికి పోతావు అన్నట్టుగా ఉన్నాయి ఆ చూపులు. సుశీల మాట్లాడకుండా తలొంచుకుని నిల్చుంది. గేటుదానంతట అదే తెరుచుకుంది.

పద్మా, సుశీలా మౌనంగా లోపలికెళ్ళిపోయారు.

ఆ రోజు పొద్దుటి నుండి పరధ్యానంగానే పని జేసింది సుశీల. రాత్రి జరిగిన ఘర్షణ తాలూకు అలసట, వొళ్ళు హూనం జేసిన నారాయణ పిడిగుద్దులు వొంట్లో శక్తినంతా ఎవురో పిండేసినట్లు నీరసం ఆవహించింది. గతిలేక పన్లోకొచ్చిందిగానీ, లేకుంటే ఇంట్లోనే పడుకుందామనుకుంది. ఆ గోగునసకంటే ఇదే నయమనీ, పనిలో బడితే అదే పోద్దిలే అనుకుని వొచ్చింది. ఆ రోజు ఎవురెంత కదిలించాలని చూసినా ఉలుకూ పలుకూ లేకపోయేసరికి సుశీలతో ఎవరూ మాట్లాడలేదు.



సాయంత్రమయ్యింది. హాలంతా చిమ్మి శుభ్రం చేస్తున్నారు. పైన బడిన పొగాకుని అందరూ విదిలించుకుంటున్నారు. సుశీల కూడాపొగాకు దులుపుకుని కుచ్చిళ్ళు సరిచేసుకుని కొంగు నడుము చుట్టూ తిప్పి బొడ్డు దగ్గర దోపుకుంది.

"వెంకాయమ్మొదినా! వొంట్లో బాగలేదు నేనొస్తానింక" అంటూ కేరేజీ తీసుకుంది సుశీల.

"సరే నువ్వు పద. మేము యెనకా ముందూ జవిరిచ్చుకోని వస్తాము" అనింది వెంకాయమ్మ.

అడుగులో అడుగేసుకుంటా ఉసూరుమంటా బయలుదేరింది సుశీల. మిషను హాలు దాటింది. మొదటి షెడ్డులో నుండి రెండో షెడ్డులోకి అక్కణ్ణుండి బయటి వాకిలి ద్వారా బయటికి రావాల. షెడ్లలో చీకటి చీకటిగా ఉంది.

మొదటి షెడ్డులో నుండి రెండో షెడ్డులోకి అడుగుబెట్టిందో లేదో ఎవురో వొచ్చి మీద పడ్డట్టు అదిరిపడి పెద్దగా కేకవెయ్యబోయింది. నోటికేదో అడ్డం బడింది. చీకట్లో పరీక్షగా చూస్తే చెయ్యి కనబడింది. చెయ్యినోటి కడ్డంగా బెట్టి "అరవబాక. నేనేలే" అంటూ గుసగుసలాడేడు సుధాకర్.

అప్పుడు అర్థమైంది సుధాకరని

"మర్యాదగా అరవకుండా నేను చెప్పినట్టువింటే బాగుంటది. లేదంటే రేపటి నుండీ నీ గతి కుక్కలు కూడా పడవు" గుసగుసగా అంటూ పొగాకు చెక్కుల వైపు లాగేడు.

ఊహించని సంఘటనకు బిత్తరపోయిన సుశీల వెంటనే తేరుకుంది.

అంతే పెద్దగా "ఓ యెంకా యమ్మొదినో, సుబ్బాయమ్మొదినో, కాంతమ్మో అంటూ కేకలు వేసింది.

క్షణంలో తప్పుకొబోయిన సుధాకర్ నెత్తిమీద టపాటపా ధనాధనా ఖాళీ కేరేజీలు మోతలు మోగేయి. అందరికీ అతను సుధాకర్ అయి ఉంటాడని తెలిసినా, "ఎవుడే ఈ దొంగ యెదవ" అంటూ తలా ఒక పోటు పొడిశారు. అందర్లో అంతర్లీనంగా అణిగి ఉన్న కోరిక తీర్చుకున్న తృప్తి అందరి మొఖాలలో తాండవ మాడింది.

కుక్కిన పేనులాగా పడున్న సుధాకర్ మెల్లగా పిల్లిలాగా బయటికి జారుకుంటంటే, "సుధాకరన్నా నువ్వా... అరెరె..." అని తలోమాట అంటూ వొచ్చేనవ్వుని ఆపుకుంటా దారిచ్చేరు.

"మంచి జాస్తి జరిగిందిలే యెదవ మొకమోడికి, ఎప్పుడా ఎప్పుడా అని అందరూ ఎదురు చూస్తుండారు. ఇంక మళ్ళీ ఎవురి జోలికీ రాకుండా ఉండాల" అనుకుంటూ అందరూ బైటకొచ్చేరున.

★★★

"వొదినా ఇయ్యాల బోనసులు ఇస్తారంటగా నిజమేనా!" అంది సుశీల.

"ఇస్తారంటగనీ! బాగా పొద్దుపోద్దిగదే! అసలే దగ్గుతున్నట్టు ఉండావు. వొంట్లో నలతగా ఉండట్టు ఉందిగదే అమ్మాయ్. ఆ బోనసు లిచ్చేకాడ ఆ ముచ్చుమొకమోడేగా ఉండేది. మనల్ని జూసాడంటే కారాలూ మిరియాలూ నూరతండాడు" అంది వెంకాయమ్మ అనుమానంగా.

"తప్పేదేముందలే వొదినా! ఎంతాలిస్సెమైనా ఉండాల్సిందే! నాకెట్ట ఉండాగానీ, ముందు మమ్మికి మందులైపోయినియ్యి. పిల్లోడికి కూడా వొంట్లో సరిగ్గాలేదు. తప్పదుగా పద్మ కూడా తోడు ఉంటానందిలే" అంది సుశీల.

బోనసులు తీసుకునే వాళ్ళు ఒక్కొక్కరే ఆఫీసు రూము వైపుకు వస్తున్నారు. లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. గ్రేడింగ్ షెడ్లు చుట్టూ ట్యూబ్‌లైట్లు మిరుమిట్లు గొలిపే కాంతిని వెదజల్లుతున్నాయి.

వొచ్చిన వాళ్ళందరూ మెట్లమీద, చెట్లమీద చతికిలబడి కబుర్లలో మునిగిపోయారు.

వొచ్చిన వాళ్ళంతా చూసీ చూసీ కళ్ళు కాయలు గాసిన తరువాత అప్పుడొచ్చాడు సుధాకర్.

"అబ్బో ఈ సచ్చినోడేనా! అందుకే ఇంత పెందలాడే వొచ్చాడు. ఈడు కావాలనే ఆలిస్సెంజేస్తాడు తల్లా" అంది ఒకామె.

వొచ్చీ రావడంతో అందర్నీ తేరిపారజూశాడు. సుశీల తప్పకుండా ఉంటదని వెతికాడు. సుశీల వైపు చూడడంతో సుశీల తలదించుకుంది.

ఎదురుగా కూర్చున్న వాళ్ళను చూస్తా, రిజిస్టర్‌లో పేర్లు రాసుకుంటా పేర్లు పెట్టి పిలవడం మొదలుపెట్టాడు. అయితే పిలిచే పేర్లన్నీ మగవాళ్ళవి కావడంతో ఆడవాళ్ళు కొంతసేపు ఎదురు చూశారు. ఇంక మొగోళ్ళందరూ అయిపోతేనే ఆడవాళ్ళమి" అంటూ గుసగుసలు మొదలయ్యాయి.

"అదేంది సుధాకరా ఇళ్ళకిబోయి పనులు చేసుకునేది మేము వొండి వొడ్డించేది మేము. పిల్లల్ని సముదాయించేది మేము. అట్టాంటిది మమ్మల్నొదిలేసి, ముందు మొగోళ్ళని పిలుస్తుండావు నీకేమన్నా న్యాయంగా ఉందా!"

వాళ్ళదేముంది ఇళ్ళకి బోయి అరుగుల మీద పెత్తనాలు జేసేవాళ్ళేగదా! అంటూ గుంపులో నుండి ఒకామె అరిసింది.

"మీకేం దెలుసు! మొగోళ్ళకే బోలెడు రాచకార్యాలుంటై.

అదీగాక వాళ్ళు కొద్ది మందే ఉన్నారుగా, తొందరగా అయిపోతారులే, అని నిర్లక్ష్యంగా సమాధానమిచ్చాడు.

"ఈ యెదవ మొకమోడు అస్సలు మనము జెప్పేది దూరుసుకోడమ్మా! మొన్న మామూలుగా బోయింది. ఇంకాస్తె ఇరగ బొడిస్తే కొన్ని రోజులు మంచములోనన్నా పడి ఉండేవోడు" అంటూ సన్నగా గొణిగింది పద్మ.

"ఊరుకోయే మనకెందుకు! వాడు యాడచస్తే చీకటేగా పడితే పడిందిలే. ఒక్క రోజుకి ఏమీ కొంపలంటుకుపోవులే" అంది సుశీల.

"మీకేమమ్మా! ఇంటికి పోయేతలికి మీ ఆయన అన్నీ రడీగా చేసిపెట్టి ఉంటాడు. మేము బోయి ఇంటెడు శాకిరీ జేసుకోవాల" అంటూ సుశీలను ఉడికించింది పద్మ.

"ఎందుకులేయే అంత పరాశికాలు. ఎవురిళ్ళకాడ ఎవురు జేసి పెడతండారో అందరికీ తెలుసులే" అంది సుశీల పమిట చెంగుతో కళ్ళొత్తుకుంటా.

"చా...చా ఊరుకోయే. నీ సంగద్దెలిసి కూడా అనవసరంగా పరాసికాలాడేనే! నీ మొగుడు సంగణి అసరసందేళ ఎత్తకుండా ఉండాలిసింది. కళ్ళనీళ్ళు బెట్టబాకు. ఆ మొండి బండోడి సంగతి నాకు తెలవదా! ముప్పొద్దులా మూడు పూటలూ తింటాడు. అటు పుల్లదీసి ఇటు పెట్టడు ఎవురికి తెలియని సంబడంలే" అంటూ సుశీలని ఊరడించాలని ప్రయత్నించింది పద్మ.



"మణుసులో మాట ఎవురికైనా చెప్పుకునేటందుకుందా! నక్కలు పీకినట్టు ఒకటే పీకులాటగదా! ఇంక మంచీ చెడ్డా ఎవురితో చెప్పుకోవాలి. తల్లి ఉందన్నమాటేగానీ, నా మొకం చూసిందంటే పుట్టుద్ది. ప్రతీదానికీ ఆరాలేగదా! ఇంటికిపోతే చాలు. ఇప్పుడు దాకా యాడ పెత్తనాలు జేసి వొస్తన్నావు. పిల్లోణ్ణి ఎవుడు పట్టుకుంటాడంటది. అబ్బబ్బ అత్తలేని లోటు తీరిందన్నమాటే నాకు.

ఆ మొద్దోణ్ణి తెచ్చి నా యెదానేసింది. మొగోడన్నమాటేగానీ, సంసారి లక్షణాలు ఒక్కటీ లేవంటే నమ్ము. ఎంత ఇంసబెడతాడనీ! కంపెనీలకి పోయే వాళ్ళంటే ఎంత అలుసనీ. ఎన్ని లేకి మాటలు మాట్లాడతాడనీ, అయినా ఆయన్నే యెనకేసుకో నొచ్చుద్ది ముసిల్ది.

అబ్బా తలుసుకుంటేనే వొళ్ళు గగుర్పొడుస్తుంది. ఆ గారపళ్ళు, అట్టలు గట్టిన జట్టు, యెద్దుల లాంటి వాళ్ళు, మొకాన అమ్మవారు బోసిన గుంటలు అబ్బబ్బో ఒక అడివి మణిసిన జూసినట్టే ఉంటది. యాణ్ణో దూరపు చుట్టమని తెచ్చి నాకు కట్టబెట్టింది.

మణిసి ఎట్టా ఉన్నా ఎట్టోకట్ట కళ్ళు మూసుకుందామంటే మణిసికి ఒకటే అనుమానం. గ్రేడింగుల కెళ్ళే వాళ్ళు అట్ట తిరుగుతారంటనే, ఇట్ట తిరుగుతారంటనే అంటూ ఒకటే జోరీగలాగా తగులుకుంటాడు. గమ్ముగుంటే అవున్లే దొంగకి మూతి నలుపేగా అంటాడు.

ప్రతిదీ అనుమానమే. అట్టాంటోడితోట ఎట్టా కాపరం చేసేది. అయినా మొండి దాన్ని కాబట్టి ఎదగోస కొస్తండాను. ఇంకోటైతే ఏనాడో ఊడబెరుక్కుని పోయేది.

సీకటి పడతందంటే గుండెల్లో ఒకటే వొణుకు. మంచమెక్కాడంటే లుంగలు జుట్టుకోని పోవాల్సిందే! నీకేం దెలుసే పెట్టి పుట్టిందానివి. దిగులూ యిశారమూ తెలియకుండా పెరిగిన దానివి. మొగుణ్ణి దెచ్చి హాయిగా ఇంట్లో పెట్టుకున్నావు. మీ అమ్మేం చెబితే అంతేగదా! కొంగుచాటు బిడ్డవు ఏమైనా చెబుతావమ్మా!

చెప్పక చెప్పక మా బాగోతమే యిప్పాల. ఊళ్ళో వాళ్ళు చెప్పినియ్యన్నీ నమ్ముతాడు. ఈడి సంగతి దెలిసినోళ్ళు మండే పొయ్యిలో మరికాస్తె కిరసనాలుపోస్తారు. ఎవుడైనా మొగోడైనోడు అన్ని పనులూ జూసుకోవాలి. ఇరుకూ ఇబ్బందీ పట్టిచ్చుకోడా! నాలుగు గొడ్లు తిప్పక రాపటమేందో, గాటన కట్టెయ్యటమేందో, ఇంక అరుగుల మీద పెత్తనాలకెళ్ళడమేందో! అంతపాటి మొగోడికి నేనే చెయ్యాల.

ఏ యాల్టప్పుడు ఇంటికి బోయినా బుంగెత్తుకోని బాయికాడికి నేనెల్లాల అబ్బో... అబ్బో... ఎంతో మంది మొల్తాడు కట్టిన మొగోళ్ళని జూశానుగానీ అబ్బే ఇట్టాంటి ముదనష్టపోడిని నేనెక్కడా జూళ్ళేదమ్మా! ఇయ్యన్నీ ఒకయెత్తయితే..."

ఏడుపు నాభిలో నుండి ఎగదన్నుకురాగా గొంతు బొంగురు బోయి నోటంట మాట రాలేదు. కళ్ళ వెంబడి బొటబొటా నీళ్ళు కారాయి.

"ఏయ్ సుశీలీ! ఊరుకోయే ఊరుకో! ఎప్పుడూ ఒకటే ఏడుపైతే ఎట్టనే" అంటూ సముదాయించింది పద్మ.

"తల్సుకుంటే గుండె తర్కుపోతంది. నా బతుకు ఏడుపుగాక ఇంకేం మిగిలిందనీ? పొద్దస్తమానం వొళ్ళు హూనం చేసుకుని ఇంటా బైటా ముప్పయ్యారూ నేనేజూస్తన్నాగా! ఏ పన్లో ఏలు పెట్టకపోగా ఒకటే కుళ్ళబోడుస్తాడు. వాడితోటి పనేంది? వీడితోటి మాటలేంది. ఆ ఇక ఇకలేంది, పకపకలేంది. పెళ్ళయితేనే ఇట్టుండావే, పెళ్ళిగాకముందు ఇంకెంత సక్కంగా ఎలగబెట్టావో అంటాడు.

అరిస్తే నలుగురూ నోట్లో ఊస్తారని దిగమింగుకోని ఊరుకుంటాను. ఎన్నన్నా సిగ్గాశరమా అని మీదబడి పిడిగుద్దులు గుద్దుతాడు.

ఎనికలు పెళపెళలాడతయ్యి. వొళ్ళంతా మాంసం ముద్దవుద్ది. అప్పుడు మాట్లాడే నాలుగు మాటలే! ఆ తరువాత ఊ... ఉండదూ ఉప్పరాయీ ఉండదు. ముత్యాలు రాల్తాయి అనుకుంటాడో ఏమో!

ఆయన్నే కనిపెట్టుకోని తిరుగుతుండాల. ఎప్పుడేదవసరమైతే అది అందిస్తుండాల. లేదంటే తడిపడిందన్నమాటే." అంటుండగా సుధాకర్ పేరుపిలవడంతో" ఏయ్! మాటల్లోపడి చూణ్ణేలేదు. అందరూ అయిపోయేరేయ్ లేలే! అంటూ పోయి వేలిముద్రలు వేసి డబ్బులు తీసుకుని ఇద్దరూ చీకట్లో బిక్కుబిక్కుమని నడవసాగారు. కీచురాళ్ళు గియ్‌మని ఒకటే రొద పెడుతున్నాయి. రోడ్డుకిరువైపులా చెట్లు తలలు విరబోసుకున్న దయ్యాల్లా ఊగుతున్నాయి.

"అయితే మీ అమ్మకీ సంగతులన్నీ తెలియవంటే" అంది పద్మ మౌనంగా నడుస్తున్న సుశీల వంక జూస్తా.

"ఎందుకు తెలియదే తెలిసి కూడా యెనకేసుకొస్తది. వాడు మొగోడు ఎన్నన్నా, ఏమి జేసినా ఆడదే సర్దుకుపోవాలంటది. కట్టుకున్నందుకు నోరు మూసుకోని భరించాలంటది.

ఏదో జాము నుండి మొదలుబెట్టుద్ది. లేలే తెల్లారింది. కోడికూసింది అంటా. తప్పేదేముంది. ఎప్పుడైనా చెయ్యక తప్పుదుగదా అనుకుంటా నిదర కళ్ళతోనే పనిలోకి దిగాలి" అంటూ కళ్ళల్లో ఊరే చెలమల్ని చేత్తో తుడుచుకుంటూ ముక్కు బర్రున చీదింది.

"ఇంకూరుకోవే ఏడ్చిఏడ్చి కళ్ళు ఉబ్బిపోయినియ్యి ఇంక నేనొస్తానే" అంటూ పద్మా ఇల్లు రావడంతో ఇంట్లోకి పోయింది.



# వలసపోయిన జీవితం!

జి. సుబ్బారావు

ఎత్తిన స్వేచ్ఛా పతాకలా
అప్పుడా ఆకాశం వుండేది
వెలుగు కిరణాల్నిపంచుతూ
వెచ్చదనాన్ని ప్రసరిస్తూ
అక్కడో సూర్యుడుండేవాడు

అక్కడి నుంచే చంద్రుడూ, నక్షత్రాలూ
వెన్నెలని కురిపిస్తూ
కాంతుల్ని నింపుతూ...

అవును
ఒకప్పుడు ఇక్కడ జీవితం వుండేది
రాలిన చినుకుల్లోంచి
విరిసే ఇంద్రధనువులా!
కురిసిన మంచులోంచి
విచ్చుకునే రంగురంగుల పూలలా-

ఇప్పుడు ఆకాశాన్ని పోల్చుకోలేవు
కొత్తగా ఆంక్షల బురఖాని దిగేసుకుంది
మాంత్రికుడెవడో ఆడిస్తున్నట్టుంటుంది

ఆకాశం కింద
ఆట మైదానంలో కూర్చున్నా
పెద్ద ముళ్ళ పంజరంలో వున్నట్టు...

ప్రవహించనిది నదికాదు
జల చచ్చిన బావి దాహం తీర్చదు
మంచుకొండ మొక్కల్ని పెంచదు
అమ్ముడుపోయిన ఆకాశం
అభయమివ్వదు

ఎక్కడో ఏదో కుట్ర జరిగింది
అన్నిటినీ గుప్పిట పెట్టుకున్న వాడెవడో
నిన్ను అష్టదిగ్బంధనం చేశాడు

సాగిలపడితే చీకట్లు తొలగిపోవు
మొరపెట్టుకుంటే
వెలుగురేఖలు విచ్చుకోవు

ఎప్పుడైనా సముద్రాన్ని సమీపించావా?
దేనికైనా సముద్రం మొక్కడం చూశానా?
గర్జించడం మాని
ఒదిగి వుండటం విన్నావా?

సముద్రం నీకు ఆదర్శం
సముద్రం నీకు స్ఫూర్తి
వెళ్ళు!
సముద్రాన్ని నీలోకి ఆహ్వానించు
సముద్రాన్ని ఆవాహన చెయ్యి
నువ్వే సముద్రానివి కా!

చుక్కలు లేకుంటే
నువ్వే వేగు చుక్కవికా!
ఉదయించే సూర్యుడు లేకుంటే
నువ్వే సూర్యుడివై ఉదయించు!
ఆకాశం వలస పోతే
నువ్వే కొత్త ఆకాశానివై నిలబడు!

వెలుగూ వెచ్చదనం...
చంద్రుడూ, నక్షత్రాలూ...
వెన్నెల, కాంతులూ...
జీవితం సాక్షాత్కరిస్తుంది!

---

పిల్లోడి జెరం తగ్గిందోలేదో! ముసిలిదాన్ని మాత్ర తెచ్చియెయ్యమన్నాను ఏసిందో లేదో! అనుకుంటూ వడివడిగా నడవసాగింది.

గుండె గుబగుబలాడుతుండగా ఇంట్లోకి అడుగుపెట్టింది. పిల్లవాడు కళ్ళు మూసుకుని నిద్రబోతున్నాడు.

"ఇయ్యార దాకా యాడకిబోయావే" అంటూ గద్దించాడు నారాయణ ఇంట్లోకి వస్తా.

"మొదులు బెట్టావా!పుటకల్తో వొచ్చిన బుద్దులు పుడకల్లోగానీ పోవంటార్లే. ఆరాలు తియ్యడం తెలిసిందిగానీ, బాగలేని పిల్లోడిని కాస్తె ఆ డాక్టరు కన్నా చూయించాలన్న జ్ఞానం లేకపోయింది నీకు. నాకేనా కొడుకు నీకు గాదా! ఏమ్మా మాత్రన్నా యేసేవా లేదా!" అంటూ అమ్మవంక జూసింది.

"యేసేనమ్మా యేసేను. ఆడాకట్రే ఊళ్ళో కొస్తే సూయించాను. ఒక ఇంజీషనేసి బిళ్ళలిచ్చిపోయేడు అంది కోటేశ్వరమ్మ.

"మూసిన కన్ను తెరవలేదు" అంటూ నుదుటి మీద చెయ్యేసి చూసింది. వొళ్ళు చల్లగా ఉండడంతో జెరం తగ్గినట్టుందిలే అనుకుంటూ, అంట్ల గిన్నెలు బయటేసి బక్కిట తీసుకుని తొట్టి దగ్గరకి పోయింది. దబరతో నీళ్ళు ముంచబోతే తొట్లో ఒక్క చుక్క గూడా నీళ్ళు లేవు.

సుశీలకి కడుపులో మండిపోయింది. పొద్దుననంగా పోయి ఈ జాముకి వొచ్చానా! మారాజులా మంచానికడ్డంగా పడుకోకపోతే రెండు కడవలు నీళ్ళు దెచ్చి పొయ్యొచ్చుగా" అని విసురుగా బక్కిట ఎత్తి పడేసి బుంగ దీసుకుంది బాయికిపోవడానికి.

"ఏందే! వొళ్ళు కొవ్వెక్కిందా! ఎత్తెత్తి పగలేస్తుండావు" అంటూ మీదకొచ్చాడు.

ఆ! నువ్వు బెట్టింది తిని తెగ బలిసి కొట్టుకుంటుండా! రాత్రింబగుళ్ళు పడుకోబెట్టి చేస్తుంటవే నువ్వు కొవ్వెక్కక ఏంజేస్తది పని చెయ్యడం తెలియదుగానీ మడిసి మీదకి దూకడం మాత్రం తెలుసు. ఒక తట్టు పిల్లోడికి బాగలేకపోయె. ఇంట్లో పనని చేసుకోవాలా! బాయికి నీళ్ళకి పరిగెత్తాలా! నువ్వేం మొగోడివి గాదా! ఇళ్ళల్లో మొగోళ్ళందరూ పనులు చేసుకోకుండా నీలాగా తిని తిరుగుతున్నారా! నువ్వేమన్నా పై నుండి దిగొచ్చావా" అంది విసురుగా పోబోతూ.

"ఏందే తెగ వాగుతుండావు" అంటూ మీదకొచ్చి చెయ్యెత్తాడు. అంతే సుశీల చేతిలో ఉన్న బుంగ మొహానికేసి విసిరింది. మొఖానికి తగిలిన బుంగ పెద్ద శబ్దం చేస్తూ కింద పడింది.

ఆ దెబ్బతో "అబ్బా" అంటూ తల పట్టుకున్నాడు నారాయణ. తలకి రంధ్రం పడి రక్తం బొటబొటా కారడం మొదలైంది.

"ఇదుగో! ఇన్నిన్ని కష్టాలు పడతాగూడా సంసారాన్ని నెట్టకొస్తన్నా. మళ్ళీ నీ చేత వొళ్ళు వాయగొట్టించుకోవడం నావల్లకాదింకా! ఉండే ఉండు లేకపోతే కాలికొందీయెల్లు" అంటూ బోళ్ళబడిన బుంగని దీసుకుని బావికెళ్ళింది నీళ్ళకి.

తలపట్టుకుని సుశీల వెళ్ళిన వైపే చూస్తుండిపోయాడు నారాయణ అనుకోని హఠాత్సంఘటనకి బిత్తరపోతూ. ❖

# 'అంటరాని వసంతం' గ్రామీణ మహిళా జీవనం

***"ఊరుంటే పల్లె వుండదా" అనేది ఒక సామెత. ఈ దేశం జన జీవనంలో దారుణమైన అడ్డుగీత. అడ్డుగీతకు అటువైపు అంటదగ్గవాళ్ళు, యిటువైపు అంటరాని వాళ్ళు. అగ్రకులాలుండేది ఊర్లో. మాలలుండేది మాలపల్లి. మాదిగలుండేది మాదిగపల్లి. మొత్తం కలిసిన ప్రదేశం పేరు 'ఎన్నెలదిన్నె' ఇదే విచిత్రం!***

**పొన్నంరెడ్డి కుమారి నీరజ**

ఆధునిక సాహితీ ప్రక్రియల్లో అందరినీ ఆకర్షించిన ప్రక్రియ నవల. సామాన్యుల జీవితాల్ని సామాన్యుల భాషలోనే చిత్రిస్తూ సామాన్య పాఠకులకు అందుబాటులో వుండగలిగినది నవల.

"Novel is a Book of Life"

"సమాజంలోని ప్రజల జీవితాన్ని ఎన్నో కోణాల నుండి సమగ్రంగా చిత్రించగల సాహిత్య ప్రక్రియ నవల".

"యథార్థ జీవనాన్ని యథార్థ దృష్టితో అధ్యయనం చేసి దాన్ని గద్య రూపంలో వ్యక్తం చేసేదే నవల"

-రిచర్డ్ క్రాస్

"జీవితం నవలలాంటిది, నవల జీవితం లాంటిది"

-ఇల్యా ఎహ్రెన్ బర్గ్

"మానవ జీవిత చిత్రణే నవల"

అన్న నిర్వచనాలు నవలా ప్రక్రియపరంగా కనిపిస్తాయి.

'నవల' ఆవిర్భావం విషయానికొస్తే 19వ శ॥ రెండో భాగంలో పుట్టిన నవీన సాహిత్య ప్రక్రియ నవల. పాశ్చాత్య నవల ప్రభావంతో భారతీయ నవల పుట్టింది. ప్రారంభంలో తెలుగు నవల ఆచార వ్యవహారాలను తెలిపేదిగా ఉంది. క్రమంగా సామాజిక ఉద్యమాల్ని ప్రతిబింబించింది. కందుకూరి వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర' తొలి తెలుగు నవల అనుకుంటే - తర్వాత వచ్చిన నవలలన్నింటిలోనూ దాదాపు గ్రామీణ జీవిత చిత్రణ మనకు కనిపిస్తుంది. ముఖ్యంగా వట్టికోట ఆళ్వారుస్వామి నవలల్లో గ్రామీణ జీవనం అద్భుతంగా వర్ణింపబడింది.

నేటి వ్యవస్థలో సంక్లిష్టమైపోయిన సమాజ జీవితంలో ఉత్పన్నమవుతున్న వివిధ సమస్యల్ని, సమాజ స్వరూపాన్ని చిత్రిస్తున్నది నేటి నవల సంఘ సంస్కరణోద్యమ, జాతీయోద్యమ నవలలే కాదు - స్త్రీవాద, దళితవాద ఉద్యమ నవలలనేకం తెలుగులో వచ్చాయి. 'అంటరాని వసంతం' దళిత జీవితాలను చిత్రించిన నవల. ఇది 'జి. కళ్యాణరావు' గారి అపూర్వ సృష్టి. అద్భుత దృశ్యకావ్యం.

1980 తర్వాత తెలుగు దళిత సాహిత్యంలో ఒక తుఫాన్ చెలరేగింది. అగ్రవర్ణ భావజాలాన్ని విమర్శిస్తూ, దళిత సంస్కృతిని విశ్లేషిస్తూ దళిత కవిత్వం ఉద్యమ స్థాయిలో వెలువడింది. తర్వాత వివిధ ప్రక్రియల్లో దళిత సాహిత్యం వెలువడింది. అందులో నవలా ప్రక్రియ ఓ భాగం.

తెలుగులో దళిత జీవన ప్రస్తావనను తెచ్చిన నవల 'శ్రీరంగరాజ చరిత్ర'. తర్వాత వచ్చిన అనేక నవలలు దళిత జీవితాన్ని చిత్రించాయి.

బానిస బతుకుల, పీడిత జనుల, అంటరానివాళ్ళ చరిత్రకు సజీవ చిత్రణ జి. కళ్యాణరావు "అంటరాని వసంతం" ఈ నవల పేరులోనే ఒక ప్రత్యేకత, ఆవేదన ఉన్నాయి. ఇది ఒకటిన్నర శతాబ్ద దళిత జీవితాన్ని చిత్రించిన నవల.

"ఈ వసంతం అప్పుడూ నిషేధమే ఇప్పుడూ నిషేధమే. పుట్టిన కులం నిషిద్ధం కోరుకున్న పోరాటం నిషిద్ధం'' అన్న ముందుమాటలో నవల సారాంశం, రచయిత మనస్సు విదితం. 'అంటరాని వసంతం' ఒక విలక్షణ నవల. రచయిత తనకు తెలిసిన ప్రదేశాలను, జీవిత విశేషాలను మన కళ్ళముందుంచారు.

"Novel is a Book of Life" అనుకుంటే 'అంటరాని వసంతం' ఓ "Bright Book of Life"

"గతిస్తున్న శతాబ్దాన్ని మీ త్యాగానికి, రాబోయే శతాబ్దాన్ని మీ విజయానికి అంకితం చేస్తున్నాను". గతం ఒక జ్ఞాపకం కాదు అది వర్తమానమే అని కథ చెబుతోంది. తరతరాల మాల మాదిగలు తమ జీవితాల్ని ఎలా పోరాటంగా ఎదుర్కొన్నారో నవల చూపించింది. ఒక తరం నుండి తర్వాత తరం చైతన్యవంతమైన పద్ధతి నవల్లో కనిపిస్తుంది. అగ్రకులాల వాళ్ళ దుర్మార్గంవల్ల అంటరానివారి జీవితం ఎలా ప్రతినిత్యం 'బతుకు ఒక పోరాటంగా' నిలిచిందో చిత్రింపబడిందీ నవలలో. కులం కారణంగా సాటి మనిషిని మరో మనిషి ఎంత హీనంగా, దీనంగా, బానిసగా చూశాడో చిత్రింపబడింది.

"మీరు నూతన మానవుణ్ణి కలగంటున్నారు. నూతన సమాజాన్ని కలగంటున్నారు. ఆ చారిత్రక సత్యం కోసం సర్వకాలాల్లో, సకల దేశాల్లో పోరాడే వాళ్ళంతా కలలు కంటూనే వుంటారు. ఆ కలలన్నీ ఓ విప్లవ సంకలనం. ప్రేమ, పోరాటం, త్యాగం ఆ సంకలనం నిండా గీతాల్లా వుంటాయి. విజయాన్ని చవిచూస్తారు మీరు. నా విశ్వాసం చిన్నది కాదు (పు229) ఇది నవలార్థం.

"ఊరుంటే పల్లె వుండదా" అనేది ఒక సామెత. ఈ దేశం జన జీవనంలో దారుణమైన అడ్డుగీత. అడ్డుగీతకు అటువైపు అంటదగ్గవాళ్ళు, యిటువైపు అంటరాని వాళ్ళు. అగ్రకులాలుండేది ఊర్లో. మాలలుండేది మాలపల్లి. మాదిగలుండేది మాదిగపల్లి. మొత్తం కలిసిన ప్రదేశం పేరు 'ఎన్నెలదిన్నె' ఇదే విచిత్రం! ఈ గ్రామ జనుల జీవన చిత్రణ ముఖ్యంగా మహిళా జీవన చిత్రణే ఈ వ్యాసం.

ఈ నవల్లో వారసత్వంగా వచ్చింది పోరాటమే. నవల్లో తండ్రులు బిడ్డలకు

వారసత్వాన్నివ్వడమే కాక బిడ్డలు తండ్రులకు వారసత్వాన్నిచ్చారు. అవసరాన్నిబట్టి, సందర్భాన్నిబట్టి అది జరిగింది. పోరాటం గెలుపునకు మాత్రమే.

రూబెన్ను తలచుకుంటూ, గతంలోని జ్ఞాపకాలను రూతు నెమరువేసుకోవడం ఈ నవల్లో ఆది నుండి అంతం దాకా నడిచిన కథ. జ్ఞాపకం గతం కాదంటుందామె. గతాన్ని లేదా జ్ఞాపకాన్ని వర్తమానంగానే రూతు చూస్తుంది.

పూర్వీకుల నుండి ఆరంభమై ప్రధానంగా ఐదు తరాల కథ ఇందులో నిక్షిప్తమై ఉంది.

తరం ఏదైనా కావచ్చు. జీవితం ఎవరిదైనా కావచ్చు. తాకకుండా పోలేదు. అంటరానితనం కాటెయ్యకుండా పోలేదు.

ఆర్థికంగా అభివృద్ధి చెందిన కోస్తాది ఆంధ్రలో ప్రత్యేక స్థానం. అనేక ఉద్యమాలు అక్కడి నుండే ఆరంభమయ్యాయి. మిషనరీ సంస్థలు కూడా ఇక్కడే మొదట ప్రారంభించ బడ్డాయి. ఈ మిషనరీల నీడనే దళిత వికాసం జరిగింది.

ఈ నవల ప్రధాన కేంద్రం ప్రకాశం జిల్లాలోని ఎన్నెలదిన్నె. సమస్య అంటరానితనం. ఈ సమస్య ఎన్నెలదిన్నె చుట్టూ వున్న పక్కలదిన్నె, కోళ్ళదిన్నె, చింతలకుంట, దిబ్బలమిట్ట వంటి గ్రామాల్లో సాగుతుంది.

ప్రకాశం జిల్లాలో మాల మాదిగలు పేదరికాన్ని, అంటరానితనాన్ని అనుభవించడం, అంటరానితనాన్ని పోగొట్టేందుకు – తమ గౌరవాన్ని నిలుపుకునేందుకు జానపద కళలను ప్రదర్శించడం, దాత కరువు రావడం, ఫలితంగా గ్రామాలు స్మశానాలుగా మారటం, మిగిలిన వాళ్ళు వలసలు పోవటం, బకింగ్‌హాం కాలువ నిర్మాణం – అందులో దళితులకు అంటరాని తనం కారణంగా పని కల్పించకపోవటం, వీరి కోసం మిషనరీ సంస్థలు కొంత కాలువ నిర్మాణాన్ని దత్తత చేసుకోవడం, బతుకు దెరువు కోసం కోస్తా దళితులు క్రైస్తవాన్ని స్వీకరించడం, కమ్యూనిస్టు ఉద్యమాలు బలం పుంజుకోవడం, శ్రీకాకుళ సాయుధ పోరాటం సాగడం, గాంధీ యుగంలో హరిజనోద్ధరణకు సంస్కరణలు ఆరంభం కావటం, కారంచేడు సంఘటన... ఈ విధంగా ఒకటిన్నర శతాబ్దపు దళిత చరిత్ర నేపథ్యంగా పుట్టిన నవల 'అంటరాని వసంతం'.

పాత్రల విషయానికొస్తే 'ఎల్లన్న'తో ప్రధానంగా నవల ఆరంభమవుతుంది. ఇతని పూర్వీకులైన సినసుబ్బడు–ఎల్లన్న–ఎర్రెంకడుల గూర్చిన ప్రస్తావన కూడా ఉంది. ఇతని

..............★..............



**బూదేవి తెగించిందంటే ఎంతైనా చేస్తుంది. తర్వాత ఏం జరుగుతుందో పట్టించుకోదు. పెద్దమాలను ఎదిరించింది. ఎల్లన్నని కొట్టిన వాళ్ళను పేరుపేరునా తిట్టింది. ఎన్నెలదిన్ని మాలపల్లిలో ఏ మగాడూ మాట్లాడకుండా వుంటే తాను మాట్లాడింది.**

..............★..............

పూర్వీకులకంటే ఇతనిలో చైతన్యం వుంది. తన వాళ్ళను చైతన్యపరచడానికి, తమ గౌరవాన్ని కాపాడుకోవడానికి వివిధ కళలను ప్రదర్శించారు. ఇతని కొడుకు తరానికి సమాజంలో మార్పు కనిపిస్తుంది. కరువు కోరల నుండి బయటపడటానికి – శివయ్య క్రైస్తవం పుచ్చుకుంటాడు. ఆ వారసత్వం రూబేనుకు వస్తుంది. ఉద్యమాల ప్రభావంతో తర్వాత తరంలో యిమ్మానుయేలు శ్రీకాకుళం పోరాటంలో పాల్గొని నక్సలైట్‌గా మారుతాడు. ఇతని వారసుడు జెస్సీ నక్సలైట్‌గా జీవనం సాగిస్తాడు.

స్త్రీ పాత్రల విషయానికొస్తే ఇందులో బూదేవి, లింగాలు, సుభద్ర మొదటి తరానికి చెందినవారు. శశిరేఖ రెండవతరానికి –రూతు మూడవ తరానికి – మేరీ సువార్త నాల్గవ తరానికి రూబీ ఐదవ తరానికి చెందింది.

బూదేవి – సుభద్ర – రూబీలు చైతన్యవంతులైన వారు – ఎదురు తిరిగిన వారు – ధైర్యంగా నిలబడినవారు. రూతు కథలు రాసేది.

బూదేవి – సుభద్ర చదువు లేకపోయినా ధైర్యంగా ఎదురు తిరిగిన పాత్రలయితే రూబీ చదువుకున్నది, ఎదురు తిరిగింది. న్యాయం కోసం పోరాటాలు చేసింది.

ఈ నవలలో ప్రధానంగా ఎదురైన సమస్యలు కేవలం స్త్రీలవి కావు సమాజానివి. ఈ సమస్యలను ఎదిరించిన వారు, పరిష్కరించిన వారు స్త్రీలు. అందుకే ఆ పాత్రలను చెప్పుకోవాలి. ప్రధాన సమస్యలు – పరిష్కరించిన వారిని చూస్తే.

1. మాల మాదిగలు వీధినాటకాలు దూరం నుండే చూడాలి. దగ్గరకెళ్ళకూడదు. ఊర్లో వాళ్ళకు కనబడకుండా దూరంగా దిబ్బలపై కూర్చొని చూడాలి. దీన్ని ఎదిరించింది
2. అగ్రవర్ణస్థుల పొలాలు పారిన తర్వాతే దళిత పొలాలకు నీళ్ళు. దీన్ని ఎదిరించింది సుభద్ర. దళితులు చెరువులో నీళ్ళు ముంచుకోకూడదు. అవి అగ్రవర్ణస్తులే వాడుకోవాలి. 'ఆవలపాడు' ఊరి చెరువులో నీళ్ళు ముంచుతుంది 'ఎంకాయి'.
3. దళితులందరికీ న్యాయం జరగాలి – అంటరానితనం నశించాలి – అనే ఆశయాలతో మహిళా సంఘాల్లో తిరిగింది రూబీ.

మొదటి తరానికి చెందిన మహిళలుగా బూదేవి, లింగమ్మ, సుభద్ర రంగాయిలను చెప్పుకోవాలి. రంగాయి అగ్రవర్ణానికి చెందిన స్త్రీ అయితే మిగిలినవారు దళితులు. ఈ తరంలో ఎదురైన సమస్యలు – పరిష్కరించుకున్న తీరు చూస్తే...

1. ఎర్రిగొల్లల వీధినాటకాలను దళితుల ఊర్లోవాళ్ళకు కనబడకుండా దూరంగా దిబ్బలపై కూర్చొని చూడాలి.
2. తూము నీళ్ళతో అందరి చేలు తడిసిన తర్వాతే మాల మాదిగల చేలు తడుపుకోవాలి.

మొదటి పాత్ర బూదేవి. ఈమె ఎర్రెంకని చెల్లెలు – లింగాలుకు ఆడపడుచు ఎల్లన్నకు మేనత్త. ఎంకటనర్సుకు భార్య ఎల్లన్నను కన్నది ఎర్రెంకడే అయినా తా పెంచింది.

శివాజీకి జిజియాబాయి కథ చెప్పి వీరునిగా తీర్చితే

ఎల్లన్నకు మేనత్త బూదేవి కథ చెప్పి వీరుణ్ణి చేసింది.

అన్నీ తానై పెంచి సుభద్రతో పె చేసింది. వీరి బిడ్డ శివయ్యతో కాలం గడిపిం పనిలేని రోజుల్లో ఆడాళ్ళందరూ బూదేవి ఇం ముందు చేరితే 'నల్లతంగ' కథ చెప్పింది.

ఎర్రగొల్లలు వీధి నాటకాలేస్తుం చూడడానికి మాలమాదిగలు ఊర్లో వాళ్ళ కనబడకుండా దూరంగా దిబ్బలపై కూర్చోవా ఆ విధంగా కూర్చుంటే తన అల్లుడు కన లేదంటున్నాడని ఊర్లో వాళ్ళేమనుకున ఫరవాలేదని మొదటిసారిగా తెగించిం అల్లుడికోసం నిర్భయంగాలేని నిలబడింది. గ్రామీణ మహిళలోని తెగింపు మొండి ధైర్య

ఎర్రగొల్లలు నాటకమేసే లోపలికెళ్ళి చూసినందుకు వారిచేత దెబ్బలు పారిపోయిన ఎల్లన్న గూర్చి దిగులుపడి తి తినడం మానేసింది. ఎల్లన్నను తీసుకురాకు

... భర్తకు, అన్నకు చెప్పింది. చివరకు అతన్ని కొట్టడంవల్ల పారిపోయాడని తెలుసుకున్న బూదేవి వాళ్ళ అంతు తేలుస్తానని బయలుదేరింది. అడ్డుపడిన పెద్దలను, తన తోటివారినీ... నా బిడ్డని నాకివ్వండని అరిచింది. చలనంలేని వాళ్ళను కాదని ఎల్లన్న కన్పించకపోతే అట్టా తరిమిన వాళ్ళ అంతు చూస్తానంది. ఆళ్ళ బతుకులు బూడిద చేస్తానంది.

బూదేవి తెగించిందంటే ఎంతైనా చేస్తుంది. తర్వాత ఏం జరుగుతుందో పట్టించుకోదు. పెద్దమాలను ఎదిరించింది. ఎల్లన్నని కొట్టిన వాళ్ళను పేరుపేరునా తిట్టింది. ఎన్నెలదిన్ని మాలపల్లిలో ఏ మగాడూ మాట్లాడకుండావుంటే తాను మాట్లాడింది.

ఇదే తరానికి చెందిన ఇంకొక పాత్ర బూదేవి వదిన, ఎర్రెంకని భార్య లింగాలు. ఈమె తన ఆడపడుచు ఊర్లో వాళ్ళను తిట్టిందని, వాళ్ళేం చేస్తారోనని భయపడి భర్త ఆమెను కొట్టినందుకు ఎదురు తిరిగింది.

"ఏది మాట్లాడిందయ్యా నా ఆడబిడ్డ... మగాళ్ళంతా పిరికి గొడ్లయితే నా బిడ్డ మాట్లాడింది. నా బిడ్డే కాదు, నేను మాట్లాడుతున్నా... నన్నూ సంపండి. అది ఎల్లడి కూతురు. సుబ్బడి మనవరాలు. పిరికి గొడ్డుకాదు..."

మొదటి తరానికే చెందిన ఇంకో పాత్ర పౌరాణిక పేరు పెట్టుకున్న పాత్ర తర్వాత అందరికీ కథగా మిగిలిపోయిన పాత్ర సుభద్ర. ఎన్నెలదిన్నెలో ఇంతక మునుపు ఎవ్వరూ పెట్టనిపేరు, కొత్తపేరు, పౌరాణిక పేరు. నోరు తిరగకపోయినా అందరికీ అలవాటవుతోంది. ఆ పేరు పెట్టడమే ఓ పెద్ద చైతన్యం. ఎల్లన్న భార్య, పిట్టోడు. చిన్నమ్మిల బిడ్డ, ధైర్యం, తెగింపుగ బూదేవికి కూతురు వరస.

పేరు పెట్టినప్పటి నుండి - ఈమె పెరిగిన తీరు అంతా మాలమాదిగల్లో ఓ మార్పే. సుభద్ర మాలపల్లెలో అందరి పిల్లల్లాగా పెరగలేదు, పెంచలేదు కూడా. కాళ్ళకి గొలుసులు... ముక్కుకు ముక్కుపుటక... ఆ చుట్టుపట్ల మాలామాదిగ పల్లెల్లో మోకాళ్ళ ...దికి కోక కట్టింది సుభద్రే. చెప్పులు కూడా ...ట్టిచ్చాడు నాన్న.

ఈ విధంగా పెరిగింది కాబట్టే ...న్నప్పటి నుండే ఈమెలో హుందాతనం, ...ర్యం చోటు చేసుకున్నాయి.

తన పెళ్ళి విషయంలో కూడా ...భద్ర నిక్కచ్చిగా, కుండ బద్దలు చేసినట్టు

............ ★ ............



కొద్దిమందే అత్తలు కోడళ్ళ గుండెల్లో గూడుకట్టుక పోతారు. అలాంటివారిలో సుభద్ర ఒకటి. శశిరేఖ గుండెలో గూడుకట్టుకొని నిలిచి పోయింది. అందుకే తర్వాత అందరికీ ఆదర్శ మూర్తయింది. కథలల్లుకోడానికి ప్రధాన వస్తువైంది.

............ ★ ............

చెప్పింది. "చేసుకుంటే ఎల్లన్ననే చేసుకుంటానని".

సుభద్రపై ఎల్లన్న పాటలల్లాడు.. అతని పాటకు పల్లవి సుభద్ర. అల్లికకు అసలైన దారం నాన్నలోని కొద్దిపాటి ధైర్యం, భర్త - బూదేవిలలోని తెగింపు ధోరణుల రంగరింపే సుభద్ర.

సుభద్ర ఎటో వెళ్ళిపోయిన భర్తకోసం ఎదురుచూస్తూ, బిడ్డపై ఆశలు పెట్టుకొని జీవనం సాగిస్తున్న సమయంలో జరిగిన సంఘటనతో ఆమెలో ఆవేశం ఉప్పొంగింది. సుభద్రంటే ఏంటో అందరికీ తెలిసొచ్చింది.

సామాన్యుల్లో అంత సాహసం.... సుభద్రలో ఆ సాహసాన్ని అప్పుడే చూశారు. తండ్రితో సహా మాలమాదిగలు, ఊర్లో వాళ్ళందరూ.

తూము నీళ్ళతో అందరిచేలు తడిసిన తర్వాత మాలమాదిగల చేలు తడుపుకోవాలి. అంతవరకు నీళ్ళుండేట్లు లేదని మాలమాదిగలు దొంగగా తమ 'మాలాడి దిబ్బ' తడుపుకోవడం ఆరంభించారు. అనుమానించిన రెడ్లు మాలవాడలో విచారించి మాలమాదిగలను కొట్టారు. ఆ సమయంలో సుభద్ర పారతీసుకొంది. అంతా చూస్తూనే వున్నారు. కళ్ళు మండుతున్న కొలిమిలా వున్నాయి. పార తీసుకొని ముందుకు కదిలింది.

"యాడకే సుభద్ర"... పిట్టోడితోపాటు బూదేవి, పోలదు చాలా మంది అంటరాని వాళ్ళు ఒకేసారి కలిసి అన్నమాట అది. సుభద్ర ఆగలేదు. ఎవరి మాటకి ఎదురు చూడలేదు. అడుగులు కాదు అవి పరుగులే. కసి నిండిన పరుగులు. ఎందుకు కదిలిందో తెలీదు. ఎట్టా పరుగెత్తుతుందో తెలీదు...

సుభద్రను అందరు ఆడవాళ్ళు వెంబడించారు. ఆగమని అరుస్తూ... సుభద్ర ఆగింది. అచ్చిరెడ్డి మడవ దగ్గర. మడవ అంచున కాలుపెట్టింది. నడుం వంచింది. పిచ్చిబలం. మడవ మీద బలంగా పారని దింపింది. మట్టిలాగి పక్కకు తోసింది. పార ఎత్తి అట్టాగే నిలబడింది... అచ్చిరెడ్డి మనుషులకేసి కాళిలా చూస్తోంది.

ఆమెనలాగే చూస్తున్న వారందరూ "దేవతెలిసిందే..." అన్నారు. ఆ బిడ్డే బంగారం... గడపదాటి ఎరుగదు. పరిస్థితులామెనలా మార్చాయి. సుభద్ర నీళ్ళకాలువ గండి కొట్టింది. పార ఎత్తి నిలబడింది. సుభద్ర మాలల ఆడపడుచు. అంటరాని కులంలో పుట్టింది. అందరూ ఆమెది తెగింపని, ధైర్యమని అనుకోలేదు కానీ అన్ని రకాలుగా అణగారిన వారు మూఢనమ్మకంతో దేవత ఆక్రమించిందన్నారు.

ఎవరేమనుకున్నా, ఎన్ని కథలు పుట్టినా సుభద్ర మామూలు మనిషే. శివయ్యకోసం శ్రమించే తల్లే. ఎల్లన్న కోసం ఎదురు చూసే యిల్లాలే.

ఎన్నెలదిన్ని వాళ్ళు నిరాశతో జీవిస్తుంటే సుభద్రకి నిరాశ లేదు. ఉన్నదంతా ఆశే. పొద్దున లేస్తుంది. మాలాడి దిబ్బకేసి వెళ్తుంది. రోజంతా అక్కడే కయ్యల్లో... ఏదో ఒకటి చేస్తూనే వుంటుంది. కాలు బయటపెట్టి ఎరుగని సుభద్ర ఇప్పుడు తన బిడ్డకోసం వాని బతుక్కోసం శ్రమిస్తూనే వుంది. తనకు తాను ఓ గీత గీసుకుంది. ఆ గీతలోనే తిరుగాడుతుంది.

ఆనవాళ్లేని వీరికి మిగిలింది ప్రేమలూ, ఆప్యాయతలే. ధాత కరువు సంభవించినప్పుడు భర్తకోసం ప్రాణాలు బిగపట్టింది. తన పేరే తలచుకుంటూ వచ్చిన భర్తతోపాటు తానూ శాశ్వతంగా నిద్రపోయింది.

కొద్దిమందే అత్తలు కోడళ్ళ గుండెల్లో గూడుకట్టుకపోతారు. అలాంటివారిలో సుభద్ర ఒకటి. శశిరేఖ గుండెలో గూడుకట్టుకొని నిలిచిపోయింది. అందుకే తర్వాత అందరికీ ఆదర్శమూర్తయింది. కథలల్లుకోడానికి ప్రధాన వస్తువైంది.

మొదటి తరానికే చెందిన ఇంకో అగ్రవర్ణ స్త్రీపాత్ర 'రంగాయి'. నల్లమల కొండల కింద పుట్టి బతుకుని వెతుక్కుంటూ ఎన్నెలదిన్ని వచ్చారు రంగాయి సుబ్బిరెడ్డి - పశువులు అమ్ముకోవడానికి. కరణం ఇంట్లో చేరారు. గొడ్లు కరణం పాలయ్యాయి. క్రమంగా సుబ్బిరెడ్డి జీతగాడయ్యాడు. రంగాయికి మిగిలింది గొడ్ల

సావిడి పని. పెళ్ళాంమాటలు విని సుబ్బిరెడ్డి లెక్క చూడమన్నందుకు కరణం చేతిలో బలయ్యాడు. గొంతునల్లగా ఎవరో బలవంతంగా పిసికినట్టుందని రంగాయి అనలేదు. రంగాయిని కరణం లొంగదీసు కున్నాడు. బిడ్డకోసం లొంగింది. కడుపులో ఎంత కసి ఉన్నా సమయం కోసం ఎదురు చూసింది. తూర్పు పాలం గొడ్ల కొట్టాం, కరణం రేవు, రేవు కెదురు తాటిదిన్నె ఒక రకంగా భయపెట్టే దృశ్యాలే. అంతరాత్రి పెద్ద కరణం ఒక్కడే అక్కడికి వెళ్ళగలడు. అంత రాత్రి అచ్చిరెడ్డి అమ్మ మాత్రమే ఆ జడల మర్రికింద కరణం కోసం కూర్చోగలదు. దెయ్యంపిల్ల కూర్చొన్నట్టు, ఆ మర్రికింద కరణం రేవు అంచుమీద నరమానవుడు సాహసించని జాముకాని జామున పెద్ద కరణం కోసం కూర్చుంటూనే వుంది. గుండెల నిండా బాధనూ, పగను, కసినీ నింపుకొని అవకాశం కోసం ఎదురు చూస్తున్న దానిలా, అంతం చేసే వీరునికోసం ఎదురు చూస్తూ వుంది.

అప్పుడు జరిగింది సంఘటన. ఊళ్ళన్నీ కలవరించిన సంఘటన "మాదిగ మాతయ్య గొడ్డలికి తెగిపడ్డ పెద్ద కరణం తల సంఘటన".

రంగాయి సాక్షిగా
చీకటి మర్రి సాక్షిగా
కరణం రేవు, తాటితోపు సాక్షిగా

రంగాయి మూగదే అయింది. మర్రి అంతా మూగదయింది. రేవు అంతా మూగ దయింది. తాటితోపు అంతా మూగదయింది. మౌనంగా చూస్తున్న ఆమెకేసి చూశాడు. రంగాయి మౌనంగా... మూగదానిలా చూస్తోంది.

అంతులేని ఆనందాన్ని అంతరంగంలో దాచుకొని పరుగున వెళ్ళిన మాతయ్యను వెతుక్కుంటూ వెళ్ళింది. "మాతయ్య దేవుడు'' ఆమె అంది.. ''కడుపులో దాచుకొంటా... వూరు వూరంతా యిరసక పడ్డా సెప్పను..." అని తన గతాన్నంతా చెప్పింది. కరణం చావుకోసమే చూశానంది.

రెండో తరానికి చెందిన వారిలో చెప్పుకోదగ్గ పాత్ర శశిరేఖ, సుభద్ర పేరులాగే ఇదీ పౌరాణిక పేరు. సుభద్రకు కోడలు, శివయ్యకు భార్య.

ఎల్లన్న పాటలన్నింటిని నేర్చుకుంది. పొలం పనులు చేసేటప్పుడు పాడింది. ఈమె అత్తచాటు బిడ్డ. సుభద్ర చాటున పెరిగింది.

............ ★ ............



**రూతు కళాకారులైన తమ వారి (నాగన్న,ఎల్లన్న, పిట్టోడు) గూర్చి విన్నప్పుడు ఆమెకనిపిస్తుంది. అంటరాని శరీరం ఎంత అద్భుతమైన సజీవ కళకు నిలయం అని. అట్టా అనుకున్నప్పుడు వర్షించేవి కళ్ళుకాదు. ఆమె గుండె. ఆమె జీవితం మొత్తం. వీరికి గుర్తింపు దక్కలేదని "ఈ దేశంలో కళకన్నా కులం ముఖ్యమైంది. కళని కూడా కులం తక్కెట్లో తూచారు. వీళ్ళని మాత్రం తూకానికే కాదు అసలు తక్కెట దాకా రాకుండానే చేశారు.**

............ ★ ............

ఈమెకు తన అత్తకంటే భూమ్మీద ఎవ్వరూ ఎక్కువ కాదు, గొప్పకాదు.

దాత కరువు సంభవించినప్పుడు అత్తా, మామలనే కాదు ఉన్న ఊరునూ వదిలి అందరితోపాటు ఆకలిని తీర్చుకోవడానికి బతుకుతెరువుకోసం బకింగ్ హాం కాలువ పనులు జరుగుతున్న చోటుకు వెళ్ళారు శివయ్య – శశిరేఖ. అంటరానితనం అక్కడ వారిని కొట్టి తరిమింది. రాళ్ళ దెబ్బలతో చావు బతుకుల మధ్యనున్న వీరికి మార్టిన్ – శారమ్మలు ఆశ్రయం కల్పించారు. కాకపోతే శివయ్య సీమోనయ్యాడంతే. ఇప్పుడు కడుపునిండా తిండి, చేతినిండా పని.

సుభద్ర–శశిరేఖల వెనకాల గొప్ప జీవితం వుంది. గంగలా ఉబికిన కన్నీళ్ళు ఉన్నాయి. వెన్నెల్లా కురిసిన ఆనందాలున్నాయి. అంతేకాదు ఆకలి వుంది. అంతటితో ఆగలేదు అంటరానితనం వుంది.

మూడవ తరానికి చెందిన వారిలో ప్రధానపాత్ర రూతు. ఇంకొక పాత్ర ఎంకాయి.

రూత వెనుక తరాల కథ తెలిసిన పాత్ర. శశిరేఖ–శివయ్యలకు కోడలు. రూబేను భార్య చదువుకున్న మహిళ. కథలు రాయగలది. తెలివైంది. ఆలోచనా శక్తిగలది. నిజానిజాల గూర్చి ప్రశ్నిస్తుంది. కమ్యూనిస్టు – నక్సల్బరీ ఉద్యమాలతో పరిచయం కలది.

కొన్ని సందర్భాల్లో ఈమె ప్రశ్నించిన తీరు, తర్కించిన పద్ధతి ఆశ్చర్యానికి గురిచేస్తాయి.

''మను ధర్మం చెప్పింది. బ్రాహ్మణున్ని చంపితే చండాలుడుగా బ్రాహ్మణులను చంపితే ఎన్నెలదిన్నిలో అంతమంది మాలమాదిగలు పుట్టారు... దీనికి సమాధానం మనువు చెప్పాలి లేదా మనుధర్మాన్ని కాపాడుతున్న వర్గాలు చెప్పాలి. అగ్రవర్ణాలు చెప్పాలి. కసి, కోపం, కన్నీళ్ళు రూతు గుండెల నిండా, ఆలోచనలన నిండా (పు20)

రూతు కళాకారులైన తమ వారి (నాగన్న,ఎల్లన్న, పిట్టోడు) గూర్చి విన్నప్పుడు ఆమెకనిపిస్తుంది. అంటరాని శరీరం ఎంత అద్భుతమైన సజీవ కళకు నిలయం అని. అట్టా అనుకున్నప్పుడు వర్షించేవి కళ్ళుకాదు. ఆమె గుండె. ఆమె జీవితం మొత్తం. వీరికి గుర్తింపు దక్కలేదని "ఈ దేశంలో కళకన్నా కులం ముఖ్యమైంది. కళని కూడా కులం తక్కెట్లో తూచారు. వీళ్ళని మాత్రం తూకానికే కాదు అసలు తక్కెట దాకా రాకుండానే చేశారు. భూమ్మీద యిన్ని పాటలు పుట్టాయి. ఆ పాటకి ప్రాణం పోసిందెవరు? ఆ ప్రాణానికి రాగం యిచ్చిందెవరు? అని ప్రశ్నించుకుంటుంది.

ఎంకి, నాయుడు బావలకున్న ప్రచారం తన వారికి లేనందుకు ఈమె బాధపడుతుంది. విశాలమైన భూమ్మీద, చమట రాల్చిన పదాలు, పాటలు, అవి అల్లిన సుబ్బి, కోటి, లచ్చి, మారెమ్మ వగైరాల్ని ఏ ఆకాశ నక్షత్రాలు మింగేశాయి? ఏ కాలనాగులు కాటేశాయి? అని వాపోతుంది.

ఆ బాధకి, ద్వేషానికి ప్రతి రూపాలే తన జ్ఞాపకాలు.

రూబేనుతో పెళ్ళి జరిగినప్పుడు భోజనాల దగ్గర పల్లె వాళ్ళతో కూర్చొని వాళ్ళలో ఒక మనిషిగా కలిసిపోయింది రూతు.

మిషన్ ఆస్పత్రిలో నర్సుగా గొప్ప అనుబంధాన్ని పెంచుకుందా ప్రదేశంతో. ఎన్నెలదిన్నె – రూబేను తాత ఊరు. అసలూరు అంటే రుతుకిష్టం. ముందుతరంలో దాతకరువొచ్చి సుమారుగా ఖాళీ అయిన, కూలిపోయిన ఇండ్లతో వున్న ఊరు. ఈ ఊరంటే ఇష్టం. అందుకే అక్కడ కూలిపోయిన ఇంటి గోడలు రూబేనుతో చెప్పి లేపించింది. మాలాడిదిబ్బ వీరగాథను తెలుసుకుంది. సుభద్ర గొప్పతనాన్ని గుర్తించింది.

సొంతగడ్డపై మక్కువతో పురిటికి కూడా పుట్టింటికెళ్ళలేదు. అక్కడ పుట్టిన వారందరూ గొప్పవారయ్యారని – అంటరానితనం పోగొట్టడం కోసంపాటు పడ్డారని – తన బిడ్డ కూడా అలాంటి వాడు

1947కు ముందు కమ్యూనిస్టులు ఊళ్ళోకి వచ్చారు. రూతుకు ఈ పదం దగ్గరి పదం. కమ్యూనిస్టుల్ని చూసింది. మాట్లాడింది.

కొడుకు యిమ్మానుయేలు శ్రీకాకుళం పోరాటంలో నక్సలైట్‌గా కలిసిపోయాడు. గ్రామాల్లో చైతన్యమొచ్చింది. యిమ్మానుయేలు మరణబాధను - ఎర్రజెండాలతో అతని వెంటున్న జనాన్ని చూసి పూడ్చుకుంది. మనవడు జెస్సీలో కొడుకును చూసుకుంది. అతడూ నక్సలిజంలో కలిసినా తన వారికోసమేనని సంబరపడింది.

ఈ తరంలోనిదే ఎంకాయి. ఈమె ఆవలపాడు సినసుబరాయుడి భార్య. సుట్టిల్లు కోటేసు కూతురు. ఆవలపాడు చెరువు నిండా నీళ్ళు పల్లెనానుకొనే వుంది చెరువు కాని ఆ చెరువులో నీళ్ళు మాలాళ్ళు దిగి ముంచుకోరాదు. చెరువు గట్టుకు దూరంగా బుంగలతో నిల్చుంటారు. అగ్రకులాల వాళ్ళు చెర్లో దిగినప్పుడు నీళ్ళు పోయించుకొంటారు. ఈ పరిస్థితి పోవడానికి సమావేశాలు జరిగాయి.

తండ్రి ధైర్యాన్ని పుణికి పుచ్చుకున్న ఎంకాయి బుంగ తీసుకొని చెరువులో నీళ్ళు ముంచడానికి ముందు నిలబడ్డది. వెనుక మిగతా ఆడాళ్ళు... వందల్లో... మగాళ్ళు... ఎంకాయి బుంగతో చెర్లో నీళ్ళు ముంచింది. కంట తడితో, ఆనంద భాష్పాలతో.

...బయిపు నీళ్ళు ముంచింది. తమ వారికి, తర్వాత తరాల వాళ్ళకు నీళ్ళు తాగే అదృష్టం కల్పించింది.

తర్వాత తరానికి చెందింది మేరీ సువార్త. రూతు కోడలు - యిమ్మానుయేలు భార్య. ఈమె ఏం చెప్పినా వింటుంది. ఆలోచిస్తుంది. కానీ తిరిగి తన నిర్ణయాన్ని చెప్పదు.

ఇంక చివరి తరానికి చెందింది రూబీ. పుట్టింది, పెరిగింది, చదివింది పట్నంలోనే... అయినా పల్లెన్నా ఆ ప్రజలన్నా ఇష్టపడేది, రూబేన్ - రూతుల మనుమరాలు, 'రోజీ' కూతురు. తాతయ్య-అమ్మమ్మలు, మామయ్య కొడుకు జెస్సీ, ఆ వూరు, ఆ ప్రజలు ఇవన్నీ ఆమెకిష్టం - అమ్మా నాన్నలకంటే కూడా. అమ్మానాన్నలకిష్టంలేని జెస్సీని పెళ్ళి చేసుకుంటుంది. అతడు నక్సలైటైనా తన భావాలనతనితో పంచుకుంటుంది. తన కోసం కాకుండా తన వారికోసం బతకాలనుకుంటుంది.

జెస్సీ తండ్రిబాటలో నడిస్తే, రూబీ భర్తకనుగుణంగా నడిచింది. మహిళా సంఘంలో చేరింది. సభల్లో మాట్లాడింది. మాల మాదిగల్లో మార్పుకోసం పోరాడింది. జీవితాన్ని కఠినంగా మార్చుకుంది.

"ఏదీ... ఏదీ... అంత తేలిగ్గా దక్కాయి. తవ్వాల్సింది, పూడ్చాల్సింది చాలా వుంది. అందుకే జ్ఞాపకం గతం కాదంటుంది రూతు. అదో అంతరాని వసంతమంటుంది. అలలు అలలుగా మొదలై ఆకాశాన్ని అంటుకొని అక్కడే విరిగి విరుచుకుపడే సముద్ర కెరటం తాలూకూ ప్రచండ ఘోష అంటుంది. ఆ వసంతానికి కొసమెరుపులేదు. వున్నదల్లా కొనసాగింపే... పాటలా... కవితలా అగాథాలని తవ్వుతో, అంతరంగాల్ని తొలుస్తో..." అన్న మాటలార్థం అంటరానితన సమస్య అంత మవడానికి ఇంకా ఎంతో చేయాలని...

ప్రాణం గుప్పెట్లో పట్టుకొని పరుగుతీసిన ఎల్లన్న మొదలు ప్రజల కోసం సాయుధమైన జెస్సీ దాకా.

మడవ మీద కాలుపెట్టి పారపైకెత్తిన సుభద్ర మొదలు నీళ్ళలో చేపలా జనంలో కలిసిపోయిన రూబీ దాకా...

అంతా యుద్ధమే. ఓ సుదీర్ఘపోరాటమే.. ఇప్పటికీ ఈ పోరాటం కొనసాగుతూనే ఉంది. మార్పుకోసం అంటరానితనాన్ని అంతమొందించడం కోసం.

(National Seminar on Problems of Rural Women in Tamil & Telugu Novels. 30-31 March 2004 Dept. of Tamil, S.V. Universityలో Present చేసిన పత్రం)



యీ మట్టి గిన్నెలో
'అలసిన మునువు' కుడిపిన గోరుముద్దలు తినేవాడ్ని
'నడచి వచ్చిన నాగేటి చాలు' మీద
పూరీడు పిట్టయి వాలేవాడ్ని
యిక్కడ పూరిల్లు, పచ్చని మొక్కలు, పాలకడవలు
అన్నీ నా సొంతం
నాగలి, కొడవలి, దుక్కిటెద్దు
నా దేహంలో భాగం
పల్లె, ఓ ఆకుపచ్చని జ్ఞాపకం

కళ్ళు తెరచేలోగా
చిల్ల పెంకులై పేలిపోయాయి మట్టి కలలు
తల్లేదీ? తల్లిలాంటి నా పల్లేదీ?
నా పాదాలను చుట్టుకున్న పచ్చని కలల పాదులేవీ?
నాగేటి చాలులో పురుడోసుకున్న
ఆకుపచ్చని తరాలేవీ?
వేయి గరిసెల వెలుగు రేఖలేవీ?

రండర్రా... రండి
వేలావు పాలు పిండి పరమాన్నం వండి
దేశ ఆకలి దేవతకు నైవేద్యం పెట్టిన అన్నదాతలారా...

# ఓ పల్లె కోసం



మన ప్రాణాలు రాశి పోసిన పంట
గిట్టుబాటు సుడిగుండంలో కొట్టుకు పోయినపుడైనా
పెట్టుబడుల పెనుగాలికి
పొలాలు ఎండుటాకులై ఎగిరిపోయినపుడైనా
గొంతెత్తి ఓ పొలికేక వేయలేకపోయాము
దేశ దేహ ప్రమిదలో ప్రాణదీపాలు వెలిగించి
ఆరిపోయిన అగ్గిపుల్లలమైపోయాము.
అన్నపూర్ణ వక్షోజమిపుడొక భిక్షపాత్ర
అడుక్కుతిన్నదిక చాలు
మన శవాల మీద చల్లిన ఎంగిలిమెతుకుల్ని
ఏరుకున్నదిక చాలు

యికనైనా... ఉనికిని కాపాడుకుంటూ...
ఊపిరి నిలబెట్టుకుంటూ...
పోరుజెండాలై ఎగురుదాం రండి,
ఓ పల్లె కోసం... భూమి కోసం... బతుకోసం!

# గన్‌మన్



**ఉదయం ఐదు గంటలకు చంకకు ఎ.కె. ఫార్టీసెవన్ గన్ తగిలించుకొని పొద్దున్నే సైకిల్ మీద తనకు డ్యూటీ అలాట్ చేసిన సార్ ఇంటికి పోవటం, ఆసార్ వెంబడే రాత్రి దాకా వుండటం. మళ్ళీరేపొద్దున్నే రావటం గన్‌మెన్‌గా శ్రీనివాస్ తప్పని డ్యూటీ, రోజులు గడుస్తున్నాయి కనీసం చాయ్ తాగావా! అని కూదా అడగరు వాళ్ళ వెంట కుక్కలా తిరగాలి.**

కొలనుపాక మురళీధరరావు

ఉచ్చకు పోతే, తిండికిపోతే వెంట వుండాలి. ఏడపడితే ఆడ ఎప్పుడు పడితే అప్పుడు ఎవిడికి బడితే ఆడికి పోలీసు రక్షణ కావాలంటే ఈ మధ్య గన్‌మెన్‌లను ఇస్తుండ్రు.

ఒక్కొక్కసారి రాత్రి మూడోయాళవుతుంది. ఒక్కోసారి సైకిల్ పంక్చర్ అయితే నడిచిపోవాల్సిందే, స్కూటర్ ఇవ్వమన్నా ఇవ్వరు. కానీ ఆ పని ఈ పని చేయించుకుంటారు కొందరు. ఇక వి.ఐ.పి.లా సరేసరి. జీపు ఎక్కంటారు ఎక్కడికని చెప్పరు. చెప్పేదోచోటికి పోయేది మరోచోటికి పాపం వాళ్ళకు ప్రాణభయం ఆ భయంతో అప్పుడప్పుడు బిగుసుకుపోతారు. ఎ.సి. కార్లలో అయితే కాస్త కునుకు తీస్తారు. వాళ్ళు ప్రజాప్రతినిధులు. ఓట్లతో, నోట్లతో అండబలం, అర్థబలంతో గెల్చిన వి.ఐ.పి.లు తాచుపామంత వుండే జెర్రిపోతంత పిరికివాళ్ళు. మాటలు కోటలు దాటుతాయి. జనాలకు అరచేతిలో వైకుంఠం చూపిస్తారు.

"ఏం శ్రీనివాస్! చూస్తున్నావ్" డ్రైవర్‌నాగులు బాడీ లాగుతూ అడిగాడు.

"ఏందన్నా మన బతుకులింతేనా వాడికీ వీడికీ కుక్కలా కాపలా వుండటం పెళ్ళాం పిల్లలకు దూరంగా ఈ పోలీసు ఉద్యోగం అన్నాడు" నాగులు నిట్టూరుస్తూ.

అదే మరేం చెయ్యను "బి.ఎ. చదివినా ఉద్యోగం రాదాయె ఏదో దేవుని దయవల్ల ఈ పోలీసు నౌకరి దొరికింది. సివిల్ పోలీసు కావాలనుకుంటే దీంట్లోకి పంపించారు. మా ఎస్.పి. దొర" నిట్టూరుస్తూ అన్నాడు. "ఏదో ఈ బతుకైనా మంచిగ సాగిపోతే అంతే సాలనుకుంటా" అన్నాడు. "నీకు ఇంకా ఎన్నాళ్ళ సర్వీసుందన్నా" అడిగాడు శ్రీనివాస్.

"ఇంకా ఐదేళ్ళుంది ఇద్దరు పిల్లల పెళ్ళిళ్ళు చేయాలి."

తెల్లవారు జామున ఐదు గంటలకే శ్రీనివాస్ హెడ్ క్వార్టర్‌లో రిపోర్టు, డ్యూటీ అలాట్‌మెంట్ ఇచ్చాను. ఈ మధ్య చాలా మంది వి.ఐ.పి.లు తమకు పోలీసు రక్షణ కావాలంటూ దరఖాస్తులిచ్చిండ్రు. ఎస్.పి.గారు చాకులంటి కుర్రాళ్ళను సెలక్ట్ చేసి అందరికీ ఆధునిక రక్షణ చర్యలు తీసుకునేందుకు చేయవలసిన విధులను తాను స్వయానా పరిశీలిస్తూ తగిన సూచనలిస్తున్నారు. తగిన శిక్షణకు హైదరాబాద్ పంపేందుకు ఎంపిక చేస్తున్నారు. శ్రీనివాస్‌ని ఎస్.పి.గారు ప్రత్యేకంగా గమనించి అతనితోపాటు మరో ముగ్గురుని హైదరాబాద్ స్పెషల్ ట్రెనింగ్ కోసం పంపిస్తున్నారు. శ్రీనివాస్ బి.ఎ. వరకు చదువుకున్నారు. మంచి శరీర దారుఢ్యంకల్గిన ఐరన్‌రాడ్ లాంటి కాళ్ళు చేతులు వుండటమేగాక షార్ప్ అండ్ యాక్టివ్‌గా డిపార్ట్‌మెంట్‌లో పేరు తెచ్చుకున్నాడు. ఆఫీసర్లకు కూడా శ్రీనివాస్‌పై మంచి అభిప్రాయమే వుంది. అందుకే అతన్ని స్పెషల్ వి.ఐ.పి. రక్షణ దళంలోకి తీసుకున్నారు. రెండు వారాలు హైదరాబాద్‌లో ప్రత్యేక శిక్షణ శిబిరంలో మంచి

ప్రాముఖ్యత సంపాదించాడు. అక్కడి నుండి మరో వారం ఇంకో ప్రత్యేక శిక్షణ కోసం శ్రీనివాస్‌తోపాటు మరి ముగ్గురిని కేంద్ర రక్షణ శిక్షణ శిబిరానికి పంపించారు. అక్కడ కూడా శ్రీనివాస్ బాగా రాణించాడు.

మూడు వారాల తర్వాత శ్రీనివాస్ ఎస్.పి.కి గన్‌మెన్‌గా చేరాడు. దొర ఏడికిపోతే ఆయన వెంబడే పోవాలి. వేయి కళ్ళతో అలా జాగ్రత్తగా మెలగాలి. ఏ మాత్రం పొరపాటు జరిగినా ఇంతే సంగతులు. కత్తిమీదసాము అన్నారెవరో గానీ అంతకన్నా ఎక్కువే. తిందామంటే ముద్ద మింగుడుపోదు ఇంటికొచ్చేవరకు భయం భయం. బిక్కు బిక్కుమంటూ భయం గుప్పెట్లో గడపాలి. శ్రీనివాస్‌కు ఏం చెయ్యాలో అర్థంగావడంలేదు. తన ట్రైనింగ్ తన తెలివితేటలు ఎటుపోయాయో ఎప్పుడూ టెన్షన్, టెన్షన్ ఎలర్ట్.

డి.ఐ.జి. దొరగారొచ్చిన్రు. ఒకటే హడావుడి. సెక్యూరిటీ టైటుగా వుంది. ఎ.సి.పి. వెంట వున్న శ్రీనివాస్‌పైన డి.ఐ.జి.గారి కన్ను పడింది. కళ్ళతో పిలిచాడు. కడకి సెల్యూట్ కొట్టాడు. పై నుంచి కింది దాకా చూస్తుంటే ఒంట్లో వణుకుపుడుతున్నా అట్లాగే కడకి నిలబడ్డాడు. సంతృప్తి పడక తలూపి సైగ చేసిండు. వెంటనే మళ్ళా కడకి సెల్యూట్ కొట్టి బయట పడ్డాడు. "ఏంద్రా శ్రీనివాస్ పెద్ద దొర నిన్ను పిల్చిండు ఏమైనా తప్పు జరిగిందా." డి.ఐ.జి. దొర ఎందుకు పిలిచాడో ఎందుకు పొమ్మన్నాడో అర్థం కావడంలేదు.

వారం పది రోజులు గడిచినాయి. శ్రీనివాస్‌కు లగ్గం కుదిరిందని తన మేమమామ కూతురుతో పెళ్ళి. అని తనతోటి వారితో చెప్పుకొని సంబరపడుతున్నాడు. అది కాస్త ఎస్.పి. గారి చెవిలో పడింది. ఇంకా ఆ అమ్మాయి బి.ఎస్.సి. చదువుతుందని వరీక్షలవగానే పెళ్ళి చేసుకుంటానని ఏదో చెబుతుండగా ఫోను మోగింది. శ్రీనివాస్ ఫోన్ అందుకొని 'యస్సార్ యస్సార్' అంటూ ఎస్.పి.గారికి అందించాడు. ఆయన అటెన్షన్‌గా సార్, అలాగే అలాగేసార్ మంచిది వచ్చేనెల దాకా సరేసార్ అంటూ ఫోర్‌నాట్ టూ దాసార్ అవును సార్ సరేసార్ డిప్యుటేషన్ తీసుకుంటారు. సరే 'హి ఈజ్ నైస్ కాప్' సార్ ఎస్సార్" అని ఫోన్ పెట్టాడు ఎస్పీ దొర.



శ్రీనివాస్ అటెన్షన్‌గా నిలబడ్డాడు. అతనికేసి చురుగ్గా చూసి ఎస్పీ శ్రీనివాస్ యాదగిరి గుట్టకు డి.ఐ.జి.గారు వస్తున్నారట అమ్మగారు కూడా వస్తున్నారట. శ్రీను నీవు ఇంకా యైట్‌నాట్ ఫోర్, వన్ వన్‌సిక్స్ మీరు భువనగిరికి పోయి యాదగిరిగుట్ట వి.ఐ.పి. గెస్ట్‌హౌస్ పక్కన వున్న రెండు కాటేజీలు ఆక్యుపై చేయండి. ఆ తర్వాత ఇద్దరు అలర్ట్‌గా వుండాలి. శ్రీనివాస్ నీవు డి.ఐ.జి. దొరగారి వెంట ఆయన పర్సనల్ సెక్యూరిటీగా వుండాలి ఇది ఆయన ఆర్డర్. అందరికీ అటెన్షన్‌గా సెల్యూట్ కొట్టాలి.

శ్రీనివాస్, ధైర్యం చేసి "డి.ఐ.జి. దొరగారు ఎప్పుడొస్తారట" అనడిగాడు. "శనివారం ఉండి పూజలు చేయించుకొని రాత్రికిపోతారు. నీవు యైట్‌నాట్‌ఫోర్, వన్‌వన్‌సిక్స్ ఆ దొర పోయే వరకు వారివెంట వుండాలి. వారిని బీబీనగర్ పొలిమేర్లకు తోలించి మీరు నల్గొండకు విచ్చేయండి." ఎస్సార్ మరోసారి సెల్యూట్ చేశారు. పొమ్మని సైగ చేశారు ఎస్‌పిగారు. ఒక్కసారి ఊపిరి పీల్చుకుంటూ బయటకు వచ్చారు. అతని వెంట మరో పి.సి. భువనగిరి నుండి ఫోను మెస్సేజ్ వచ్చింది. అంతా ఒకే అంటూ.

శని, ఆదివారాలు భక్తులు చాలా మంది వుంటారు. కోలాహలంగా వుంటుంది. ఆలయంలో భక్తజన సందడి తెల్లవారుజాముననుండే పుష్కరిణిలో స్నానాలు, తలస్నానాలు ఇచ్చేభక్తులు. ధర్మదర్శనం కోసం పరుగెత్తి క్యూలో నిలబడాలని తొందరపాటులో ఉరుకులు పరుగులు రెండవ శనివారం కాబోలు ఆఫీసులకు సెలవు రోజు కల్సి రావటంవల్ల మామూలు కన్నా ఎక్కువ జనమే వచ్చిన్రు. పులిమి దాల్చి పుట్రకిందినట్టు. విఐపి దర్శనాలతో ఆలయ కమిటీ వారు ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

గుట్ట ఔట్‌పోస్ట్ అలర్ట్ అయ్యింది.

"అయ్యగారు భువనగిరి వచ్చిండట అంటూ ఇన్‌ఛార్జి అమీన్‌సాబ్." ఒకసారి విఐపి కాటేజిలకు అని కారు పంపిండు. ఆ కారు నుండి మూర్తి అమీన్ ఆయన బలగం వచ్చింది. ఇవాళ్ళనే మళ్ళీ అర్జంట్ మెస్సేజ్ డి.ఐ. దొరగారు కొలనుపాక పోతూ తిరుగుదారిలో యాదగిరిగుట్టకు వస్తారని. అయ్య బాబోయ్ గుండెల్లో రైలు పరిగెత్తి నట్టంది. మూర్తి వెంటనే బలగాన్ని తీసుకొని కొలనుపాకకు మెస్సేజ్ ఇచ్చి వెంటనే తాను ఆఘమేఘాల మీద బయలుదేరాడు.

కొలనుపాక జైన్ మందిర్‌లో అఖండ స్వాగతం పలికిండ్రు. అక్కడ అరగంటసేపు వుండి వెంటనే యాదగిరిగుట్టకు బయలుదేరిండ్రు. ఆ కారులో బృందంతోపాటు వి.ఐ.పి దొర గారు ఉన్నారు. యాదగిరిగుట్టకు మెస్సేజ్ పంపించారు.

శ్రీనివాస్, త్రినాట్‌ఫోర్, వన్‌వన్‌సిక్స్ విఐపి కాటేజి వున్న తను స్వాధీన పరచుకున్నారు. మూడు కాటేజీలలో అన్ని ఏర్పాట్లు చూసుకున్నారు. ఒకసారి చుట్టు ప్రక్కల చూసుకున్నారు. ఎస్.పి. దొరగారు తనకు స్పెషల్ ఇన్స్‌పెక్టర్‌ను ఇచ్చారు. తనూ త్రిబుల్‌వన్ ఉన్నాడు. 804 పక్కన వున్న విఐపి కాటేజిలో ఎస్.పి.గారు ఉండాలని ఆర్డర్ మళ్ళీ మెస్సేజ్ వచ్చింది. దొరగారు గుట్టదారిలో నాగార్జున విగ్రహం చేసిన స్థలం వద్ద వున్నారని పది నిమిషాల్లో వస్తున్నారని. భువనగిరి యాదగిరిగుట్ట పిసిలు, మఫ్టీలో మంది అలర్ట్ అయ్యిండ్రు. ఆలేరు ఎస్.ఐ. జాన్ రాగా ఆ వెంట తెల్లకారులో మరో నల్లమారుతీ ఎస్టీం వున్నది. దొరగారు దేంట్లో వున్నారో తెలియకుండా జాగ్రత్త పడ్డట్టుంది. గబాగబా శ్రీనివాస్ అయ్యగారి కారు గుర్తించి వెంటనే అక్కడ మరోకసారి సెల్యూట్ చేసిండు, చుట్టుపక్కల చూస్తూ నల్గొండ నుండి ఎస్పీ గూడ రమ్మన్రు. కొంచెం ధైర్యం కలిగింది. ఎస్పీగార్ని చూడగానే శ్రీనివాస్ అటు తిరిగి సెల్యూట్ చేశారు. ఎస్పీ దొరగారు తల ఊపారు.

ఆలయ మర్యాదలతో డి.ఐ.జి. గార్ని ఆలయంలో తీసుకు వెళ్ళిండ్రు. వారి పక్కనే ఎస్.పి. గారున్నారు శ్రీనివాస్ చెవిలో ఏదో చెప్పారు. వెంటనే డి.ఐ.జి.గారు కేటాయించిన కాటేజీ చుట్టు పక్కల చూశారు. విశాలంగా, కాటేజీ దగ్గర జామకాయలమ్ముకునే మగవాళ్ళు ఆడవాళ్ళు తప్ప ఇంకెవరూ కనిపించుట లేదు. మరొకసారి వారిని గమనించి తిరిగి ఎస్.పి. గార్ని కలుసుకున్నారు. ఇప్పుడు శ్రీనివాస్ మఫ్టీలో ఉండటంవల్ల ఎవరూ గుర్తు పట్టడం లేదు. ఆలయంలో దర్శనం పూజలు అయిన తర్వాత కాటేజీ వచ్చిన్రు అయ్యగారు, అమ్మగారు, వారి కూతురు. శ్రీనివాస్ మరొక్కసారి చుట్టు పక్కల చూసిండు, జామకాయలు అమ్ముకునే వాళ్ళలో ఒక్కరిద్దరు కనిపించలేదు. అనుమానం

కల్గింది. ఎందుకైనా మంచిదని భువనగిరి పిసిని మఫ్టీలో వుంచారు. తాను కొంచెం అటు కాటేజీ పక్కలకు పోయి చూసిండు. జామ కాయలమ్ముకునే వారేరని అడిగిండు. "ఏమోసార్ ఇయ్యాళ్ళనే చూస్తున్నాం. ఏడికిపోయిండో ఏమో కాయలు ఆడనేవున్నాయి. మరెక్కడికైనా బయటకు పోయిండో ఏమో." వస్తే నాకు చెప్పు అంటూ తాను దూరంగా బాయ్ కొట్టులో కూర్చుండు. గంట అయ్యింది రెండు గంటలైంది. పోయినోడు రాలేదు. దొరగారు మరొకసారి దేవుని దర్శనానికి పోయింద్రు. ఆయన వెంట అమ్మగారు ఒక్కరే పోయింద్రు. అమ్మాయిగారు కాలేజీలో ఉన్నట్టుంది. ఒకసారి రోడ్డుపైకి పోయి అటు ఇటు చూసి శ్రీనివాస్ దూరంగా జామకాయల కొచ్చి తాను ఎవరితోనో కాటేజీ వైపు చూపిస్తూ మాట్లాడుతుంది. అనుమానం బలపడింది. ఐయిట్‌నాట్ ఫోర్‌ను సెలెక్షన్ మెస్సేజ్ ఇచ్చి తాను వెంటనే అక్కడికి చేరుకునేలాగా వాళ్ళు ఎటో మోటార్ సైకిల్ మీద పోయింద్రు ఎటో దొరకలేదు. వెంటనే గబగబా ఎస్.పి. గార్ని కలిసి పరిస్థితి వివరించాడు. ఎస్.పి.గారు వెంటనే అలర్ట్ అయి స్టేషన్‌కు మెస్సేజ్ ఇచ్చింద్రు. వెంటనే అయ్యగారి కాటేజి ఖాళీ చేయించి దేవాలయం కార్లో అయ్యగార్ని ఆ వెంట ఇంకా గూడ్సు కాటేజీలో అందర్ని సర్దేసి శ్రీనివాస్‌ను అయ్యగారి ఫ్యామిలీ వెంటనే ఈనోకాన్ పంపి గూడ్స్ కాటేజి మిగతా వాళ్ళు మఫ్టీలో భువనగిరికి పంపివేశాడు. డి.ఐ.జి. గార్కి అర్థమైంది. ఏదో జరిగిపోయిందని అయినా తన ఫ్యామిలీ మెంబర్ల ముందు బయటపడకుండా గంభీరంగా ఉండిపోయాయి. ఎస్.పి.గారు పది నిమిషాలలో బయలుదేరారని భువనగిరి నుండి మెస్సేజ్ వచ్చింది. ఈలోగా డి.ఐ.జి.గారు గడిపిన బంగ్లా దద్దరిల్లింది. కంగారుగా అందరూ అటు బయలుదేరింద్రు. మిగతా వాళ్ళు పొజిషన్ తీసుకొని అప్పటికే గుట్ట అంతా భయాందోళనలలో భక్తులతో కింది మెట్ల నుండి కొందరు, మరికొందరు వేరే దారులెంట ఇష్టమొచ్చినట్లు కిందికి పరిగెత్తుతున్నారు. జనాలను అదుపులోకి తీసుకోవటం కష్టమైంది. అక్కడి ఎస్.పిగారు మీద పోలీసులు మైకుల ద్వారా ఏమీ కాలేదు కంగారు పడరాదని భక్తులను హెచ్చరించారు. గ్యాస్ సిలిండర్ పేలిందని ఏదోనమ్మబలికి తమ పని తాము చకచకా చేసుకుంటూ పోతున్నారు.



భువనగిరికి వెంటనే ఈ సంఘటన మెస్సేజ్ ఇచ్చి వేరే ప్రైవేటు కార్ల ద్వారా దొర తన బంగ్లా చేర్చుదామనుకున్నారు. డి.ఐ.జి.గారు తాను ఉండిపోయారు. తన ఫ్యామిలీని చిట్యాల మీదుగా హైదరాబాద్‌కు చేర్చమన్నారు. లేద్ సార్ అమ్మగారు బెంగ పెట్టుకుంటుంది. అమ్మాయి భయపడింది. మీరు మా శ్రీనివాస్, 804ను ఈవోగారి కారులో వెళ్ళిపోరి. నేను ఎప్పటికప్పుడు మిమ్మల్ని కాంటాక్ట్ చేస్తాను. అక్కడ అంతా కంట్రోలు అయ్యింది. పరిశోధన చేశారు మీ కారు కొంచెం డ్యామేజి అయ్యింది. Everything is ok sir ఈవోకారు శ్రీనివాస్ డ్రైవ్ చేస్తాడు. 804 వెంట వుంటారు. It's my request and security sir! అంటూ అణుకువతో అన్నాడు. డిఐజిగార్కి ఎస్.పి. గారి మధ్య మంచి సయోధ్య ఉంది. ఎస్పిగారు డిఐజి గార్కి మంచి Family friend. అందుకే కొంచెం చనువుగా మాట్లాడుకుంటూ అప్పుడప్పుడు పర్సనల్‌గా ఉన్నప్పుడు అదే తీరుగ సాధ్యమైనంత వరకు వారిని ఇంటికి పంపించాలని ఏర్పాటు చేసి, ఇంకా తనకు తెల్సిన వాళ్లను ఇ.ఒ. కారును ఇచ్చి చిట్యాల, చౌటుప్పల్‌కు ఎస్.పి. ...
కమ్మని అప్పుడప్పుడు కార్లు మార్చమని సలహా ఇచ్చాడు. చౌటుప్పల్‌కు చేరుకొనేసరికి ప్లాను ప్రకారం కవరు చేసుకొని డిఐజి గారింటికి వచ్చేసరికి అటు నుండి ఇటు నుండి మెస్సేజ్ ఇచ్చుకున్నారు. చౌటుప్పల్‌లో క్రాస్ చేసి అన్నార్‌పేట చేరేలోగా స్పెషల్ సెక్యూరిటీ ఫోర్సుమన్లు వచ్చాయి. అప్పటి వరకు చాలా టెన్షన్‌గా వున్న వాళ్ళంతా ఒక్కసారిగా ఊపిరి పీల్చుకున్నారు. ఈవో గారి కారును అక్కడే వుంచి మెస్సేజ్ కొరకు ఎదురు చూస్తున్నారు. పిసి 402, 804 డిఐజి గారి డ్యూటీలు పడ్డాయి. కొంచెం బిపి మనిషేమో అప్పటి వరకు అనీజిగా వున్నారు. అందులో ఫ్యామిలీతో ఉన్నారామె. 'వెల్‌డన్ మైబాయ్' అంటూ శ్రీనివాస్ భుజం తట్టారు డిఐజిగారు. 804 వైపు చూస్తూ మీరు అలర్ట్‌గా వుండబట్టి మేము సేఫ్‌గా వచ్చాం. ఐ విల్ రికమండ్ ఫర్ యువర్ ప్రమోషన్ ఇద్దరు కడక్ సెల్యూట్ కొట్టారు. రాత్రి ఎనిమిదైంది. ఈలోగా గుట్ట నుండి మెస్సేజ్ వచ్చింది. Everything OK and normal. ఇది 'వాళ్ళపని' అని తేలిపోయింది. 304 అప్రమత్తంగా వుండటంవల్ల ఘోర దుర్ఘటన తప్పింది దేవుని దయవల్ల. ఎస్పిగారు ఇన్ఫర్మేషన్ ఇచ్చి ఆ రాత్రి డిఐజిగారి క్వార్టర్‌లోనే వుండమన్నారు. ఆయన కుటుంబ సభ్యులు. సార్ వెళ్ళిపోతాం ఎనిమిదిన్నరకు నాన్‌స్టాప్ వుంది పదకొండు గంటలకు నల్గొండకు చేరతాము.

ఎయిట్ నాట్‌ఫోర్ మెల్లగా సార్ శ్రీనివాస్‌కు పెళ్ళి కుదిరింది. రేపటి నుండి సార్‌పెళ్ళికి ఎల్లుండి లగ్గం సార్ భయం భయంగా దొరగారేమంటారని అడిగాడు. వెరీగుడ్ అంటూ తలూపారు. ఇవిగో ఇవి తీసుకోండి కవర్లు ఇద్దరికీ చేతికిచ్చారు. లోపలి నుండి డిఐజిగారి భార్య సావిత్రమ్మగారు. "అమ్మా ఇదేంటి?! మా డ్యూటీ మేం చేశాం, క్షమించండి అమ్మగారు." కడక్ సెల్యూట్ కొడుతూ ఇద్దరన్నార మీరైనా చెప్పండి అన్నట్టు డిఐజిగారి వైపు చూశారు తన ప్రమేయం ఏంలేనట్టుగా చూస్తున్నార డిఐజిగారు "ఆ లక్ష్మి నరసింహ్మస్వామి దయవల్ల గండం గడిచి పిల్లాపాపలతో బయటపడ్డాం. మీ సహాయం లేకుంటే క్షేమంగా ఇల్లు చేరే వారమా!" కృతజ్ఞతత సావిత్రమ్మగారు అంది.

"అదేంటమ్మగారు, మీరు మా అమ్మలాంటి వారు, మిమ్మల్ని కాపాడటం కోసం మేం చేసిన కర్తవ్యం మాత్రమే." వినయంగ అన్నారిద్దరూ, అలిపిరిలో జరిగిన సంఘటన పోలీసు రక్షణ తప్పద అందరూ భావించారు. అందుకే జిల్లా ఎస్పిగారు తనదైన శైలిలో మార్గా ఎన్నుకొని ఎప్పటికప్పుడు మార్పులు చేరుస్తూ సూచనలతోపాటు ఇద్దరిని సమయస్ఫూర్తివల్ల, మన అదృష్టం బాగుండి బయటపడ్డాం ఆమె సంతోషంలో అమ్మగారేదో ఇస్తుంటే వద్దంటా రేంటయ్యా అన్నార డిఐజిగారు. "సారీ సారీ సార్ మమ్మల్ని క్షమించండి." దయచేసి ఎంత వినయంగా ఓకె 'యు కెన్ గో' అన్నాడు డిఐజి గారు. ఇద్దరూ మరోసా సెల్యూట్ చేసి నల్గొండకు చేరారు.

మళ్ళీ షరా మామూలే. బందూకులూ-బందోబస్తుల అరచేతుల్లో ప్రాణాలు గన్‌మన్ల జీవితాలు కూడా.

శ్రీనివాస్‌కు పెళ్ళి సెలవు ఇంకా మంజూరు కాలేదంటే ఎం బాధ పడతాడో అనుకున్నాడు శేఖర్ మరో గన్‌మన్, ఇదీ గన్‌మన్ కథ

# బంగారు గుడ్డు పెట్టిన బాతు



అద్దేపల్లి ప్రభు

**పూర్వం కాదు ప్రస్తుతం ఒక మనిషి దగ్గర ఒక బాతు ఉంది. ఒకానొక రోజు ఆ బాతు బంగారు గుడ్డు పెట్టింది. ఆ మనిషి మహదానందంతో బాతుకి దణ్ణం పెట్టాడు. కొబ్బరికాయ కూడా కొట్టాడు. బాతు అలా అతనికి రోజుకొక గుడ్డు పెట్టేది. కొన్నాళ్ళకి ఆ మనిషి దగ్గరకి ఒక వ్యక్తి వచ్చాడు.**

"ఈ బాతు బంగారు గుడ్డు పెడుతుంది కదా. బానే ఉంది. కానీ ఇది రోజుకి ఒక గుడ్డే పెడుతోంది., అది నువ్వు బతకడానికే సరిపోతుంది. యిలా అయితే నువు పైకెలా ఎదుగుతావు? ఎప్పుడు ఫ్రిజ్ కొంటావు? ఎప్పుడు టీవీ కొంటావ్? ఎప్పుడు కారుకొంటావ్? ఎప్పుడు బంగళాకొంటావ్? కొడుకుని ఇంజనీరెప్పుడు చేస్తావ్? బంగారం ఎప్పుడు కొంటావ్? అమెరికా ఎప్పుడెల్తావ్? ఈ బాతు ఉత్పాదక శక్తిని నువు పెంచాలి. అప్పుడు ఇది ఎక్కువ గుడ్లు పెడుతుంది. నువ్వు త్వరగా పైకెదిగిపోతావ్" అన్నాడు.

"బానే ఉందిగాని ఎలా?" అన్నాడు మనిషి.

"బాతుని గ్లోబలైజ్ చేయాలి. అప్పుడు దాని మీద విదేశీ పెట్టుబడి వస్తుంది. నేను పరిశోధనలు చేసి ఈ బాతురోజుకి వంద గుడ్లు పెట్టేలా చేస్తాను. దాని మీద అంతర్జాతీయ పేటెంటు నాదే" అన్నాడు.

మనిషి సరే అన్నాడు.

ఆ వ్యక్తి బాతు మీద పరిశోధనలు చేశాడు. ఏవేవో ఇంజక్షన్లు చేశాడు. ఆ బాతు చేత ఇంకో బాతు మాంసం తినిపించాడు. ఏవేవో చేశాడు. బాతు పది గుడ్లు పెట్టింది.

"చూసావా! మన పరిశోధన ఫలిస్తోంది" అన్నాడు.

కొన్నాళ్ళు పోయాక బాతు పన్నెండు గుడ్లు పెట్టి కళ్ళు తేలేసింది.

లబోదిబోమన్నాడు మనిషి.

"కంగారుపడకు ఈ గుడ్లనించి బాతుల్ని పొదిగి బంగారు బాతుల ఫాం నిర్మిద్దాం. మనకి ప్రపంచ బ్యాంకు కావల్సినంత అప్పిస్తుంది" అన్నాడా వ్యక్తి. అప్పు తెచ్చాడు. ఫాంకి కావల్సిన బిల్డింగు కట్టారు. దానికి వెళ్ళడానికీ రావడానికి పెద్దతార్రోడ్డు వేశారు. బాంకు చెప్పిన చోటే కొని యంత్రాలు తెచ్చారు. లైట్లు వేశారు.

అంతా ధగధగ వెలిగిపోతోంది.

బాతుగుడ్లని ఎలాగో పొదిగి బాతుల్ని చేశారు. పన్నెండు బాతులు.

"ఇవి త్వర్లోనే వందలు వేలవుతాయి. వేల కొద్దీ బంగారు గుడ్లు. ఈ గుడ్లని గ్లోబలైజ్ చేయడంవల్ల ఎంత అభివృద్ధి జరిగిందో చూసావా" అన్నాడు వ్యక్తి.

"కానీ బాతులు అదో రకంగా ఉన్నాయ్" మనిషి.

"పిచ్చివాడా! మనం బాతుల గురించి కాదు ఆలోచించాల్సింది. వాటి గుడ్ల గురించి. ఈ గుడ్లని అమ్మడానికి బ్రాండ్ అంబాసిడర్లుగా మోడళ్ళుగా అందమైన అమ్మాయిలొస్తారు. సినిమా స్టార్లొస్తారు. మనం డబ్బుతో మునిగితేల్తాం"

కొన్నాళ్ళు గడిచింది. బాతులు వందేసి గుడ్లు పెట్టాయి. పెట్టి కళ్ళు తేలేస్తున్నాయి.

గుడ్లు మెరిసిపోతున్నాయి. అమ్మడానికి పట్టుకెళ్ళారు.

గీసి చూసి అన్నాడు.

"అబ్బే ఈ గుడ్లు కాకి బంగారం... ఎందుకూ పనికిరావు"

వ్యక్తి మాయమైపోయాడు.

బాతులు చచ్చిపోయాయి.

మనిషికి అప్పులు మాత్రం మిగిలాయి.

❖

# నిజరూప దర్శనం!

బడబాగ్ని శంకరరాజు



ఒకానొక ఏకాంత సమయంలో
నీరసించిన మమతానురాగాల వేడి నిట్టూర్పులు
జీవిత మాయా దర్పణాన్ని కరిగించివేస్తాయి.
వాస్తవాల ముదులన్నీ ఊడి
ప్లాస్టిక్ భావాల తొడుగులు జారిపోతాయి
నిటారు మనిషొకడు వజ్రకాయంతో మిగులుతాడు
తల్లిపాలు ఘనీభవించి రూపుదాల్చిన వజ్రం...
కన్నతండ్రి ఆశల నేత్రాలు పొదిగిన వజ్రం...
బాధల రాపిడులతో నునుపెక్కిన వజ్రం...
పదునైన చదువులతో పలుకోణాలుగా
చెక్కబడిన వజ్రం...!
ఆకాస్తా ఏకాంతంలో మనిషి
వజ్రంలాంటి మనిషి
అల్ప విజ్ఞానంతో విర్రవీగి
అనల్ప విజ్ఞానాన్ని
మతమౌఢ్యంతో పోగొట్టుకొన్న వైనాన్ని
ఇసుమంత సంఘసేవ చేసి
మార్పు గమ్యాన్ని పొగడ్తల మధ్య
మరిచిపోయిన వైనాన్ని
తన వారి కోసం స్వచ్ఛతను నటించి
సామాజిక స్వచ్ఛతా గుణాన్ని
ఇంటి గడపలోనే పోగొట్టుకొన్న వైనాన్ని,
మూడొంతుల జలగ్లోబును
మట్టి భాషలో వ్యాఖ్యానించి
ఒక వంతు మట్టిగ్లోబులో
జలనిధులను పోగొట్టుకొన్న వైనాన్ని
"ప్రచార యుద్ధంతో" భూసారాన్ని పెంచబూని
తనలోని భావసారాన్ని పోగొట్టుకొన్న వైనాన్ని
రూపాయి గౌరవ వేతనం ఆదర్శాన్ని చూపి
స్వాతంత్ర్యయోధుల ఆదర్శాలను
అంగడి సరకుగా మార్చినవైనాన్ని
ఒక శాతం వేదాంత రహస్యం కోసం
తొంభై తొమ్మిది శాతం...
భౌతిక జీవన సూత్రాల్ని పోగొట్టుకొన్న వైనాన్ని..!
తెలుసుకొంటాడు మనిషి, ఏకాంతంలో!
తనను తాను యవ్వనం, ప్రౌఢత్వం త్రాసులో
ఎన్నిసార్లు తూచుకొన్నా
పరిపూర్ణమానవునికి సరితూగకపోవడం...!
అగమ్యగోచరం కాదు
త్రాసును పట్టుకొన్న గ్లోబలీకరణ హస్తం
తప్పుడు తూకం రాళ్ళతో మోసం చేస్తుంది.
త్రాసుక్రింద "మాతృదేశ భూమ్యాకర్షణ శక్తిహీనత
వాస్తవమైన తూకాన్ని తేల్చలేకపోతుంది
ఆలస్యమైపోయింది...
ఏకాంతం ముగిసింది!
మాయా దర్పణం ప్రపంచం ప్లాస్టిక్ తొడుగుల్లోకి...
మనిషీ మళ్ళీ...
అమ్మకం కొనుగోళ్ళ యాంత్రిక జీవిత పంథాలోకి వచ్చేస్తాడు!
తనలోని వజ్రాన్ని వాణిజ్యం మరమనిషికిచ్చి
తన గుండెను సానరాయిగా అమరుస్తాడు.

# బీభత్సం

పరిమళ్



పైసకెన్ని బీభత్సముఖాలు?
రక్తం చెమటగా మారడం
రూపాయల్లోకి తర్జుమాచేశాక
లోపల మనిషెంత నలిగిపోతున్నాడు?

అమానవీయనవ్వుల్లో సేద తీరేవారికి
కన్నీటిలో ఉడుకుతున్నవాళ్ళు
చెప్పుల కింద ధూళిలాంటి వారు
వాళ్ళు అలాగే నడుస్తుంటారు

తనకొమ్మకే విచ్చుకోని మొగ్గలకేసి
తనగుండెనె రాతిగుండుగా విసిరాడు
ఈ నలిగిన మనిషి

మానవ ప్రయాణంలోంచి విస్తరిస్తున్న వెలుతురు
లోకాన్నింకా పూలతేరులో నడిపించడం లేదు
మనసులు మురికిగుంటలుగా మారుతూనేవున్నై

మహోన్నత సృజనశీలుడైన మనిషిని
తొలచివేస్తున్న అవ్యవస్థ
అదెప్పుడు మరణిస్తుందో
నవీన మానవీయస్వప్నం
ఊపిరి పోసుకునేదెప్పుడో...

(బతుకు విధ్వంసానికి తాళలేక తన ఇద్దరు పిల్లల్ని పాలమూరు బస్టాండ్‌
వదిలి వెళ్ళిన తండ్రి వార్త చూసి... భార్యకు విడాకులిచ్చాడు... అ
కూడా పిల్లల్ని తీసుకోలేదు...)

# నిర్మాణవాద సాహిత్య సిద్ధాంతం-ముఖ్యాంశాలు



**భాషను వ్యక్తి సృష్టించడు. భాషా వ్యవస్థలోని నిర్మాణాలే వ్యక్తిని నిర్మిస్తాయి అని నిర్మాణవాదం ప్రకటిస్తోంది. దీన్ని రచనా రంగానికి అన్వయిస్తే, రచనను మనం సృష్టిస్తామనేది తప్పని ఇప్పటికే రాసి ఉన్నదాన్ని మళ్ళీ రాస్తామని నిర్మాణ వాదం చెప్తోంది. సాహిత్య సంప్రదాయంలో స్థిరపడిన పద్ధతులు, నియమాలు, రూఢి వల్ల సాహితీ ప్రతిభ వల్ల (వ్యవహారంలో కనిపించకుండా) రాయబడి ఉన్న రచననే రచయిత తిరిగి రాస్తాడు. అందువల్ల రచన ఒక సంకేతం లేదా సంజ్ఞ.**

**శ్రీను**

**భా**షకు సాహిత్యానికి మధ్య సంబంధాన్ని సిద్ధాంత స్థాయిలో చర్చించడంవల్ల శాస్త్రీయత అనేది హ్యూమనీటీస్‌లోకి వచ్చింది. సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి లేదా మూల్యాంకనానికి వాడిన తూనిక రాళ్ళు ఇప్పటి వరకు భావజాలాలకు సంబంధించినవి. అందువల్ల సాహిత్య విశ్లేషణలో మోనాటనీ వచ్చింది. ఇలాంటిదే తత్త్వశాస్త్రంలో జరిగింది.

అయితే ఫిలాసఫీలో భాషకు సంబంధించిన శోధన ఆది నుండి ఉండటం వల్ల అనేక ఆవిష్కరణలు జరిగాయి. భాష-సమాజం- వ్యక్తి వీటి మధ్య సంబంధం ఎప్పుడూ చర్చించేవిగానే ఉంటాయి. సమాజంలో ఉండటం అనే అవకాశం వల్లనే వ్యక్తి దాన్ని అర్థం చేసుకోడని, భాష ద్వారా మాత్రమే సమాజాన్ని అవగతం చేసుకుంటాడని ఫిలాసఫిలో వచ్చిన కీలక భావన. దేవుడు కేంద్రంగా సాగే తత్త్వ అన్వేషణ స్థానంలో మనిషి లేదా వ్యక్తి కేంద్రంగా మారింది. దీనితో నీషే దేవుడు మరణించాడని ప్రకటించాడు. ఇదే భావన భాషా శాస్త్రంలో వ్యక్తి భాషను ఉత్పత్తి చేసేవాడనే వ్యక్తి కేంద్ర భావన స్థితి నుండి భాషే వ్యక్తిని ఉత్పత్తి చేస్తోందని భాషా తత్త్వ శాస్త్రం (ఫిలాసఫి ఆఫ్ లాంగ్వేజ్) ప్రతిపాదిస్తోంది. ఇదే భావన సాహిత్యంలో రోలాండ్ బార్త్స్‌ను రచయిత మరణించాడు(ది డెత్ ఆఫ్ ది ఆథర్)అని ప్రకటించేలా చేసింది. అయితే, భాషకు సాహిత్యానికి ఉన్న సంబంధం కేవలమైనది కాదనే ఎరుక సాహితీకారులకు లేకపోవడం వారి పొరపాటు కాదు. భాషా శాస్త్రం ఎంతో ముందుకు వెళ్ళినప్పటికి ఇంకా భాషా చరిత్రనే భాషా శాస్త్రంగా బోధిస్తోన్న యూనివర్సిటిలున్నై.

భాషా శాస్త్రం పేరుతో ఇప్పటికి మన యూనివర్సిటీల్లో బోధించేది భాషా చరిత్ర మాత్రమే. కేంద్రీయ యూనివర్సిటిల్లో వర్ణనాత్మక భాషా శాస్త్రం బోధిస్తున్నారు. ఇది కాస్త నయం. భద్రిరాజు, చేరా, పియస్ లాంటి వారు వర్ణణాత్మక భాషాశాస్త్ర అభివృద్ధికి కృషి చేశారు. యూరోప్‌లో కూడా వర్ణణాత్మక శాస్త్రాన్నే బోధించే వారు. అయితే, ససూర్ ఏకకాలిక భాషా శాస్త్రాన్ని ప్రయోగాత్మకంగా బోధించారు. 1960 నాటికి సాహిత్యంలో భాషా పరిశీలన ప్రధానంగా వచ్చింది. ఫార్మలిజం రూపాన్ని పరిశీలించే పేరుతో భాష సాహిత్యత్వం (లిటరరీనెస్స్) కు ఎలా హేతువు అవుతున్నదో అనే దానితో మొదలైన పరిణామం ఫెర్డినాండ్ డి ససూర్ ప్రతిపాదనల్ని సాహిత్యానికి అన్వయించారు. భాషా నిర్మాణాల్ని అధ్యనం చేయడం అనే మెథడాలజీని సాహిత్యానికి అప్లయి చేశారు.

భాషా శాస్త్రంలో వచ్చిన నూతన పద్ధతి వల్ల ఇతర అధ్యయన రంగాల్లో అనేక మార్పులు వచ్చినై. భాషా వ్యవస్థలోని నిర్మాణాల్ని అధ్యయనం చేసేదే నిర్మాణవాదం. ఈ మెథడాలజీని ససూర్ కనుగొన్నారు. అయితే గెన్నెట్ అభిప్రాయంలో ఇది కేవలం సిద్ధాంతంకాదు, ఆలోచనా విధానంగా చెప్పారు. భాషాంశాలు సాధారణ సూత్రాలుగా ఇతర డిసిప్లిన్‌కు కూడా అన్వయించారు. సాహిత్యానికి భాషకి ఉన్న సంబంధం వల్ల భాషా నిర్మాణ అధ్యయనం సాహిత్య రంగాన్ని కూడా తీవ్రంగా ప్రభావితం చేసింది. దీనితో కాల్పనిక మానవతావాదులు ఖంగుతిన్నారు.

నిర్మాణవాదం రచన నుంచి రచయితని వేరుచేస్తోంది. రచన స్వతంత్రమైనదని, అది ఒక ఫంక్షన్ గా భావిస్తోంది. కాల్పనిక మానవతా వాదం రచయితని కర్తగా, దానికి అతడే మూలంగా భావిస్తోంది. రచనను రచయిత సొంత ప్రతిభ చేత సృష్టిస్తాడని నమ్ముతుంది. అందువల్ల రచనను రచయితను వేరుగా చూడని కారణంగా రచయిత చుట్టూ ఆరాధనా భావం లేదా మూలం అనే భావం వల్ల విశ్లేషణ, విమర్శ అతడు లేదా ఆమే చుట్టూ తిరిగింది.

కాని నిర్మాణవాదం దాన్ని తిరస్కరించడమేగాక యే రచనకైనా, సంకేత వ్యవస్థకైనా మూలం అప్పటికే ఉనికిలో ఉన్న నిర్మాణాలని రచయిత ఉనికిలో ఉన్న వాటి వల్లనే ఒక్కవాక్యమైనా రాయగలుగుతున్నాడని నిరూపిస్తోంది. అంటే సమాజం ఏర్పాటు చేసిన లేదా ఆమోదించిన పద్ధతిలో, నియమాల్లో, సంప్రదాయాల్లో ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా భాషా వ్యవహారంలోకి ప్రవేశిస్తాం. అందువల్ల భాషను మాట్లాడుతాం అనడం కన్న భాషే మనల్ని మాట్లాడుతోంది అనడం సరైంది. ఉదార మానవతావాదం ప్రకారం వ్యక్తి ప్రపంచంలో ఉండటం వల్ల లోకం గురించి నేర్చుకొంటాడు. కాని నిర్మాణవాదం ప్రకారం భాష ద్వారానే ప్రపంచాన్ని తెలుసు కుంటాడు. సమాజం ఇలా నడుస్తోందని, దానిలో అది విధించిన నియమాలకు అనుగుణంగా నడవడానికి లేదా దానికి భిన్నంగా నడవడానికి కావాల్సిన తెలివిని భాష వల్లనే అందుతోంది.

కాబట్టి భాషను వ్యక్తి సృష్టించడు. భాషా వ్యవస్థలోని నిర్మాణాలే వ్యక్తిని నిర్మిస్తాయి అని నిర్మాణవాదం ప్రకటిస్తోంది. దీన్ని రచనా రంగానికి అన్వయిస్తే, రచనను మనం సృష్టిస్తామనేది తప్పని ఇప్పటికే రాసి ఉన్నదాన్ని మళ్ళీ రాస్తామని నిర్మాణ వాదం చెప్తోంది. సాహిత్య సంప్రదాయంలో స్థిరపడిన పద్ధతులు, నియమాలు, రూఢి వల్ల సాహితీ ప్రతిభ వల్ల (వ్యవహారంలో కనిపించకుండా) రాయబడి ఉన్న రచననే రచయిత తిరిగి రాస్తాడు. అందువల్ల రచన ఒక సంకేతం లేదా సంజ్ఞ. సంకేతాలు సాంస్కృతికనిర్మాణాలు. అందువల్ల సంజ్ఞా శాస్త్రం దృష్టిలో రచన ఒక సాంస్కృతిక నిర్మాణ కళా రూపం.

మానవతా వాదానికి నిర్మాణ వాదానికి గల తేడాను తెలుసుకోవడం వల్ల

జరిగిన మార్పు అవగతం అవుతోంది. అందువల్ల మానవతావాదం ఏమను కుంటుందో చూడాలి. మానవతావాదం ఇలా అనుకొంటుంది.

1. వాస్తవిక ప్రపంచం ఉన్నది. దాన్ని మనం సహేతుకమైన మనసు తో అర్థం చేసుకోవచ్చు.
2. వాస్తవ ప్రపంచాన్ని అందించడానికి భాష (అటు ఇటుగా)సమర్థవంతమైనది.
3. భాష ఒక రచయిత మానసిక ఉత్పత్తి లేదా స్వేచ్ఛా ఆత్మిక ఉత్పత్తి, అర్థాన్ని మనవమే నిర్ణయిస్తాం. మనం అనుకున్నదాన్ని అర్థవంతంగా అందించడం వల్ల భాష వ్యక్తుల ఆత్మిక సారంగా భావిస్తోంది.
4. ఆత్మ (సెల్ఫ్)- కర్తగా మనకు తెలుసు. నేను అని అనడం వల్ల అన్ని అర్థాలకు సత్యానికి వ్యక్తి కేంద్రంగా మారుతున్నాడు. నేను ఏమనుకుంటున్నానో అదే అర్థం, ఏది సత్యంగా గ్రహిస్తున్నానో అదే సత్యం. నేను నా సొంత అనుభవం నుంచి వ్యక్తీకరణ అవసరాలొంచి సొంత వాక్యాల్ని సృష్టించుకున్నా.

సమాజంలోని వ్యక్తులు అవసరాల వల్ల పరస్పరం వ్యక్తీకరించుకోవడానికి సాధనంగా భాష పని చేస్తుంది అనిగాని లేదా నిర్దిష్ట సమాజంలోని సభ్యులు వ్యక్తీకరణ కోసం ఏర్పర్చుకున్న నిర్వ్యాజ సంకేతాల వ్యవస్థ భాష అని నిర్వచించడం ఉదార మానవతావాద అవగాహన వల్లనే జరిగింది.

అయితే నిర్మాణవాదం దీనికి పూర్తి భిన్నంగా ఆలోచిస్తోంది. నిర్మాణవాదం ఇలా వాదిస్తోంది.

1. భాషా నిర్మాణమే వాస్తవికతని ఉత్పత్తి చేస్తోంది- దాన్ని భాష ద్వారా మాత్రమే అర్థం చేసుకొంటాం. అందువల్ల వాస్తవికతని గ్రహించడమనే దాన్నిభాషా నిర్మాణమే నిర్ణయిస్తోంది.
2. భాషే మనల్ని మాట్లాడుతోంది. అర్థం అనేది వైయక్తిక అనుభవంలోంచి వచ్చేది కాదు. అర్థాల్ని భాషా వ్యవస్థ నిర్ణయిస్తోంది. అనేక విరుద్ధతలు, సంకేతాలు, వ్యాకరణం వంటి అనేక అంశాలు భాషను నిర్ణయిస్తాయి. యే వ్యక్తి అయినా వ్యవస్థ నిర్ణయించిన పరిమితుల్లోనే వ్యవహరించాలి గనుక యే ఒక్కరూ అర్థాన్ని సృష్టించలేరు.
3. వ్యక్తిని కేంద్రంగా గాక నిర్మాణాన్ని కేంద్రంగా ప్రతిష్ఠాపిస్తోంది. వ్యక్తి అర్థాన్ని సృష్టించలేడు. నిర్మాణమే అర్థాన్ని ఉత్పత్తి చేస్తోంది. కేవలం భాషా నిర్మాణమే దాన్ని నిర్ణయించడం వల్ల


.............. ☆ ..............

**సాహిత్యాన్ని ద్వితీయ శ్రేణి భాషా రూపంగా నిర్మాణవాదం నిర్వచిస్తోంది. మాట్లాడే భాష సాహిత్యం కాదు. వ్యవహారానికి భిన్నమైన రెండవ భాషా రూపం సాహిత్యం అవుతుంది. ఈ రకం భాషలో సంకేతాలు, సంకేతితాల మధ్య ఉండే అస్పష్ట సంబంధం వల్ల ఖాళీలు ఉంటాయి. అంటే నిర్మాణాల మధ్య ఖాళీలు వాచకంలో ఉంటాయి. ఇవే అనేక అర్థాలు రావడానికి కారణం అవుతున్నది.**

.............. ☆ ..............


కేంద్ర స్థానానికి నిర్మాణం వచ్చింది. భాషా వ్యవస్థలో అలవడిన నేను అనే వాక్యంలోని కర్త కూడా, అందువల్ల నా అస్తిత్వం అనేది కూడా భాషా వ్యవస్థ ఉత్పత్తిగా భావిస్తోంది. పదానికి అర్థం వాక్యంలో దానికి గల సంబంధాన్ని బట్టి, స్థానాన్ని బట్టి ఉంటుంది.

అందువల్ల నిర్మాణవాద సాహిత్య సిద్ధాంతంలోని ముఖ్యమైన వాటి నిలా స్పష్టపరచవచ్చు.

1. రచన ఒక స్వతంత్ర వ్యవస్థ. సాహిత్య వ్యవస్థ అంతా ఒక వ్యవస్థ (లాంగ్), రచన ఒక భాషణం(పెరోల్).
2. రచన అర్థం, దానికి ఇతర రచనలతో గల సంబంధంపై ఆధారపడి ఉంటుంది.
3. రచన అనేది సంకేతాల వ్యవస్థ. సంకేతాలు సాంస్కృతిక నిర్మాణాలు కావడం వల్ల రచనలో వాటి ఫంక్షన్‌ను పరిశీలించాలి.
4. రచన నిర్మాణాల్ని వాటి మధ్య అంతస్సంబంధాన్ని మొత్తంలో భాగంగా పరిశీలిస్తోంది.

సాహిత్యాన్ని ద్వితీయ శ్రేణి భాషా రూపంగా నిర్మాణవాదం నిర్వచిస్తోంది. మాట్లాడే భాష సాహిత్యం కాదు. వ్యవహారానికి భిన్నమైన రెండవ భాషా రూపం సాహిత్యం అవుతుంది. ఈ రకం భాషలో సంకేతాలు, సంకేతితాల మధ్య ఉండే అస్పష్ట సంబంధం వల్ల ఖాళీలు ఉంటాయి. అంటే నిర్మాణాల మధ్య ఖాళీలు వాచకంలో ఉంటాయి. ఇవే అనేక అర్థాలు రావడానికి కారణం అవుతున్నది. రచనలోని నిర్మాణాల మధ్య ఖాళీలు ఉండటం వల్ల లేదా విరామం ఉండటం వల్ల సౌందర్యం

అనుభవంలోంచి వచ్చే సాహిత్యం అవుతుం
యిస్మాయిల్ రాసిన సాహిత్యంలో నిశ్శబ్ద
అనే వ్యాసం, వేల్చేరు పరాభి కవితల్లో ఖాళీ
గురించి రాసింది దీన్ని గుర్తించడం వల్ల
జరిగింది. వాచకంలోని సంకేతాల గురిం
నిర్మాణవాద విమర్శకుడు ఏమంటాడ
అనేదానికి, సంకేతాల అర్థాలెప్పుడు
అసంపూర్ణంగా అసంతృప్తిగా ఉండటం వ
ఆ అసంతృప్తిలోంచి సాహిత్యం వస్తోం
అంటాడు Gerard Gennette. ['This
frustation' of meanig, which is fro
zen and constituted in an object o
esthetic consumption is no doub
the movement [ or rather than ha
] that constitutes all literature" (Fig
ures of Literary Discourse, p.4
నిర్మాణవాదం, కవిత్వ భాషను సాహి
వ్యక్తీకరణ రూపాలుగా, సంకేతం-సందేశం
సంబంధంగా విశ్లేషిస్తోంది. విలియం ఎంప్స
అస్పష్టత (ఆంబిగ్విటి) అనేది ఈ రెండీ
నిర్వ్యాజ గుణం వల్ల వస్తోంది, అదే కవి
ధాతువు అంటాడు. నిర్మాణవాదం నిర్మాణా
స్పష్టపర్చడం వల్ల అస్పష్టతని తొలగించవచ్చు
భావిస్తోంది. అయితే, గెన్నెట్ నిర్మాణాల్
ధ్వనుల పునరావృత్తిని పరిశీలించే ఆదర్శ
వరకే ఆగకూడదని, మలార్మే చెప్పినట్లు, కవి
భాషా సారాన్ని ఏర్పర్చే, సాహిత్య సంజ్ఞాశా
(సెమియాలజీ) సమస్యల్ని ఏర్పర్చే అర్థఅంశా
పట్టించుకోవాలి. అందువల్ల డిస్కోర్సులో ఉం
విశాల ఏకత (లార్జ్ యూనిటీస్)ల యొ
నిర్మాణాల అధ్యయనం అనే పద్ధతి
అనుసరించాలి. అప్పుడు, వాక్యగ
పారడిగ్మాటిక్ సంబంధాల పరిశీల
అవసరమవుతోంది. అపుడు రూపాంతర భా
(ట్రాన్స్‌లింగ్విస్టిక్స్) డిస్కోర్సు అనివార్యం
చోటు చేసుకొంటుంది.

రచనను నిర్మాణవాదం బాహ
అంశాలతో సంబంధం లేకుండా రచనలో
నిర్మాణాల్ని మాత్రమే పరిశీలించడాని
పరిమితం అవుతుంది. ఇది ససూర్ భాషా శ
నిర్మాణానికి భాషా వ్యవస్థకు వెలుపల ఉ
రాజకీయ, ఆర్థిక, న్యాయ తదితర అంశా
దూరంగా ఉంచాలని చెప్పిన దా
పొరపాటుగా అర్థం చేసుకోవడం వల్ల రచన
శుద్ధ కళాంశంగా విశ్లేషించే పద్ధతి నిర్మాణవ
కీలక లక్షణంగా వచ్చింది. అయితే సంకేతా
సాంస్కృతిక నిర్మాణాలని, సంస్కృతి మాత్ర
వాచకాన్ని రచిస్తోందని సంజ్ఞాశాస్త్ర
ప్రతిపాదించడం వల్ల బాహ్య అంశాల్ని త
పరిశీలించాల్సిందే. ఆధారాల్ని ప్రేరణ

...లంచుకుండా కేవలం రచన(వర్క్) కు
...రిమితం కావడం సరైంది కాదు. రచనను
...హేతుకంగా అర్థం చేసుకోవడం,
...హేతుకంగా వ్యాఖ్యానించడం అనే
...ంశాలలో జోక్యం చేసుకోవాలి అంటాడు
...న్నెట్.

బార్త్స్ రచనను నిర్వచిస్తో రచనలోని ...దాల అల్లిక అది స్థిరమైన అర్థాల్నిచ్చేవిగా ...ందుపరిచి ఉంటుంది. what is a text, ...or current opinion? It is the ...henomenal surface of the literary ...ork; it is the fabric of words which ...ake up the work and which are ...rranged in such a way as to impose ...meaning which is stable and as far ...s possible unique (Theory of the ...xt, p. 32 ).... the text is, in the work, ...hat secures the guarantee of the ...ritten object, bringing to gather its ...afe-guarding function: (p.32). ...ర్త్స్ ప్రకారం వాచకం,రచన ఒకటి కాదు. ...చకాల్ని (టెక్స్ట్) కలిగి ఉండే దాన్ని రచన ...ంటూ రచన వాచకానికి గ్యారంటీని, ...క్షణనిస్తోంది. వాచకం మొత్తం రచనలో ఒక ...గం. జూలీ క్రిస్టీవా రచన(టెక్స్ట్)ని నిలా ...ర్వచిస్తోంది. 'we define the Text as ...anslinguistic apparatus which ...distributes the order of the ...nguage by putting a communi-...tive utterence, anterior , aiming ...form directly, in relation with ...fferent utterances, anterior to or ...nchronic withit" (semanalyse, ...334) జూలి క్రిస్టివా దృష్టిలో టెక్స్ట్ అంటే ...షా రూపాంతర చర్య. అది భాషా క్రమాన్ని ...టల ద్వారా అర్థాన్ని సూటిగా అందించడం ...్వారా తిరిగి పంచుతుంది. భిన్న ఉచ్చారణల ...ంబంధం ఉంటుంది.

ఆమె ఇచ్చిన నిర్వచనంలో కీలకమైన ...ద్ధాంతిక భావనలున్నై. అవి

సంకేతించే చర్య(సిగ్నిఫయింగ్ ప్రాక్టీసెస్) వాచకం వస్తువును సూచిస్తోంది. అంటే అది అందించే అర్థం ఒకే ఒక్కటని కాదిక్కడ భావం. సందర్భం, సామాజిక రాజకీయ అంశాల్ని అది రచించిన నేపథ్యాన్ని బట్టి అనేక అర్థాల్ని సూచిస్తోంది.

ఉత్పాదకత(ప్రొడక్టివిటి) అనేది శ్రమను ఉత్పత్తి చేయడం కాదు. లేదా రచయిత శైలి, రచనా టెక్నిక్ కూడా కాదు. ఉత్పాదకత అంటే వాచక రచయిత-పాఠకుడు ఇద్దరూ


............ ★ ............

నిర్మాణవాదంలో ద్విదాకృత సంబంధాల విభజన కీలకమైంది. అంటే దీని అర్థం ఉదాహరణల వల్ల అవగతం అవుతుంది. పగలు- రేయి, అతడు- ఆమె, శత్రువు- మిత్రుడు వంటి విభజనని ద్విదాకృత సంబంధాలంటారు. ఇలా రచనలోని పాత్రల్ని సంఘటనల్ని విడదీసి విశ్లేషించాలి. ఇది రచనను అంతర్విభజన చేస్తోంది.

............ ★ ............


కలిసే వేదిక. రచన పూర్తి అయిన తరువాత భాషను, వ్యక్తీకరణను వినిర్మాణం చేసి మరో భాషను పునర్నిర్మిస్తోంది. పాఠకుడు రచయిత రచనలోని సంకేతాలతో కుస్తీ పడుతారు. పాఠకుడు రచయిత ఎప్పుడూ ఊహించలేని అనేక అర్థాల్ని కనిపెడుతూ ఉంటాడు. అందువల్ల వాచకం ఎప్పుడూ అలిసిపోకుండా పదాలతో ఆడుతూ ఉంటుంది.

3. సంకేతితం (సిగ్నిఫియన్స్) అనేది కీలకమైనది. దీన్ని అర్థాన్ని సూచించేది లేదా వ్యక్తీకరించేది, వాచకంలోకి సబ్జెక్టును తీసుకువచ్చేది, వంటి వాటితో కుదించవద్దు. ఎందుకంటే, ఇది అనంత అర్థాల్ని సూచిస్తుంది. కాబట్టి సంకేతితార్థం కాదు, సంకేతితంగా గుర్తించాలి.
4. ఫెనొ టెక్స్ట్ జినోటెక్స్ట్, వీటిని క్రిస్టీవా స్పష్టపరిచింది. ఫెనో టెక్స్ట్ అనేది ఉచ్చారణకు సంబంధించింది. దీన్ని వివరించడానికి ధ్వని నిర్మాణం, అర్థ నిర్మాణం, నిర్మాణ విశ్లేషణ సరిపోతుంది. అందువల్ల ఇది సంజ్ఞ-అర్థం అనే సంజ్ఞా శాస్త్ర సిద్ధాంత పరిధిలోకి వస్తోంది. జినో టెక్స్ట్ అనేది ఫెనో టెక్స్ట్‌కు భూమిక. ఇది అర్థాల్ని అనేకంగా స్ఫురిస్తుంది. ఇది సిగ్నిఫియన్స్ ఫీల్డు.
5. అంతర్వాచకం (ఇంటర్ టెక్స్ట్). చివరిది అంతర్వాచకం (ఇంటర్ టెక్స్ట్) ను స్థూలంగా చెప్తాను. ప్రతి టెక్స్ట్ పూర్వ రచనల కొనసాగింపు. ఏ రచనైనా అంతర్వాచకమే. పూర్వ లేదా చుట్టూ ఉన్న రచనల వినిర్మాణంతో పునర్నిర్మాణమవుతుంది. అందువల్ల ఏ రచనైనా గత ఉదాహరణల యొక్క కొత్త టిష్యూ అన్నాడు బార్త్స్.

బార్త్స్ రచన కమ్యూనికేషన్, ప్రాతినిధ్యం లేదా అభివ్యక్తి ( ఎక్కడ ఒక వ్యక్తి దేనినో అనుకరిస్తోన్నట్టు లేదా తనకు తానే వ్యక్తం చేస్తోన్నట్టు భ్రమ పడుతోంటాడు) ని వినిర్మాణం చేసి మరో భాషను పునర్నిర్మాణం చేస్తోంది అంటాడు. లాట్మన్ ప్రకారం సాహిత్య రచన అనేది వ్యవస్థల యొక్క వ్యవస్థ, సంబంధాల సంబంధం. ప్రతీ సాహితీ రచన అనేక వ్యవస్థల(నైఘంటిక, వ్యాకరణాత్మక, ధ్వన్యాత్మక తదితర)తో తయారయినది. స్థిరమైన సంఘర్షణ, టెన్షన్ వీటి మధ్య కొనసాగుతూ ఉండటం వల్ల శక్తివంతంగా తయారవుతున్నది. అనుకున్నట్టు జరక్కపోవడం, పద్ధతి, దానికి భిన్నంగా జరగడం, నాటకీయ అపరిచితత్వం ఏర్పడటం అన్నీ కలిసి సాహిత్య రచన అవుతుంది. సాహిత్యం, నిర్మాణవాదం ప్రకారం, భాషానిర్మాణాల మీద ఆధారపడిన సాంస్కృతిక కళా రూపం. ఇది రెండు ముఖ్యమైన పరిణామాలకి దారి తీస్తోంది. మొదటిది, సాహిత్య రచన ఏవిధంగా నిర్మాణమైందో అంటే భాష- దాని వ్యాకరణం మొదలైనవి. ఇది రచన ఎలా అర్థానిస్తోందో పరిశీలించే సంజ్ఞాశాస్త్ర అంశాలకి చోటిస్తోంది. రెండవది, రచనలోని అన్ని అంశాలు భాషా విధానంలో చూడవచ్చు అనడంవల్ల భాష మానవ అర్థ గ్రహణకు చర్యలకు దారి కల్పిస్తోందనడం వల్ల సాహిత్యాన్ని ప్రత్యేక సంస్కృతిలోని మిగతావాటితో గల సంబంధంలో ఒక వ్యవస్థగా పరిశీలించవచ్చు. నిర్మాణవాదం అందుకే కల్చర్ రచయిత అనే సాధనం ద్వారా సాహితీ రచనను రచిస్తోంది అంటోంది. నిర్మాణవాదంలో ద్విదాకృత సంబంధాల విభజన కీలకమైంది. అంటే దీని అర్థం ఉదాహరణల వల్ల అవగతం అవుతుంది. పగలు- రేయి, అతడు- ఆమె, శత్రువు- మిత్రుడు వంటి విభజనని ద్విదాకృత సంబంధాలంటారు. ఇలా రచనలోని పాత్రల్ని సంఘటనల్ని విడదీసి విశ్లేషించాలి. ఇది రచనను అంతర్విభజన చేస్తోంది. వీటి మధ్య విరుద్ధత, వ్యతిరేకత అనే సంబంధం ఉంటుంది. ఇలా వాచకం అందించే లేదా సంకేతించే వాటిని పాఠకుడు ఊహించడం వల్ల అతి వ్యాఖ్యానాలు వచ్చాయి.

నిర్మాణవాదంలో అర్థ స్పష్టత కోసం జరిగిన మీమాంస (హెర్మనాటిక్స్) వ్యాఖ్యానవాదానికి దారి తీసింది. కేవలం కనిపించే వాటి గురించే చర్చించడం, ఉచ్చారణకు అధిక ప్రాధాన్యత ఇవ్వటం వల్ల దెరిడా వినిర్మాణవాదాన్ని ప్రతిపాదించాడు.

❖

# బొందలగడ్డ



ఆ ఊరు రోడ్డు పక్కమ్మటె వుంది. ఊరెమ్మటి ఓ పూడిపోయిన చెరువు. అందువల్ల ఈ మధ్య ఊరు చెరువు వైపు పెరుగుతూ వుంది. దట్టంగా పెరిగిన సర్కారు కంపచెట్ల మధ్య ఇళ్ళ పై కప్పులు మాత్రమే కనిపిస్తూ వున్నాయి. కాస్త పైకి వున్న దేవుని గుడి శిఖరం, దాని రథశాల బాగానే కనిపిస్తున్నాయి. ఊరి చివరి ఇళ్ళ నుండి కింది భాగాన రోడ్డు వైపు పాతిక ఎకరాల ఖాళీ స్థలం వుంది. ఆ స్థలం చెరువు శిఖం. దానిని ఆలయానికి చెందేటట్టుగా ఆ మధ్య ఊరు తీర్మానించింది.

డా॥ బోయ జంగయ్య

అందువల్లా ఆలయాన్ని అంటి పెట్టుకుని వున్న పూజారులు ఆ భూమిలో కాలం అయితే శెనగలు, పెసళ్ళు పండించుకుంటూ వస్తువున్నారు. పశువులు, పక్షులు తినగా మిగిలిన వాటిని పూజారులు పోగు చేసుకుంటు వున్నారు. ఎప్పటి నుండో నెయ్యి, ముద్దపప్పు తింటూ వస్తున్న వాళ్ళకు రాను రాను నెయ్యి కరిగిపోయినా శిఖంవల్ల పప్పు గింజలకు ఫర్వాలేదు.

ప్రభుత్వం దళితులకు ఇతర బలహీన వర్గాలకు ఇల్లు కట్టించడం భూములు కొని ఇవ్వడం చేస్తూ వున్న సంగతి అందరికి తెలిసిందే. ఆ ఊరి దళితులకు కూడా పక్కా ఇళ్ళు కట్టించడానికి ఊరి చుట్టూరవున్న ఖాళీ స్థల సేకరణ చేయవల్సి వుంది. ఒక వైపు రోడ్డే తరువాత దాన్ని దాటడం కష్టమవుతుంది. ఇంకోవైపు వరి పొలాలు, వెనకవైపు పెద్దవాగు, వర్షాకాలంలో ఆ వాగు ఓ సమస్య అయిపోతుంది. ఇక మిగిలింది చెరువు అడుగె ఊరి అంచున వుంది, దానిని ప్రతిపాదించడానికి గ్రామ కార్యదర్శిని కాలు ముందుకు కదపనివ్వటం లేదు. ఆ గ్రామ దళిత యువకుల ప్రయత్నం మీద ఎం.ఆర్.ఓ. వచ్చి చూసి వెళ్ళాడు. ఎం.ఆర్.ఓ. రాక గొర్రెల మందలో కర్ర విసిరినట్టయింది. గ్రామ కార్యదర్శి ఎప్పటికప్పుడు ఊళ్ళో జరిగే సంగతులను ప్రభుత్వానికి చేరవేస్తూనే వున్నాడు.

ఒక రోజు సాయంత్రం గుడిలో గంట 'గణగణ' మోగింది.

వర్షాకాలంలో ఉసిళ్ళు చేరినట్లు దళితులు మినహా ఊరి జనమంతా రామాలయం చేరారు. అందరు భక్తిగా కూర్చోని భజన చేశారు. హారతి పళ్ళెంలోని కర్పూరపు మంటను చేతులతో తాకి కళ్ళకద్దుకోవడం ముగిసినంకా, ఆలయ పూజారి గర్భగుడివైపు దండం పెట్టి, ఎదురుగ కూర్చున్న జనం వైపు మళ్ళీ –

"భక్తులారా ఈ కలికాలంలో కని విని సంఘటనలు తలెత్తుతున్నాయి. మనం జాగరూకతో గమనించి వాటిని ఎదురుకొనవలసి వుంది. రామచంద్రప్రభు రాతిరి నా స్వప్నంలోకొచ్చి, 'ఊరికి అరిష్టం వచ్చింది తనను తన ఆస్తులను కాపాడమని కోరాడు' అందుకె ఈ సభ ఏర్పాటు. ఎవరిమటుకు వారు దేవుని గురించి ఆలోచించవల్సిందిగా కోరుతున్నాను". పూజారి అన్నాడు.

ఒకరి ముఖాలు మరొకరు చూసుకుంటూ కొందరు మధ్యమధ్య చెంపలేసుకుంటూ, అందరు ఆసక్తిగా వింటూ వున్నారు. మరొక వైపు స్త్రీలు బాలబాలికలు గర్భగుడి ముందు నిల్చొని దండం పెట్టుకుని పోతూ వున్నారు.

"విశ్వకర్మలు, విజ్ఞతతో వ్యవహరించవల్సి వుంది. దైవసేవ చేసే చాకలి – మంగలి అందరు తమ వంతు పనులు తాము

ర్వహించవల్సి వుంది". అనగానే సంబంధిత వ్యక్తుల్లో కొత్త శక్తి ఆవరించినట్టు అనిపించగ, మన దేవుణ్ణి మనం కాపాడుకోవాలన్నట్టు చూస్తూ వున్నారు. గౌడ్లు, యాదవులు పూజారి కంటే ముందే పూనకం వచ్చినట్లు ఊగిపోతూ వున్నారు. అది గమనించిన సర్పంచ్, 'అంత పైసల మహిమ' అనుకున్నాడు.

"మీరు భూములను అమ్ముకుంటూ వుంటే వాళ్ళు కొంటున్నారు. బోరులు వేయిస్తున్నారు. రెండు కారులు పండిస్తున్నారు. కొన్నాళ్ళ తరువాత చూడండి ఉరికామందు వాళ్ళల్లో నుండే అవుతారు. ఎవరి దగ్గర పైసలుంటే వారి దగ్గరికే పదవి చేరుతుంది సుమా" అన్నాడు పూజారి సర్పంచ్ ముఖకవళికలను గమనిస్తూ.

పూజారి ఎంతో నిగూఢంగా, మరెంతో లౌకికంగా గీతోపదేశం చేస్తుంటే అక్కడ చేరిన వారి నరాలలో ఏదో మత్తు ఎక్కుతూ వుంది.

"మనలను మన ఊరిని కాపాడుతున్న ఈ గుడిని, గుడి పట్టు భూమిని మనం కాపాడుకోవాలి. గవర్నమెంటు వాళ్ళు ఆ భూమిని స్వాధీనం చేసుకోవాలకుంటూ వున్నారట. దానిని ఊరంతా కలసికట్టుగా ఎదిరించవల్సి వుంది. అందుకు సిద్ధం కావాల్సిందిగ దైవాజ్ఞ" అంటూ ముగించాడు. అరవై ఏళ్ళ అర్ధ నగ్నపు పూజారి భుజం నుండి జారుతున్న ఉత్తరీయాన్ని యథాస్థానంలోకి సర్దుకుంటూ.

"అట్లా జరగడానికి వీలులేదు" అన్నాడు మల్లన్న గౌడు.

"అది జరిగే పనే కాదు" అన్నాడు బీరప్ప యాదవ్.



వాళ్ళిద్దరి వైపు పూజారి అభినందనీయంగా చూస్తూ 'అసలు వ్యక్తులకు పేరుకంటుకుంది చాలు ఇంక లంకాదహనం అవల్సిందే' అని లోలోన అనుకుంటూ వాళ్ళ వైపు ఆశీర్వదించినట్టు చూశాడు.

'అందరు శ్రమించి సంపాదిస్తే వీళ్ళు ళ్ళతో సంపాదిస్తున్నారు. ఏదైనా జరగకూడనిది జరిగితే ఎదురు తిరిగి శక్తే వీళ్ళకే వుంది మరి'. ని అనుకుంటూ కుడి చేతివేలితో కింది పెదిమను రాసుకున్నాడు.

'ఊరి మీది ఉట్టి పుణ్యానికి సంపాదించేది ఎంతైనా ఖర్చు ట్టగలరు. వూఁ కానీయండి, దైవం మీ వైపే వుంటుంది'. అంటూ య్యెత్తి ఆశీర్వదించాడు పూజారి. రొమ్ము విరుచుకుంటూ అక్కడి నుండి దిలారు బీరప్ప యాదవ్, మల్లన్న గౌడు. వాళ్ళను చూసి మిగతావాళ్ళు ూడా తమ నడకలో కొంత మార్పు తెచ్చుకున్నారు. "మన దేవుణ్ణి మనం కాపాడుకోకపోతే ఎట్టా" అనుకున్నారు తమలో తాము.

✦✦✦

కందిరీగ తెట్టెను కదిలించినట్టయింది. ఆ రోజు నుండి ళితవాడవైపు కన్నెర్ర చేసి చూస్తూ వున్నారు ఇతర కులాల వాళ్ళు. ళితులంతా ఆఫీసులు తిరుగుతూనే వున్నారు. 'తమకు ఇండ్ల స్థలం ప్పించమని' అర్జీలు పెడుతూనే వున్నారు. ఎం.ఆర్.ఓ. చెరువు పక్క ూమి తప్ప దగ్గరలో మరో ఖాళీ భూమి లేదని నివేదిక పంపాడు. గతా రెవెన్యూ ఉన్నతాధికారులంతా వచ్చి 'అవును' అంటూ వెళుతూ న్నారు. 'ఆ భూమిని సేకరించక తప్పదు' అని కూడా అనిపోతున్నారు.

మాకు ఇళ్ళ స్థలాలు తప్పక కావాలని దళితులు కోరుతూ, కప్పుడు గుడిసెకిద్దరం, మొగుడు పెళ్ళాం ఉండేటోళ్ళం. ఇప్పుడు ల్లా పాపలతో కొడుకు కోడండ్లతో ఇంటికి పది మందిమై, పందులకు మాకు తేడా లేకుండా వుంటున్నాం, అందుకే మాకు ఇళ్ళు కావాలి. కనుక తమరు ఓ నిర్ణయం తీసుకోండి. ఇళ్ళ భూమిని పంచండి అని జిల్లా కలెక్టర్‌ను కోరారు.

ఆ భూమిని 'ఇవ్వడానికి వీలులేదని' ఊరి జనం, అది తప్ప వేరే భూమి లేదని దళితులు ఎవరి వాదన వారు చేస్తూనే వున్నారు.

ఈసారి వినాయక చవితి పండుగకు పెద్ద విగ్రహాన్ని ట్రాక్టర్లో తెచ్చి నడి ఊళ్ళో ప్రతిష్టించారు. రోజూ అర్ధరాత్రి వరకు భక్తి పాటలతో ఊరంతా అదరకొడుతూ వున్నారు. మిగతా కులాలందరు భక్తితో భజనలు చేస్తూనే వున్నారు. వారం రోజులు దళితులు మాత్రం ఆ దరిదాపుల్లోకి రాలేదు. గ్రామ పెద్దలు ఏదో ఓ కారణంగా దళితులను బెదిరిస్తే తమ ప్రయత్నాలను మానుకుంటారన్న ఉద్దేశంతో ఎదురు చూస్తూ వున్నారు.

వాళ్ళు పసిరిక పాముల్లాంటి వాళ్ళు. తమ వాడల్లో తాము మామూలుగా వుంటూ వస్తున్నారు. వాళ్ళకు తెలుసు ఊరొక్కటైతే తాము నిలవలేమని; నిలవాలంటే ఘర్షణకు దిగాలని, ఘర్షణకు దిగితే చాకిరి కులాలు, బహుజనులు నినాదాల వరకే కాని తమవైపు నిలవరని, పోగా వాళ్ళే తమపై ముందుగ దాడి చేస్తారని, ఘర్షణ ఎవరికీ క్షేమం కాదనుకుంటూ వస్తూ వున్నారు.

ప్రభుత్వం ఊరి ప్రక్కమ్మటి భూమిని స్వాధీనం చేసుకుని దళితులకు పంచాలని నిర్ణయించింది. ఆ మేరకు ఓ పత్రికలో ఓ ప్రకటన కూడా వచ్చింది. ఆ వార్త చూసిన ఊరి అగ్రవర్ణం వాళ్ళు చిర్రెత్తి పోతున్నారు. శూద్ర కులాల వాళ్ళను దళితులపై ఉసిగొలిపి తగాదాలు పెడుతూ వున్నారు. చేను దగ్గర, గెట్టు దగ్గర 'అమీ-తుమీ' అనుకుంటూనే వున్నారు. మీకే కావాలనా ఇళ్ళు అని మంగలి అంటున్నాడు. వున్న ఇళ్ళు చాలవా అని చాకలి అంటున్నాడు.

మరునాడు వినాయకుని నిమజ్జనం. తమకు ఇళ్ళ భూమిని ఇవ్వనివ్వటంలేదని తెలుసుకున్న దళితులు, నిమజ్జనం ఊరేగింపుకు డప్పులు కొట్టడానికి రాలేదు. అది గ్రహించిన గ్రామ పెద్దలు పక్క ఊరి నుండి సన్నాయి మేళాన్ని తెప్పించుకొని ఊరేగింపు మొదలు పెట్టారు. మొదట సజావుగానే సాగింది. తలలకు కాషాయపు రంగు గుడ్డలు కట్టుకొని యువకులు ఊగిపోతూ గంతులేస్తూ వున్నారు. మెల్లగా సాగుతుంది ఊరేగింపు. ఊరి చివరి దళితవాడకు వచ్చేసరికి కలకలం మొదలైంది.

"డప్పు ఎందుకు కొడతలేరని" నిలదీస్తే.

"అది మా యిష్టం" అన్నారు అంతే స్థాయిలో దళితులు.

"ఊరన్నప్పుడు ఎవరు చేసే పనులు వాళ్ళు చేయాలికద" అన్నాడు సర్పంచ్. దళితులు ఎన్నికలప్పుడు ఏడు చెర్ల నీళ్ళు తాగించింది గుర్తుకొచ్చింది సర్పంచ్‌కు.

"మరి ఊరన్నాక అందర్కి ఇళ్ళు ఉండాలికదా" అని అడిగారు దళితులు.

"సరే వాటి కోసం అందరం ప్రయత్నం చేస్తాం గదా" అన్నాడు పై మాటకు సర్పంచ్.

ఇరు పక్షాలలో ద్వేషం రగలుకుంది. అంతే మనుషులు గొర్రె, పొట్టేళ్ళైనారు. రక్తం చిందింది. పోలీసులు వచ్చి దళితులను తరిమి తరిమి కొట్టారు. యాదవ్‌కు నచ్చ చెప్పారు. గౌడ్‌ను కాకాపట్టి మొత్తం మీద వినాయకుడున్న ట్రాక్టరును రోడ్డెక్కించారు. అది రాచకాలువ వైపు

మళ్ళింది. బాగా తాగి వున్న ఓ యువకుడు పట్టు తప్పి జారికింద పడగా పక్కటెముకలు విరిగి కుప్పకూలిపోయాడు. ఆ తరువాత అతన్ని అదే ట్రాక్టర్లో దవాఖానాకు తీసుకెళ్ళారు. మైకం మనిషిని నిర్వీర్యం చేస్తుంది.



'ఆ రాత్రి గుడిలో రామాయణగాథ పఠనం జరుగుతూ వుంది. రాముడు చాటుగా వాలిని వధించాడు. ఆ తరువాత హనుమాన్‌ను రామునికి తోడుగా పంపాడు సుగ్రీవుడు. హనుమాన్ లంక చేరుతాడు. లంకేయులు తోకకు నిప్పంటిస్తారు. మండే తోకతో లంకంతా గంతులు వేస్తాడు. లంకకు నిప్పంటుకుంటుంది'. సరిగ్గా అదే సమయాన దళితవాడలో మంటలు లేచాయి. నిద్రలో వున్న జనం తేరుకుని కుండలందుకుని చల్లార్చుకున్నారు. "ఎవరు పెట్టారు ఈ నిప్పు?" అని రాత్రంతా ఆలోచిస్తూ కూర్చున్నారు. ఆ రాత్రి ఆ వాడకు నిద్రలేదు.

గ్రామ కార్యదర్శి రిపోర్టును అందుకుని

"ఎట్లా తగులబడ్డాయి" పోలీసులు ఆరా.

"రాత్రి అందరం రామాయణం వింటూ గుళ్ళోనే వున్నాం". అన్నారు ఊరివాళ్ళు.

సరిగ్గా లంకాదహనం జరిగేటప్పుడే అక్కడ మంటలు లేచాయట!

"అవునట" అన్నారు గ్రామస్తులు.

"లంకలో హనుమంతుడు నిప్పుపెట్టాడు. మరి ఇక్కడా?" అడిగారు పోలీసులు.

"ఇక్కడ ఆయనే పెట్టి వుండవచ్చు" అన్నాడు పూజారి.

"ఏం మాట్లాడుతున్నావయ్యా" పోలీసు దబాయించాడు.

"ఎక్కడ పాపం పెరిగితే అక్కడ" అంటూ ఆగిపోయాడు.



ఇంతలోనే "నాకు తెలుసు" అన్నాడో వ్యక్తి, తన పేరు దాసని, నిజంగా మద్యానికి దాసుడైనాడు. అతను తాగిన మైకంలో వున్నాడు. ముఖం ఉడికిన వంకాయ లాగుంది. కాళ్ళు భూమ్మీద నిలవడం లేదు. కనురెప్పలను అతి కష్టంగా కదిలిస్తున్నాడు.

"చెప్పు చూస్తే చెప్పు" గద్దించాడు హెడ్ కానిస్టేబుల్ ఓ చేతిలోని లాఠీని మరోచేతిలోకి తీసుకుంటూ.

"చెప్పుత చెప్పుత" అంటూ ఓసారి చుట్టూ చూసి, ముందుకు తూలి నేలను చూస్తూ మునివేళ్ళతో భూమిని తొక్కిపడుతూ.

"దానికోసమే" అంటూ చేతులు జోడించాడు. అప్పుడతని మూతి మూడు వంకర్లు పోతూ వుంది.

"దేనికోసం" అంటూ తీక్షణంగా చూశాడు హెడ్.

చుట్టూ వున్నవాళ్ళంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. ఏం చెబుతాడో, ఎవరి మీద చెబుతాడో పిచ్చివాని చేతిలో రాయి తాగిన వాని నోటిలోని మాట ఎవరి మీద పడుతుందో వూహించడం కష్టం అనుకుంటూ.

హెడ్‌కు వచ్చే కోపాన్ని ఆపుకుంటూ "చెప్పర బాబు చెప్పు" కాస్త బతిమిలాడినట్టు అన్నాడు.

"చెబుతనన్నవ్ చెప్పు లేకపోతే బొక్కలోకి పోతావ్" అన్నాడు పక్కన్నే నిల్చున్న పోలీసు.

ఒక్కసారె తల ఇటు అటు తిప్పి "అదె సారకొసం" అన్నాడు.

"అక్కడ సారా?" అని హెడ్ ఆశ్చర్యంగా చూశాడు.

"తెలియదా. అక్కడ సార అమ్ముతరు. నేను రాతిరి నుండి అక్కడే తాగుతు వున్న" అన్నాడు దాసు.

"ఎవరు కాచిన సారా" అన్నాడు హెడ్ ఈసారి ప్రాధేయపడ్డట్టు.

"అదెసార్ మీకు తెలియంది నాకు తెల్సింది. వాళ్ళు దొంగసార కాస్తున్నరు సార్" పడబోయి నిలతొక్కుకుంటూ అన్నాడు దాసు. చుట్టు వున్న వాళ్ళు అప్పటి వరకు బిగబట్టిన ఊపిరిని ఒక్కసారే వదిలారు.

"చూపిద్దువు పద" అంటు అతన్ని లాఠీతో నెట్టాడు. అతను కదిలి హెడ్ వైపు బిత్తరగా చూశాడు. "ఏం బుర్రర నీది పోలీసును మించిన బుర్ర. ఎవ్వరినీకీ ఐడియా ఇచ్చింది". అని అడిగాడు నవ్వుతూ.

"ముందు ఈ ఫిర్యాదు రాసుకోండి" అంటూ ఆగాడు.

"అతను చెబుతున్నాడుగా రాసుకోండి" అని జనం అనగానే పోలీసులు అన్న వాళ్ళ వైపు చూశారు.

"తాగిన వాడు ఎప్పుడు తప్పు చెప్పడు సార్" అన్నాడు ఇంకో వ్యక్తి.

"అట్లనా సరె" అంటూ ఓ ఇంటి అరుగు మీద కూర్చొని రాసుకోసాగాడు హెడ్.

దళితవాడలో దొంగసార కాస్తున్నప్పుడు అదుపు తప్పిన మంటలు గుడిసెను అంటుకున్నట్టు, అట్లాగే ఆ పక్క ఇళ్ళకు అంటుకున్నట్టు సార కాయదానికి వాడే కుండలు, గురుగులు మైసమ్మ గుడి దగ్గర దొరికినట్టు పోలీసులు కేసు రాసుకున్నారు. అంతేకాదు అనుమానం వచ్చిన వాళ్ళను పట్టుకెళ్ళారు. 'సార తాగేది వాస్తవమే కాని సార కాచేది తాము కాదన్న విషయం ఆ దేవునికి మాత్రం తెలియదా అంటూ గుడివైపు అమాయకంగా చూశారు. గుడిలోని దేవుడు నమ్మాడో లేదో తెలియదు కాని పోలీసులు నమ్మడానికి సాక్ష్యం వుందికదా!

దాసు చెప్పనైతే చెప్పాడు కాని ఆ తరువాత కడుపులో గుబులు మొదలయింది. దాసు పటేలు ఇంటికి వెళ్ళి "పటేలా నేను నిజమే చెప్పిన గద" అన్నాడు రెండు చేతులు జోడించి.

గుడి దగ్గర పూజారికి ఎదురుపోయి "నేను నిజమే చెప్పినగద అయ్యగారు" అన్నాడు తూలుతూ చెంపలేసుకుంటూ.

బీరప్ప యాదవ్ బావి దగ్గరికి పోయి నేను ఉన్నది ఉన్నట్లు చెప్పితిగ" అన్నాడు తూలుతూనే

మల్లన్న గౌడ్ వాకిట్లో నిల్చొని లోపలికి తొంగి చూస్తూ సార కాసేది నీవె కదా. అగో ఆ పాడుబడ్డ ఇంట్లనె కదా నీవు బట్టీల పెట్టేది వాళ్ళు కాస్తున్నారని అబద్దాలు చెప్పిస్తివి" అన్నాడు. నీవు యాదికి చెప్పినట్టే నేను చెప్పితి" అన్నాడు మళ్ళి తానే.

"అవన్నీ నీకెందుకుర నీకు పావు కావాలంతేగ" అంటు లోపలికి చూస్తూ ఏదో సైగ చేశాడు. ఓ వ్యక్తి గ్లాసులో సార తెచ్చి దాసుకిచ్చాడు. దాసు ఒక్క గుటుకలో దానిని మింగేసి ముఖాన్ని చిట్లిస్తు మూతిని తుడ్చుకున్నాడు.

"అయితె నేను ఆయల్ల పోలీసులతో నిజమే చెప్పిన" అనగానే నిజమే చెప్పినవో అబద్దమే చెప్పినవో ఆయె-పాయె ఆ సంగతుల

ఇప్పుడెందుకు? నివు ఇట్లనె వర్లుతు వుంటె అసలు సంగతి ఆల్లకు తెలిసేనా నీ పని అయితది. నోరు మూస్కోని ఫో" అని గద్దించాడు గౌడ్.

"ఛీ నోరంతా కంపువాసన. నా కొడుకు కల్తీ చేసినట్టుంది" అనుకుంటూ దాసు నోరు మూసుకుని అక్కడి నుండి కదిలాడు.

చాలా రోజుల వరకు దళితులు పోలీసు స్టేషన్ చుట్టూ తిరిగారు. కోళ్ళను మేకలను అమ్ముకోక తప్పలేదు. వట్టిగ వచ్చిన జబ్బు, డబ్బు ఖర్చు పెట్టించిపోయినట్టు తప్పుడు కేసైనా ఖర్చులు తప్పలేదు. కేసుకు పోతే కూలిపోయి అప్పులాయె అంటు అంగలార్చారు. 'పేదోల్లకో దేవుడు పెద్దోల్లకోదేవుడా?' అనుకుంటూ తమకు కలిగిన బాధను దిగమింగారు.



ఊళ్లో ఈ ఇళ్ళ స్థలాల సమస్య పెద్ద చిచ్చేలేపింది. దళితులను చూసి మిగతా కులాల వాళ్ళు, మిగతా కులాల వాళ్ళను చూసి దళితులు ముఖాలు తిప్పుకోవడం, కోపతాపాలు ప్రదర్శించుకోవడం జరుగుతూ వుంది. ప్రభుత్వ అధికారులు ఆ భూమిని ఎలాగైనా ఇళ్ళ స్థలాల కింద తీసుకోవాలన్న నిర్ణయం జరిగింది. అది ఊరివాళ్ళకు మింగుడు పడడంలేదు. ఎత్తుకు పై ఎత్తు ఆలోచిస్తున్నారు.

ఆ రోజు రాత్రి గుడిలో రామాయణం కథ ముగిసింది అని ప్రకటించారు. భక్తులలో నుండి ఒకరు లేచి "దేవుడైన రాముడు మామూలు మనిషి అయిన శంభూకుని శిరస్సు ఖండించకూడదు కదా?" అని అడిగాడు.



"అది అంతే. వాడు గత జన్మలో చేసుకున్న కర్మవల్లా" అన్నాడు కథ చెప్పే కథకుడు.

ఊరి చావట్లో గొడవ మొదలైంది. చావడి దగ్గరి నుండి వెళుతున్న ఓ దళిత యువకున్ని ఆపి కొట్టారట. అతను తమ వాడకు వెళ్ళి అందర్కి తన తలకు అయిన గాయాన్ని, కారుతున్న రక్తాన్ని చూపించాడు. అది చూసిన జనం కత్తులు, 'గొడ్డండ్లు' కర్రలందుకుని చావడికి చేరుకున్నారు. ఇరు పక్షాలు ఒకరికొకరు ఎదురై 'అమి తుమి' అనుకున్నారట శర్మగారు" అంటూ గుడిలోకి వస్తూ అన్నాడు సర్పంచ్.

"మన యాదవ్‌కు ఇశార చేస్తే చాలు" అన్నాడు మళ్ళీ తానె.

"మన వాళ్ళెవరు జైల్ పాలుకాకుంట కార్యక్రమం నడపాలి". అన్నాడు శర్మ.

"అంటె"

"చూస్తారు కద" అన్నాడు శర్మ. కాని పరిస్థితి ఎవరి చేతుల్లో లేకుండా మారిపోయింది.

జనం ఉరుకు-పరుగులకు వీధుల్లోని కుక్కలు భయం భయంగా అరుస్తూ సందుల్లోకి పరుగెత్తుతున్నాయి.

పరిస్థితిని గమనించిన కొందరు ఇళ్ళల్లో జొరబడి తలుపులు బిగించుకున్నారు. ఇంట్లో జొరపడడానికి పరుగెత్తుతున్న ఓ వ్యక్తిమీద గొడ్డలి వేటు పడింది. అతను మొదలు నరికిన చెట్టులాగ నేలకొరిగాడు. అది చూసిన జనం పరుగేపరుగు. ఒక మనిషి నేలకొరిగినట్టు గుడి దగ్గరికి వార్త చేరింది. భజన బందుచేసి సందుల్లో నుండి గొందుల్లో నుండి అందరు తమ తమ ఇళ్ళకు చేరుతూ ఉన్నారు. చావట్లో పడి ఉన్నది ఎవరైంది చూసే దిక్కులేదు. ఎవరి భయం వారిది. తెలిసిన వాళ్ళు ఎదురైనా తెరిపార చూస్తూ తప్పుకొని వెళుతూ వున్నారు.

రామాయణంలో శంభూకుణ్ణి రాముడు చంపిన విషయ ప్రస్తావన చెబుతున్నప్పుడే వూళ్ళో మరో తల తెగిపడిందే! ఎవరు చంపినట్టు?

"చచ్చిపడి ఉన్నది శూద్రుడే!"

దళితులు చంపారా?

"కాదు"

మరీ

"వాని గత జన్మకర్మ ఫలం"

"చంపిందెవరు"

"వాళ్ళే చంపుకున్నారు. వాళ్ళే చంపి ఆ కేసు దళితుల మీద మోపి, వాళ్ళను నానా బాధలు పెడదామని, వాళ్ళ వ్యక్తిని వాళ్ళె చంపుకున్నారని ఎందుకు అనుకోకూడదు" అన్నాడు గ్రామ కార్యదర్శి. గ్రామ రాజకీయాలు ఎట్లా వుంటాయో? ఎవర్ని ఎవరు ఎట్లా ఇరికిస్తారో ఆయనకు బాగా తెలుసు! కాదు వాళ్ళకు వ్యతిరేక సాక్ష్యం చెప్పాడు వాళ్ళే చంపొచ్చు" అన్నాడు గ్రామ పెద్ద. "మొత్తం మీద ఎవరో ఒకరు చంపారు. ఈ ఊళ్ళో హత్య జరిగిందని ముందు పోలీసులకు తెలియపరచాలి" అంటూ కదిలాడు గ్రామ కార్యదర్శి.

మొన్న రామాయణం కథ గుడిలో చెప్పిన్నాడు లంకాదహనం జరిగిన ఘట్టమప్పుడు దళితవాడ తగలబడ్డది. రాత్రి శంభూకుని తల నర్కిన సంఘటన వివరణపుడు చావట్లో ఓ మనిషి తలతెగింది. ఏంటబ్బా అంటూ ఆలోచిస్తూ గ్రామ కార్యదర్శి అదే విషయాన్ని పోలీసులకు తెలియపరిచాడు.

తెల్లవారంగా పోలీసు జీపు రానేవచ్చింది. వెంట కుక్కను తెచ్చారు. చావట్లో చచ్చిపడి వున్నది మొన్న సాక్ష్యమిచ్చిన దాసు. ఊరంతా ఉడికిపోతున్నది. పరిస్థితిని గమనించిన పోలీసులు 144 సెక్షన్ విధించారు. మనుషుల కదలికల మీద నిఘా వుంచారు. కుక్క దాని పని అది చేస్తూనే వుంది.

"మొన్న వాళ్ళకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పినందుకు ఈ పని వాళ్ళే చేశారు" అని గ్రామ పెద్దలు చెప్పారు.

"మేమెవరిని చంపలేదని" దళితులన్నారు.

కుక్క దళితవాడ వైపు పోనేలేదు. అది చావడి నుండి చక్కగ గుడివైపు నడిచింది. వెంట పోలీసులు, ఆ వెనకా జనం ఆసక్తి కనపరుస్తూ నడుస్తూ వున్నారు.

కుక్క గుడి ఆవరణలోకి వెళ్ళింది.

"ఆ నరికి చంపిన ఆయుధాన్ని గుడిలోకి విసిరేసి, ఆ కేసు గుడివాళ్ళవైపు పడాలని ఇట్లా చేసి వుంటారు" అని పూజారి పోలీసు ఆఫీసర్‌తో అన్నాడు. అది విన్న పోలీసు ఆఫీసర్ నుదురు చిట్లిస్తూ చూసాడు.

గ్రామ పెద్దలు "అంతేకదా, వుండొచ్చు లేకపోతే మా మనిషిని మేమే చంపుకుంటామా!?" అన్నారు.

కుక్క ఆవరణ దాటి, ధ్వజస్తంభాన్ని దాటి గర్భగుడిలోకి వెళుతుంది.

పూజారి నోట్లో తడి ఆరిపోయింది.

గ్రామ పెద్దలలో వణుకు పుట్టింది.

పోలీసు ఆఫీసర్ వెనక్కు మళ్ళి "గుడి గేటును మూసేయండి.

# దయ్యం

తమిళకవిత : వైరముత్తు

తెలుగు : ఎ.జి. యతిరాజులు

ఒక దెయ్యం వస్తోంది
ప్రపంచ దయ్యం
కోటూ-సూటూ ధరించిన
నాగరిక దయ్యం

అట్లాంటిక్ సముద్రంలో ఓ కాలుపెట్టి
పసిఫిక్ సాగరంలో మరో కాలుపెట్టి
బంగాళాఖాతంలో నోరు పుక్కిలించి
ఖండాలను మింగవచ్చే పశ్చిమ దయ్యం

వికసించని దేశాలు తినివేసి
వికసిస్తున్న దేశాలలో చేతులు తుడుచుకొని
పేద దేశాలను తాంబూలంగా నమిలే
వాణిజ్య దయ్యం




డాలర్ భగవానుడనీ
ప్రపంచ బ్యాంకు మందిరమనీ
కుల వ్యవస్థను పెంచే దయ్యం

ఆ దయ్యం ఆహారం...
దివాలా తీసిన దేశాలు

నీరు...
చావబోయేవాడి రక్తం

తినుబండారాలుగా
భాషలను సైతం ఆరగిస్తుంది

తోక పెరిగిన దయ్యం
ఊరుకుంటుందా?

నిద్రపోక పని చేస్తుంది
చిన్న పరిశ్రమలను పొట్టన పెట్టుకుంటుంది

ఎత్తయిన భవనాలు
మరింత ఆకాశాన్ని తాకేట్టు చేస్తుంది

గుడిసెలను కాలరాచి
గోతిలో పూడ్చిపెడుతుంది.

ఆహార పంటలు లాభసాటి కాదట
వాణిజ్య పంటలతో ఆకలిని పెంచునట

రైతు ఆకలిగొంటే
ఎలుకలు తినటానికిస్తుందట

ఉమ్మడి కుటుంబాలు ధ్వంసం చేస్తుంది
చోరీలనూ, భిక్షుక వృత్తినీ జాతీయం చేస్తుంది

ఉపాధి కోల్పోయిన పల్లె జనాన్ని
ఒక్కసారే ఊడ్చివేసి
పట్టణాల కుప్పతొట్టెలలోకి
చెత్తలాగ పారవేస్తుంది

తగ్గింపు ధరలకే
అమ్మాయిలను అమ్ముతుందట

ఆత్మహత్యలు చేసుకున్న వారి శవాలు
దాని పసందైన ఆహారమట

"ఆగు... ఆగు... పెనుదయ్యమా
ఊరును నాశనం చేయవచ్చిన
నీ ఊరేదో చెప్పి వెళ్ళు"మని నిలదీశా

నోటి కొసన దేశాలు కారుతుండగా
"వసుధైక కుటుంబకం" అంది
"పేరేమిటో చెప్పు!" అన్నా
"ప్రపంచకరణీయుడు" అంది గట్టిగా

---

ఎవరూ బయటికి వెళ్ళొద్దు" అన్నాడు.

పూజారికి మాత్రం మనస్సులో భస్మాసురుడు మెదలగా ఓసారి ఎదను అదుముకుని వదిలాడు. కళ్ళు మూసి రామున్ని తలచుకుని చెంపలేసుకున్నాడు. వెంటనే పోలీసులు గేటు మూసేసి, కాపలా వున్నారు.

కుక్క గర్భగుడిలోకి వెళ్ళింది.

అందరు అవాక్కై చూస్తూ వున్నారు.

సీతారాముల విగ్రహాల వెనక వున్న ఎండిన రక్తపు మరకలతో వుత్తరీయంలో చుట్టి వున్న గండ్ర గొడ్డలిని నోటితో పట్టుకొచ్చి పోలీసు ఆఫీసర్ ముందుంచుంది. జనంలోని ఎవరో ఒకరు గుడిగంట కొట్టారు. జనం పూజారి వైపు చూస్తూ వున్నారు. జనంలో నుండి ఎవరో "అంత కర్మఫలం" అన్నారు. అందరు అతనివైపు ఎవరా అని చూశారు. అతను ఎవరో కాదు రాత్రి 'రాముడు శంభూకుని ఎందుకు చంపినట్టు?" అని ప్రశ్నించిన వ్యక్తే!

"రామచంద్ర ప్రభో ఇంతటి పాపం నేను చేయగలనా" అని అరిచాడు పూజారి. జనం ఒక్కసారే అటు చూశారు.

కుక్క బయటికి నడిచింది. జనం దాని వెనకాలె నడుస్తూ వున్నారు. అది నడి వీధిలో నుండి పరుగెత్తి ఓ ఇంటి ముందాగింది.

"ఆ ఇల్లు ఎవరిది" అని అడిగాడు పోలీస్ ఆఫీసర్.

"మల్లన్న యాదవ్‌ది" అన్నాడు గ్రామ కార్యదర్శి.

"పిలవండి" అన్నాడు పోలీసు ఆఫీసర్.

"లేదు బాయికాడికి బోయిండు" అంది ఆయన భార్య.

పోలీసు కుక్క మల్లన్న యాదవ్ బావి వైపు నడిచింది. దాని వెనకాల పోలీసులు, వాళ్ళ వెనకాల గుంపులు గుంపులుగా జనం.



పోస్టుమార్టం తరువాత శవాన్ని తిరిగి ఊరికి తీసుకొచ్చారు. రాత్రి పొద్దుపోయినంకా బొందపెట్టారు.

ఆ భూమి ఇప్పుడు బొందలగడ్డ!

❖

# విప్లవ కవిత్వంలో ప్రతీకాత్మక వ్యంగ్యం

**సంఘటనల్ని కవిత్వీకరిస్తూ పతితల హృదయాల్లో చైతన్యాగ్నిని రగిల్చే సందర్భాల్లోనూ, సమకాలీన సామాజిక సమస్యల్ని ఎత్తిచూపే సందర్భాల్లోనూ విప్లవకవులు ప్రతీక వాదాన్ని అనుసరిస్తూ ఎరుపు, నిప్పురవ్వలు, సూర్యుడు, అడవి, సముద్రం, తుఫాను, నక్కలు, రక్తసింధువులు, చెకుముకి రాళ్ళు లాంటి ప్రతీకల్ని తమ కవిత్వీకరణకి వాహికలుగా తీసుకొని వాటిలో వ్యంగ్యాన్ని ప్రవేశపెట్టి శక్తివంతమైన కవిత్వాన్ని వెలువరించారు. తెలుగులో ఆనాటి నుంచి ఈనాటి వరకు విప్లవ కవిత్వంలో నిర్మాణ పద్ధతిలో మార్పులు చోటు చేసుకుంటున్నా ప్రతీకాత్మక వ్యంగ్యం ఎన్నో సందర్భాల్లో దోబూచులాడుతూనే వుంది.**

**డా॥ కొత్వాలు అమరేంద్ర**

**1967** ప్రాంతంలో బయలు దేరిన విప్లవ కవులు వారు పాటను ప్రధాన ఆయుధంగా ఎంచుకొని తమ కవితా ప్రస్థానాన్ని సాగించారు. అప్పటి వరకూ అభ్యుదయ కవులుగా చెలామణి అవుతున్న వారితోపాటు అనేక మంది కవులు ఈ ఉద్యమంలో పాలు పంచుకున్నారు.

దోపిడీ వ్యవస్థను కూకటి వేళ్ళతో సహా పెకలించడం, సామ్రాజ్యవాదం మీద తిరగబడడం, తమ భావాల్ని అట్టడుగు ప్రజానీకానికి చేరడానికి విభిన్న జానపద కళారూపాల ద్వారా మాండలిక భాషా ప్రయోగంతో కవిత్వాన్ని అందించడం, శ్రామిక వర్గంలో చైతన్యాన్ని ఆవిష్కరించడం విప్లవ కవులు ప్రధాన ధ్యేయాలుగా పెట్టుకున్నారు. ముఖ్యంగా ఆనాటి శ్రీకాకుళ పోరాటం వారికి కవితా వస్తువైంది. ఆ పోరాటంలోని అనేక సంఘటనల్ని కవిత్వీకరిస్తూ పతితల హృదయాల్లో చైతన్యాగ్నిని రగిల్చే సందర్భాల్లోనూ, సమకాలీన సామాజిక సమస్యల్ని ఎత్తిచూపే సందర్భాల్లోనూ విప్లవకవులు ప్రతీక వాదాన్ని అనుసరిస్తూ ఎరుపు, నిప్పురవ్వలు, సూర్యుడు, అడవి, సముద్రం, తుఫాను, నక్కలు, రక్తసింధువులు, చెకుముకి రాళ్ళు లాంటి ప్రతీకల్ని తమ కవిత్వీకరణకి వాహికలుగా తీసుకొని వాటిలో వ్యంగ్యాన్ని ప్రవేశపెట్టి శక్తివంతమైన కవిత్వాన్ని వెలువరించారు. తెలుగులో ఆనాటి నుంచి ఈనాటి వరకు విప్లవ కవిత్వంలో నిర్మాణ పద్ధతిలో మార్పులు చోటు చేసుకుంటున్నా ప్రతీకాత్మక వ్యంగ్యం ఎన్నో సందర్భాల్లో దోబూచులాడుతూనే వుంది. విప్లవ కవులు వివిధ సందర్భాల్లో ప్రతీకల ద్వారా వ్యంగ్యాన్ని తమ కవిత్వంలో ఎలా ఆవిష్కరించారో పరిశీలించడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

అసలు విప్లవ కవిత్వం ఉద్దేశమేమిటో కూడా తొలిసారిగా విప్లవాన్ని ఆహ్వానించిన కవులు తాము వెలువరించిన విప్లవ కవిత్వంలో వ్యంగ్యాత్మకంగానే వివరించడం జరిగింది. విప్లవ కవిత్వం ఆవిర్భావానికి సంకేతంగా 1970 జులైలో పేర్లు వెల్లడించని కొంత మంది కవులు సామూహికంగా వెలువరించిన 'మార్చ్' అనే కవితా సంకలనంలోని 'ఇప్పుడు వీస్తున్న గాలి' అనే ఆ వ్యంగ్యాత్మక కవితా ఖండిక ఇలా సాగుతుంది.

'ఇప్పుడు వీస్తున్న గాలి
మల్లెలనూ, మొగిలిరేకులనూ
ఆడపిల్లలనూ ఆలింగనం చేసుకొని
పరిమళాన్ని వెదజల్లే పిల్లగాలి కాదు
..... ..... .....
ఇప్పుడు వీస్తున్న గాలి
మందమారుతం కాదు
ఝంఝూ మారుతం
ఈగాలి
మిణుగురు పురుగులతో కాదు
నిప్పురవ్వలతో నేస్తం చేస్తుంది
నిన్న నక్సల్బరీలో వీచిన గాలి
నేడు శ్రీకాకుళంలో వీస్తున్న గాలి
రేపు దేశమంతటా వీచనున్నగాలి'

పై ఖండికలో కవులు వాడిన ప్రతీకలు వాచ్యంలో కొన్ని ప్రకృతి దృశ్యాలను వివరిస్తూనే తెలుగులో చోటు చేసుకున్న కవితా ధోరణుల్ని వ్యంజింపచేస్తున్నాయి. ఇప్పుడు వీచేగాలి మల్లెలనూ, మొగిలిరేకులనూ, ఆడపిల్లలను అలవోకగా స్పృశించే మందమారుతం కాదని. అది, ఉధృతంగా వీచే ఝంజా మారుతమని,అది నిప్పురవ్వలతోనే స్నేహం కడుతుందని వాచ్యంగా చెబుతూనే ఇప్పుడు వస్తున్న కవిత్వం నుతిమెత్తని భావకవిత్వం కాదని, చైతన్యాన్ని రగిలించే విప్లవ కవిత్వమని వ్యంగ్యంగా చెప్పడం జరిగింది. అంటే 'గాలి' ఒక కవితా ధోరణికి ప్రతీక. ఇక్కడ చేసిన 'మిణుగురు పురుగులు' అనేపద ప్రయోగం వేదుల 'దీపావళి' ఖండికను తలపిస్తే 'నిప్పురవ్వలు' శ్రీశ్రీ కవిత్వాన్ని తలపిస్తుంది.

విప్లవకవులకు ఎంతో స్ఫూర్తి నిచ్చిన శ్రీకాకుళం పోరాటం నేపథ్యంలో వచ్చిన కవిత్వాన్ని పరిశీలిస్తే ఆ కవిత్వంలో కూడా అక్కడక్కడా ప్రతీకాత్మక వ్యంగ్యం కనిపిస్తుంది. వంగపండు ప్రసాదరావు శ్రీకాకుళం పోరాట స్ఫూర్తితో 1970-80 మధ్య అనేక గేయాల్ని రచించారు. అటవీ నేపథ్యంలో రచించిన ఆ గేయాల్లో పలు సందర్భాల్లో కవి అడవికి సంబంధించిన ప్రతీకల్ని ప్రవేశపెట్టి వాటి ద్వారా వ్యంగ్యాన్ని ఆవిష్కరించారు. అలాంటి వాటిలో 'ప్రయాణం' అనే గేయం ఇలా సాగుతుంది.

'శ్రీకాకుళంలో సింవకొండకీ -
ఏంపిల్డోఎల్దుమొత్తవా
సిలకలు కత్తులు దులపరిత్తయట
– ఏంపిల్డోఎల్దుమొత్తవా
..... ..... .....
తెలంగాణా - కొమరయ్య
కొండకీ-ఏంపిల్డోఎల్దుమొత్తవా
గద్దెని దన్నిన

గేతులున్నయట-ఏంపిల్డోఎల్దుమొత్తవా

కలకత్తా కొసుకారుకొండకీ - ఏంపిల్డోఎల్దుమొత్తవా

ఎలుకలు పిల్లిని - యెండ దగిలెనట - ఏంపిల్డోఎల్దుమొత్తవా

మేకలు మేసిన - ఆకుల కొండకీ - ఏంపిల్డోఎల్దుమొత్తవా

పులుల్ని మింగిన - గొర్రెలున్నాయట - ఏంపిల్డోఎల్దుమొత్తవా

పై గేయంలో సరికొత్తగా ప్రాధాన్యతను సంతరించుకున్న కొన్ని ప్రదేశాలకు వెళదామని ఒక వ్యక్తి ఇంకో వ్యక్తిని పిలిచే సందర్భంలో కవి ప్రకృతిపరంగా వివిధ అటవీ ప్రాంతాల్లోని దృశ్యాల్ని వర్ణించడం జరిగింది. అంటే సీమకొండలో చిలుకలు కత్తులు దులపడాన్నీ, కొమరయ్య కొండలో గెద్దెను మేకలు తన్నడాన్నీ, కాదు కొండలో ఎలుకలు పిల్లిని ఎదిరించడాన్నీ, ఆకుల కొండలో పులుల్ని గొర్రెలు మింగడాన్ని కవివాచ్యం చేశాడు. శ్రీకాకుళం పోరాటాన్ని స్ఫురింపచేసే కొన్ని దృశ్యాల్ని వ్యంగ్యంగా చెప్పడం జరిగింది. అంటే శ్రామిక జనచైతన్యం పెల్లుబికి బూర్జువా వ్యవస్థను తుదముట్టించడానికి పూనుకోవడాన్ని సూచించడం జరిగింది. ఇక్కడ కవి చేసిన సిలకలు, గేతులు, ఎలకలు, గొర్రెలు అనే పదప్రయోగాలు శ్రామిక వర్గాన్ని ధ్వనింపచేస్తున్నాయి. గెద్దె, పిల్లి, పులులు అనే ప్రయోగాలు బూర్జువా వ్యవస్థను సూచిస్తున్నాయి.

విప్లవ కవులు ఎరుపురంగుకు అత్యంత ప్రాధాన్యతనిచ్చారు. విప్లవానికి సంకేతంగా భావించిన 'ఎరుపు' ప్రధాన ప్రతీకగా విప్లవ కవిత్వంలో విశేషంగా ఆవిష్కరించబడింది. విప్లవకారుడు, కవి అయిన సుబ్బారావు పాణిగ్రాహి 'ఎరుపు' ప్రాముఖ్యతను తన కవితలో ఇలా వివరించాడు.

'ఎరుపంటే కొందరికి
భయం భయం
పసిపిల్లలు వారి కన్నా
నయం నయం
సూర్యునిలో తొలికాంతి
ఎరుపుమయం
ఎరుపులోని ఆనందం
అతిరమ్యం
.... .... ....
ఎరుపురంగు ఎన్నటికీ
కాదు అపాయం
అపాయాన్ని తప్పించే
ఒక సదుపాయం'

రక్తం ఎర్రగా వుంటుంది. కొందరు రక్తం చూస్తే భయపడతారు. అందువల్ల ఎరుపును తలచుకొన్నప్పుడు వారికి రక్తం గుర్తొచ్చి భయపడుతూ వుంటారు. పాణిగ్రాహి పాటలో ఇది వాచ్యార్థం. ఎరుపు విప్లవానికి సంకేతం. సాధారణంగా విప్లవం కొందరి త్యాగఫలం. మహాకవి శ్రీశ్రీ చెప్పినట్టు గుండెనెత్తురులు తర్పణం చేస్తూ ముందుకుపోతేగానీ విప్లవంలో విజయం సాధించలేం. పిరికిపందలు వయసుతో నిమిత్తం లేకుండా విప్లవం అంటే భయపడతారు. ఈ విషయాన్ని 'పసిపిల్లలు వారికన్నా నయం నయం' అనే పాదం ద్వారా కవి ధ్వనింపచేశాడు. ఎరుపు అపాయానికి చిహ్నం కాదని, అది అపాయాన్ని తప్పించే ఒక సదుపాయమని కవి వాచ్యం చేసి విప్లవ ప్రయోజనాన్ని ధ్వనింపచేశాడు. విప్లవ కవిత్వోద్యమంలో ఇటువంటి ఖండికలు విశేషంగా వెలువడ్డాయి.

తొలుత విప్లవ కవులు పోరాట స్ఫూర్తితో కలం పట్టినా 80వ దశకం తరువాత కూడా విరసం కార్యకలాపాలు కొనసాగడంవల్ల అనేక మంది కవులు ఆ ఉద్యమాల ప్రభావంతో సమకాలీన సమాజంలోని సమస్యల్ని విశ్లేషిస్తూ 'విప్లవ కవులుగానే మిగిలిపోయారు. మార్క్సిస్టు, లెనినిస్టు ఉద్యమాల నేపథ్యంలో విప్లవ కవులు తమ కవిత్వానికి నిబద్ధత ఏర్పరచుకున్నారు. బూర్జువా ప్రభుత్వాల విధానాలకు వ్యతిరేకంగా చోటు చేసుకున్న నక్సలైట్ల పోరాటాలను సమర్థిస్తూ వారి కలాలు, నిరసనను తెలుపుతూనే వచ్చాయి. ఇప్పటికీ తెలుపుతూనే వున్నాయి.

ప్రముఖ విప్లవ కవుల్లో ఒకరైన శివారెడ్డి వర్తమాన చరిత్రలోని అనేక పార్శ్వాలను తన కవిత్వంలో చిత్రించారు. 'భూమ్మీద పాదం మోపుతావు' అనే ఖండికలో ఈ కవి విప్లవాన్ని వ్యంగ్యాత్మకంగా ఆహ్వానించారిలా.

'భూమ్మీద పాదం మోపుతావు
గోదావరి నిశ్శబ్దంగా ప్రవహిస్తూ వుంటుంది
గోదావరి గర్భంలో రాళ్ళు నిదానంగా దొర్లుతూ
నీళ్ళలోనూ, రాళ్ళలోనూ ఒక ఎర్రజీర వ్యాపిస్తూ వుంటుంది
ఒడ్డునున్న రెల్లుగడ్డి చెట్టుకొమ్మ నీళ్ళ మీద కొనవంగి
నూత్న వర్తమానాన్ని అందుకుంటాయి
కత్తితో సూర్యుణ్ణి రెండుగా చీల్చగలడా!
అఖండ సూర్యుడు గోదావరి లోంతా ప్రతిధ్వనిస్తుంటాయి'

పై ఖండికలో కవి గోదావరి ప్రవహించే దృశ్యాన్ని వాచ్యం చేస్తూ విప్లవ పరిణామాన్ని ధ్వనింపచేశాడు. అంటే నిశ్శబ్దంగా ప్రవహించే గోదావరి గర్భంలో రాళ్ళు నిదానంగా దొర్లుతూ వుంటాయని, ఆ నీళ్ళలో, రాళ్ళలో ఎర్రజీర పుడుతూ వుందని, ఒడ్డు మీద వుండే రెల్లుగడ్డీ, చెట్టు కొమ్మా ఆ నీళ్ళ మీద వంటి కొత్త వర్తమానాన్ని అందుకుంటూ వుందని కవి ఇక్కడ వాచ్యంగా చెప్పాడు. మెల్లమెల్లగా పురివిప్పుతున్న చైతన్యం విప్లవానికి దారితీస్తుందని శ్రామిక వ్యవస్థ ఆ విప్లవం నుంచి స్ఫూర్తి పొందుతుందని వ్యంగ్యంగా చెప్పడం జరిగింది. సూర్యుణ్ణి కత్తితో రెండుగా చీల్చడం సాధ్యం కాదన్న వాచ్యార్థం ద్వారా విప్లవాన్ని అడ్డుకోవడం ఎవరివల్లా కాదన్న విషయాన్ని కవి ధ్వని గర్భితంగా సూచించాడు.

ఎన్‌కౌంటర్ల పేరుతో కొన్నేళ్ళుగా జరుగుతున్న పోలీసుల అకృత్యాలు విప్లవాన్ని ఆహ్వానించే ఆధునిక కవుల ప్రముఖ కవితా వస్తువయింది. వారు ఆ అకృత్యాలను తమ తమ దృష్టికోణాల్లో దర్శిస్తూ వాటిని తమ కవిత్వంలో తీవ్రంగా ఎండగట్టారు. ఈ అంశాన్నే ఆధునిక కవిగా గౌరీచందర్ 'రేపటి చరిత్ర' అనే ఖండికలో వ్యంగ్యాత్మకంగా ఆవిష్కరించాడిలా.

'గొంగళి పురుగు కళ్ళెప్పుడూ ఎర్రని చివుళ్ళమీదే
ఆకుల్ని కొరికిన దాని మెదడు లేని పుర్రెకు చెట్లను నరికినట్లు స్వప్నం
కిరణాలకు కొండలు అడ్డుకావు
సూర్యనేత్రాలకి పుట్టగొడుగులు

పై ఖండికలో కవి ఎర్రని చిగుళ్ళ మీదే దృష్టి పెడుతూ ఆకుల్ని తింటూ చెట్లనే తింటున్నట్టు కలగనే గొంగళి పురుగు అహంకారాన్ని, కిరణాలకు, కొండలు అడ్డుకొనే కావన్న విషయాన్ని వాచ్యం చేశాడు. పాలనా

వ్యవస్థకు కాపుకాసే పోలీసు వ్యవస్థ విప్లవ వీరుల్ని హింసించడంలోనే మొత్తం విప్లవాన్ని అణచివేసినట్టు భావిస్తుంది. అయినా విప్లవ వీరుల ఆశయాలను పోలీసు వ్యవస్థ ఎప్పుడూ అడ్డుకోలేదన్న విషయం ఇక్కడి ధ్వని. ఈ ఖండికలోని 'ఎర్రని చివుళ్ళు' అనే పద ప్రయోగం విప్లవ వీరుల్ని ధ్వనింపచేస్తూ వ్యంగ్యానికి ఆధారభూతమైంది. సతీష్‌చందర్ 'ఎదురుపొద్దు' అనే కవితా ఖండికలో పోలీసు ఎన్‌కౌంటర్ దృశ్యాన్ని ఒక ప్రకృతి దృశ్యంలో సంలీనం చేస్తూ వ్యంగ్యాత్మకంగా వర్ణించారిలా.

**'కాకి రంగు వడ్రంగి పిట్టలు**
**చెట్ల కొమ్మల్ని పొడిచెయ్యడం**
**నువ్వు చెవులారా వినలేదా చందమామా!**

పై ఖండికలో కవి వడ్రంగి పిట్టలు చెట్ల కొమ్మల్ని ముక్కులతో పొడుస్తూ నాశనం చేయడాన్ని వాచ్యం చేస్తూ పోలీసులు నానా రకాలుగా విప్లవ వీరుల్ని హింసించడాన్ని ధ్వనింపచేశాడు. ఇక్కడ కవి చేసిన 'కాకిరంగు' అనే పద ప్రయోగం పోలీసు వ్యవస్థను ధ్వనింపచేస్తూ వ్యంగ్యానికి ఆధారభూతమైంది.

ఆధునిక కవులు విప్లవాన్ని ఆహ్వానించిన సందర్భాల్లో సరికొత్త పదచిత్రాల్ని ఆవిష్కరించారు. ప్రతీకల్ని వాడడంలోనూ, కవిత్వ నిర్మాణ పద్ధతిలోనూ వారు కొత్తదనాన్ని పాటించారు. అందుకు ఉదాహరణగా వర్తమాన కవి ఆశారాజు రచించిన 'చల్లని చలివెల్తురు' అనే కవి ఖండికను పరిశీలించవచ్చు.

**'మంచు సముద్రంలో**
**నిలబడేదెట్లా! కూర్చునేదెట్లా**
**తలుపులు తెరవగానే**
**చలివరద ఇల్లంతా పొంగిపొర్లింది**
**కొట్టుకొని పోకుండా**
**దేన్నయినా పట్టుకుందామనుకుంటే**
**అన్నీ వొణికి వంకర్లు పోయిన వస్తువులే!**
**కుర్చీల చేతులూ**
**టేబుళ్ళ కాళ్ళూ**
**మంచం మీది తలదిండు నుదురు**
**దేన్ని ముట్టుకున్నా చల్లగా**
**చురుకుమంటున్నాయి**

..... ..... ..... .....

**మంచు సరస్సులో**
**కదిలేదెట్లా!**
**కదలడానికి గడియారం భయపడుతుంది**
**ఎగరడానికి కిటికీలోని పావురం భయపడు**
**తుంది**
**ఈ చలిగాలికి రంపపు పళ్ళున్నట్టున్నాయి**
**అందర్నీ పరాపరాకోసి,**
**కనిపించని గాయం చేస్తుంది**

..... ..... ..... .....

**చలి నెదుర్కోడానికి**
**మంట కావాలి**
**రగిలే వేడి కావాలి**
**ఆ మంట కోసమే**
**మనిషిలో రగిలే నిప్పుకోసమే**
**ఈ తపన**
**ఈ పాట**
**ఈ కవిత్వం!'**

ఈ ఖండికలో కవి మంచు, చలి అనే పదప్రయోగాల ద్వారా ప్రస్తుత అస్తవ్యస్త సమాజ స్థితిగతుల్ని ధ్వనింపచేశాడు. ఇక్కడ కవి మంచు సముద్రంలా ఆవహించిన ఇంటి స్థితిగతులను వాచ్యం చేశాడు. ఆ ఇంటిలోని కుర్చీలు, టేబుళ్ళు చల్లగా తయారయ్యాయి. ఆ చలివల్ల గడియారం కూడా నడవడంలేదని, కిటికీలోంచి పావురం ఎగరడానికి భయపడుతున్నదని, ఆ చలిలో అందరూ విపరీతంగా వణికిపోతున్నారని, ఆ చలిని ఎదుర్కోవాలంటే మంటను పుట్టించాలని కవి వివరించాడు.

దోపిడీ వ్యవస్థ వికృత చేష్టలవల్ల సమాజం అతలాకుతలమైపోతూ వుందని ఆ వ్యవస్థలో భాగమైన పాలనా యంత్రాంగం కూడా ఆ వ్యవస్థలాగే ప్రవరిస్తూ వుందని, ఆ వ్యవస్థను ఎదుర్కోవాలంటే విప్లవం తప్పని సరిగా ఉద్భవించాలనేది ఈ కవితా ఖండికలో ధ్వనిస్తుంది. కవి చలిని దోపిడీ వ్యవస్థకు ప్రతీకగా చూసుకోవడం సరికొత్త ప్రయోగం. కుర్చీల చేతులూ, టేబుళ్ళ కాళ్ళు అనే పదప్రయోగాలు పాలనా వ్యవస్థను ధ్వనింపచేస్తే పావురం శాంతిని ధ్వనింప చేస్తుంది. ఖండిక చివరిలో కవి చేసిన 'మనిషిలో రగిలే నిప్పుకోసమే' అనే పద ప్రయోగమే ఈ ఖండికలోని మొత్తం వ్యంగ్యాన్ని గ్రహించడానికి ఆధారభూతమైంది.

విప్లవ కవులు ఏ వస్తువును వ్యాఖ్యానించినా, ఏ అంశాన్ని విశ్లేషించినా వారిలో ఎంతో పదునైన ఆలోచన కనిపిస్తుంది. తమ పదునైన ఆలోచనలకు ఆయా సందర్భాలకు అనువైన ప్రతీకాత్మక వ్యంగ్యాన్ని జోడించి తమ కవిత్వానికి నిండుదనాన్ని తీసుకొచ్చారు. అనేక కోణాల్లో విప్లవాన్ని ఆవిష్కరించడానికి, పఠితల హృదయాల్లో పదిలంగా స్థానం సంపాదించడానికి వారికి ప్రతీకాత్మక వ్యంగ్యం ఎంతగానో దోహద పడిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

(కాల్పనిక విప్లవకత గురించి నిఖిలేశ్వర్ వ్యాసం లోగడ ప్రచురించాం. దానిపైనా వ్యాసంలో వ్యక్తమైన అభిప్రాయాలపైనా పాఠకుల స్పందన తెలియజేయవచ్చు) ❖

# ఉమామహేశ్వరరావు ఏడు కథలు

*రచయిత ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు కథల్లో ఆదర్శాలుండవు. జీవితముంటుంది. గుండె గాయాలుంటాయి. దుఃఖమో, సంతోషమో... కన్నీటి చెలమలుంటాయి. కథల నిండుకూ మానవ సంబంధాలు చిక్కటి అల్లికలా పెనవేసుకుపోయుంటాయి. తల్లీబిడ్డ, తండ్రీ కొడుకు, భార్యాభర్త, అక్కాబావ... వీటిని దాటి ఎక్కడో కాని బయటకు పోలేదు.*

**సుంకోజి దేవేంద్రాచారి**

'లో కాన్నీ, మానవలోకాన్నీ, మానవనైజాన్నీ అర్థం చేసుకుని మనిషి ఈ లోకంలో ఈ సంఘంలో మంచి సభ్యుడిగా వుండేట్టు చేసే కథలు (ఆ విధంగా వుండటానికి అతని చేత ప్రయత్నం చేయించే కథలు) మంచివని నేను తలుస్తాను. రచనకి సాంఘిక ప్రయోజనం వుండాలని కొంత మంది అంటూ వుంటారు. దానికి నేను పై ప్రకారం అర్థం చెప్పుకున్నాను.

-రావి శాస్త్రి

పై వాక్యాలను 17-8-90 నాటి ఆంధ్రజ్యోతి వారపత్రికలో **'కొడుకు దొరికాడు'** కథ మధ్య ఒకచోట బాక్స్ పెట్టి వేశారు. యాదృచ్ఛికంగా ఆ కథ మధ్యలో దీన్ని వేశారో లేక 'కొడుకు దొరికాడు' కథకుని భవిష్యత్ రచనలను వూహించి వేశారో తెలీదు. ఏదైతేనేం రావిశాస్త్రి రచనల నేపథ్యాన్ని ఆ విధంగా చెప్పారు. అలాంటి అభిప్రాయం చెప్పకనే చెబుతూ తన రచనల ద్వారా చిరపరిచిత మయిన రచయిత ఆర్.ఎం. ఉమామహేశ్వర రావు. ఈయన కథల్లో ఆదర్శాలుండవు. జీవితముంటుంది. గుండె గాయాలుంటాయి. దుఃఖమో, సంతోషమో... కన్నీటి చెలమలుంటాయి. కథల నిండుగా మానవ సంబంధాలు చిక్కటి అల్లికలా పెనవేసుకుపో యుంటాయి. తల్లీబిడ్డ, తండ్రీ కొడుకు, భార్యాభర్త, అక్కాబావ... వీటిని దాటి ఎక్కడో కాని బయటకు పోలేదు.

కొడుకు దొరికాడు ద్వారా నిజంగా సాహిత్యానికి మంచి రచయిత దొరికాడు.

కొడుకు దొరికాడు కథలో ఎప్పుడో తప్పిపోయిన తన కొడుకు దొరుకుతాడు కాంతమ్మకు. దొరికిన కొడుకు తనకు పుట్టినవాడేనా అంటే కాదు.

కాంతమ్మ కొడుకు చెప్పాచెయ్య కుండా వెళ్ళిపోయేవాడు.

కొడుకు ఇల్లొదిలిన ప్రతిసారీ తల్లడిల్లి పోయేది. కొడుకు తిరిగి వస్తే మాత్రం కాంతమ్మ ఒక్కమాటా అనేది కాదు. కొడుకు వెళ్ళిపోయి ఆరేళ్ళయింది. కొడుకు కోసం ఊర్లన్నీ తిరిగింది. జాడజాబులేదు. దుఃఖం ఒకటే ఆమెకు జీవిత కాలం తోడుగా మిగిలింది.

బియ్యం చెరుగుతూనో, పప్పులేరు తూనో, దాయాలాడుతూనో, విస్తరాకులు కుడుతూనో, కబుర్లాడుతూనో వూర్లో ఆడవాళ్ళు ఎప్పుడూ ఇంటి ముందు తిన్నెలమీద వుంటారు. కానీ కాంతమ్మ మాత్రం ఎప్పుడూ తలుపు మూసుకుని ఇంట్లోనే వుంటుంది. ఒక మాటా మంతి వుండదు. అటువంటి కాంతమ్మ కొడుకు దొరకాలనే ఇప్పుడు మాట్లాడుతోంది. ఆమె గొంతులో జీవితంపట్ల సంతోషం వినిపిం చిందంటాడు రచయిత.

పేగు బంధం పట్ల అంతటి మమకారం పెంచుకుంది కాబట్టే బాటసారిలో కొడుకును దొరకబుచ్చుకుంది.

రెండు రాళ్ళ దిమ్మెల మీద మంచంలా వున్న విరిగిన వుయ్యాల బల్ల ఒక మూల పొయ్యి, కొన్ని సత్తుగిన్నెలు - నీళ్ళకుండ, గోడకి మాసిక వేసిన ఖాకీ సంచి, దూలానికి వేలాడుతున్న లాంతరు - అన్నీ అవే వస్తువులు - అయినా ఏదో అందం ప్రత్యేకంగా కనిపిస్తోందంటాడు రచయిత. దరిద్రంలో కూడా సౌందర్యాన్ని కళ్ళ చూడ్డం, కాంతమ్మకు కొడుకు దొరికిన ఆనందంలో ఆ యింటికి వచ్చిన నిశ్శబ్ద సౌందర్యాన్ని గుర్తించడం ఎందరికి సాధ్యం?!

◇◇◇

**'నీతి కథ'** రెండవది. దరిద్రం, ఆకలి ముందు నీతులన్నీ గాలికి కొట్టుకుపోతాయనే సత్యాన్ని సజీవంగా ఆవిష్కరించిన కథ యిది. మంచీ చెడులు తెలిసిన పెద్దలే విచక్షణ కోల్పోయి నీతి తప్పడంలో అవినీతి వుంది. కల్మషం ఎరుగని పిల్లాడు కూడా సమాజంలో నలుగుతూ భుక్తి కోసం నీతి తప్పితే దాన్నేమంటారో విజ్ఞులకే తెలియాలి.

చిన్నగుప్పెట విప్పాడు. అయిదు రూపాయల కాయితం.

అమ్మ ముఖంలో వెలుగొచ్చింది.

అయిదు రూపాయలకే ఆమె ముఖంలో వెలుగు వచ్చిందంటే వాళ్ళ పరిస్థితి ఎలా వుంటుంది?

చిన్నా నాయన పత్రికలో పని చేసేవాడు. ప్రెస్సు పెట్టాలని వుద్యోగం మానుకుంటాడు. ఉద్యోగం పోయింతర్వాత ఈ రెండు మూడేళ్ళుగా యింటి పరిస్థితి మారిపోయింది. యింట్లో అరుపులు, కేకలు, అల్లరి, ఆటలు లేవు. ఎవరికి వారే మౌనంగా మారిపోయారు. నాయన ఇంట్లో వున్నంత సేపూ ఏదో ఆలోచిస్తూ దిగులుగా వుంటాడు. చిన్నకు నాయన్ను చూస్తే ఒక్కోసారి భయమేస్తుంది. అమ్మతో సరే, తనతో కూడా సరదాగా మాట్లాడడు.

సంపాదన లేకపోతే కుటుంబం ఎంతగా అశాంతికి, అభద్రతకు లోనవుతుందో, చిన్ని మనసులు ఎంతగా బాధపడతాయో ఆ కొన్ని వాక్యాల్లోనే చెప్పాడు రచయిత.

'అంతకుముందు సాయంత్రం అయితే యిల్లు కళకళలాడేది. బడి నుంచి వచ్చింది మొదలు నాయన పేట నుంచి ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూసేవాడు. నాయన తెచ్చే పొట్లాం వీడిని వూరిస్తూ వుండేది' అటువంటిది ఇప్పుడు తారుమారయింది. దానికితోడు

మూడు రోజుల నుంచి కురుస్తున్న వర్షంతో పనికి వెళ్ళే మార్గంలేక పస్తులుండాల్సిన పరిస్థితి. అందుకే చిన్న అమ్మకు ఐదు రూపాయల చూడగానే సంతోషం వేసింది. ఒక రోజన్నా పస్తులేకుండా గడవచ్చనుకుంది. సరుకుల కోసం కొడుకును అంగడికి పంపింది.

చిన్నకు వాళ్ళ నాన్న ఎప్పుడూ నీతి కథలు చెప్పేవాడు: వాడికి కూడా గాంధీ నెహ్రూలంటే చాలా యిష్టం. పుస్తకాల్లో చదివి, నాన్న చెప్పేవి విని తను కూడా గాంధీ అంత వాడు అవుతానని అనుకునేవాడు. మనం నీతిగా వుంటే గొప్పవాళ్ళమవుతామన్న సత్యాన్ని వాడునమ్మేవాడు.

కోటి రాజు బంకుదగ్గర "తల్లా... తెల్లార్నించీ వానలో నానతానే మోకాల్లోతు బుదదలో నాల్లేసినానమ్మా! కష్టం చేసిన సొత్తు. దక్కలేదే తల్లా. యింకెట్రా భగవంతుడా, రేతిరికి నా బిడ్డల కడుపుకేం బెడ్తాన్రా నాయనా..." అంటూ గోలుగోలున ఏడుస్తున్న బుదదమ్మ కనిపిస్తుంది చిన్నకు.

చిన్న చిన్నగుండె జాలితో నిండిపోతుంది. 'యిచ్చేస్తేపోలా' అనుకుంటాడు. వాడికి యిల్లు గుర్తొచ్చింది. అమ్మ ఏడుపులు, నిందలు, నిట్టూర్పులు గుర్తొచ్చాయి. నాయన మౌనపు ముఖం గుర్తొచ్చింది. నేరుగా అంగడి వైపు నడుస్తాడు. చిన్నకు యిప్పుడు వాళ్ళ నాయన చెప్పిన నీతి కథలేవీ గుర్తుకు రాలేదు.

తిన్నది అరగక బాధపడేవాళ్ళకు నీతులు ఆచరించడం సాధ్యమేమో కానీ, తినేదానికే లేనివాళ్ళకు నీతులు పాటించడం ఎలా సాధ్యం? కష్టపడే ప్రతి ఒక్కరికీ కూడూ గుడ్డకు లోటు లేని విధంగా వ్యవస్థ మారితే తప్ప నీతులు ఆచరించడం సాధ్యంకాదు.

◇◇◇

**'బిడ్డలగల్ల తల్లి'** మూడవ కథ.

మా కనకత్తని తిట్టి తూర్పారబట్టని వాళ్ళు ఊళ్ళో ఒక్కరు కూడాలేరు. నలుగురి నోళ్ళలో నానారకాలుగా నానుతూ వుంది. అంటూ కథ ప్రారంభిస్తాడు రచయిత.

కూతురు తప్పు చేసిందని అందరితో పాటు తల్లి కూడా కొడుతుంది. తల్లి ఎందుకు కొట్టింది? బిడ్డ తప్పు చేస్తే తల్లి కొడుతుందా, కడుపులో దాచుకుంటుందా? ఎవరికయినా ఈ ప్రశ్నలు రాకమానవు.

రాజమ్మకు నటరాజన్‌తో పెళ్ళయింది. రాజమ్మ తోడుతో నటరాజన్ వ్యాపారం మరింత పెరిగింది. ఇటు ఇంట్లో

.............. ★ ..............

**నిజంగా తల్లితండ్రులు పరువు కోసం పాకులాడకుండా కూతుళ్ళకు అండగా వుంటే ఆడవాళ్ళ ఆత్మహత్యలు చాలా వరకు తగ్గుతాయి. తమ కాళ్ళ మీద తాము బతకగలుగుతారు.**

.............. ★ ..............

అత్తకి చేదోడు వాదోడుగా వుంటూనే, బంకులో నటరాజన్‌కు సాయం చేసేది. వాళ్ళకు యిద్దరు బిడ్డలు కలిగారు. పచ్చని సంసారం. ఆ సమయంలో రాజమ్మ వెంకునాయుడితో లేచిపోయింది.

వెంకునాయుడి దెగ్గిర నుంచి రాజమ్మను ఈడ్చుకొచ్చారు. ఒక దెబ్బకాదు, ఒక తిట్టుకాదు - ఒక మనిషి కాదు - అందర్లోకి ఆగిత్తం కనకత్తదే.

"ఇప్పుడు నీకిదేం బుద్ధిపుట్టిందే ముండా! నీ మొకానికి మిండగాడు గావాల్సొచ్చినాడంటే యెదవా? రతనాల మాదిరి బిడ్డలు కలిగినారు, మకారాణి మాదిరిగా చూసుకునే మొగుడుండాడు. ఇదేం పనే?" అంటూ రాజమ్మను పట్టుకోని ఈ చెంపా ఆ చెంపా వాయించేస్తుంది కనకత్త.

"ఈ ముదనష్టపు బతుక్కన్నాయే కోనేట్లోనో, బాయిలోనో దూకి సావగూడదంటే" అని మరో రెండు దెబ్బలేస్తుంది.

రాజమ్మ ఒక్కమాటా మాట్లాడదు. ఒక్క ఏడుపు ఏడవదు. దెబ్బల బాధకి మెలికలు తిరిగి పోతున్నా కన్నీళ్ళు జారనివ్వదు. ఎందుకు?

మొగున్ని వదిలి పోయావని కొట్టారేగాని, ఎందుకు వదిలి పోయిందో ఒక్కరూ ప్రశ్నించలేదు. అందుకే ఎవ్వరికీ ఆమె సమాధానం చెప్పలేదు. అంతగా కొట్టినా తను తప్పు చేశానని వేడుకోలేదు. అండగా వుంటాడనుకున్న కండలు తిరిగిన వెంకు నాయుడు తన బంధుగణమంతా దండెత్తి పోయేప్పటికి భార్యాబిడ్డలను కూడా వదిలి పారిపోయాడు.

రాజమ్మ చిందర వందరైన జుట్టును సర్దుకోకుండా, ఎదమీద సక్రమంగాలేని పైటను పట్టించుకోకుండా, భారంగా పుట్టింటివైపు నడిచింది అంటాడు రచయిత.

ఇక్కడ రాజమ్మకు నటరాజన్‌కు మధ్య సంబంధం అర్థమవుతుంది.

భార్యను భర్త సరిగా చూసుకోలేదనే విషయాన్ని చెప్పాడిక్కడ.

రాజమ్మ ఎదమీద సక్రమంగా లేని పైటను పట్టించుకోలేదు. భారంగా పుట్టింటివైపు నడిచింది అంటే యిక్కడ ఆమె పట్టించుకోంది పైటను కాదు. తన ఎదలో అంటే తన మనసులో వుండి తనను పట్టించుకోవాల్సిన భర్త పట్టించుకోక పోవడంతో తను కూడా భర్తను పట్టించు కోలేదు. నేరుగా పుట్టింటికి పోయింది.

యిదంతా తెలీని కనకత్త, కూతుర్ని తన యింటి గడప తొక్కవద్దంటుంది. అల్లుడితో "యిది మీ మొగుడూ పెళ్ళాల యవ్వారం. సంపుకుంటావో, సంతరించుకుంటావో నాకు మాత్తరం ఈ పీడొద్దు." అని రాజమ్మను జుట్టు పట్టుకుని బరబరా ఈడ్చుకొని వెళ్ళి నటరాజన్ ముందు పడేసింది.

కనకత్త ఎందుకిలా చేసింది?

కనకత్త మనసు అర్థం కాకపోయింటే రాజమ్మ ఏ నుయ్యో గొయ్యో చూసుకొనేది. అమ్మ మనసు అర్థం చేసుకుంది కాబట్టే నేరుగా అత్తింటికి పోతుంది.

''దానికి పుట్టింట్లో యింత చోటుండాదని తెలిస్తే నాబట్ట యింక దాన్తో కాపురం జేసునా ఏమి? దేన్నో ఒకదాన్ని కట్టుకోని నా బిడ్డకు అన్నాయం జెయ్యడా? పుట్టింటిలో గూడా దానికి గెతిలేదంటే పక్కలో గాకపోయినా పాదాల దెగ్గిరైనా దాన్ని పడుండనీడా? నా బిడ్డ కోసరమే నాయినా నేనీ గుండె రాయి జేసుకునింది" అని కనకత్త బోరున ఏడ్చినప్పుడుగానీ మనకు ఆమె ప్రవర్తన అర్థం కాదు.

ఆర్నెల్లు చూస్తుంది కనకత్త. కూతురు శవంలాగా అయిపోతుంది. అత్తింట్లో అన్ని రకాలా అవమానాలు. ఒక రోజు నడీధిలో నటరాజన్ బంకుకాడ నిల్చొని" మొగుడనే వాడు తీరుగా వుంటే ఆడముండకి ఈ మాదిరి అగచాట్లు యాడ నుంచి వస్తాయంట. ఈ నాబట్టలో తప్పేంలేకుండా వుంటే నా బిడ్డ ఇట్టాంటి పని జేసునా ఏమి? ఇదిగో! అందురూ ఇనండి! కడంత కాలం సావు దెబ్బలు తింటా బతకబళ్ళా. నా బిడ్డన్నేను తీసుకుపోతుండా. నా బిడ్డన్నేను కాపాడుకుంటా! రే! దానికీ నీ మాదిరి కాళ్ళూ చేతులు వుండాయి. దాని కూడది తింటాది. దాని నీళ్ళది తాగుతాది. మళ్ళీ నీ మొత్త తొక్కితే నీ ఎడం కాలి చెప్పుతో కొట్టు!" అని నటరాజన్ యింట్లో ఎముకల పోగులా పడున్న రాజమ్మని పసిబిడ్డలా చేతుల్లోకి

జవురుకుని ఇంటివైపు నడిచింది.

యిప్పుడు మావూరి కోనేటి గట్టున రెండు బంకులున్నాయి.

నటరాజన్ బంకుకు ఎంత పేరుందో రాజమ్మ బంకుకీ అంత పేరుంది. అని కథను ముగిస్తాడు రచయిత.

నిజంగా తల్లితండ్రులు పరువు కోసం పాకులాడకుండా కూతుళ్ళకు అండగా వుంటే ఆడవాళ్ళ ఆత్మహత్యలు చాలా వరకు తగ్గుతాయి. తమ కాళ్ళ మీద తాము బతకగలుగుతారు.

ఈ మూడు కథలూ ఒక్క సంవత్సరం కాలంలోనే అచ్చయ్యాయి. వీటి తర్వాత నాల్గవ కథ 'మంచివాడు' రావడానికి రెండు సంవత్సరాల కాలం పట్టింది.

◇◇◇

**'మంచివాడు'** కూడా ఒకరకంగా 'నీతికథ' లాంటిదే. అందులో చిన్న, వాడినాన్న ప్రధాన పాత్రధారులు. దరిద్రం, ఆకలి 'చిన్న'ను నీతి తప్పేలా చేస్తుంది. యిక్కడ చినరెడ్డిని దరిద్రం, ఆకలి దొంగతనం చేసేలా చేస్తుంది.

కథ ప్రారంభంలోనే 'పెదరెడ్డి ఒంట్లో నిస్సత్తువగా ఉంది. నీరసంగా నడుస్తున్నాడు. కపిల బావి దగ్గర కాటయ్య ఎదురుపడ్డాడు. పెదరెడ్డి అడుగుల్లో వడి పెరిగింది. వాడిన ముఖంలోకి దర్పం వచ్చింది'. అంటాడు రచయిత.

పెదరెడ్డి ఉదయం నుంచి పస్తున్నాడు. పస్తుతో నీరసంగా వున్నాడనే సంగతి తెలీకూడదనే దర్పం ప్రదర్శించాడు. పెదరెడ్డి ఒక్కడే కాదు. మంచివాళ్ళంతా ఇలానే వుంటారు. నలుగురిలో మంచి అనిపించుకోవడం కూడా ఒక వ్యసనం లాంటిది. తాగుడు, జూదం లాంటి వ్యసనాలకు బానిసలయితే ఎలా సర్వస్వం పోగొట్టుకుంటారో, 'మంచివాడు' అనిపించుకోవాలనే వ్యసనానికి బానిసయినా కూడా అదే పరిస్థితి ఎదురవుతుంది.

నెల రోజుల నుంచి ఇంట్లో తిండి గింజలు లేవు. రోజూ చాటెత్తుకోని వీళ్ళనూ వాళ్ళనూ అడుక్కోని తెచ్చి కూడు ఉడకేసి పెడుతోంది. ఆ రోజు ఇక తనవల్ల కాదని ఖరాఖండిగా తెగేసి చెప్పేసింది కోడలు.

పెదరెడ్డికి ఈ రోజు కూటికి తక్కువైనా మానానికి, మర్యాదకి తక్కువలేదు. ఈ రోజుకీ పాలూరికి 'పెదరెడ్డి' పెదరెడ్డే. తాతముత్తాతల నుంచి వారసత్వంగా లభించిన పరువు ప్రతిష్టలను పెదరెడ్డి కాపాడుకుంటూనే

.............. ★ ..............

**మంచివాడు కూడా ఒకరకంగా 'నీతికథ' లాంటిదే. అందులో చిన్న, వాడినాన్న ప్రధాన పాత్రధారులు. దరిద్రం, ఆకలి 'చిన్న'ను నీతి తప్పేలా చేస్తుంది. యిక్కడ చినరెడ్డిని దరిద్రం, ఆకలి దొంగతనం చేసేలా చేస్తుంది.**

.............. ★ ..............

వున్నాడు.

ఏ విధంగా కాపాడుకుంటున్నాడు? పెదరెడ్డి తాతకి రెండొందల ఎకరాల భూమి వుండేదంటారు. వాళ్ళు 'మంచివాడు' అనిపించుకోవడం కోసం పాకులాడిన వాళ్ళే. పెదరెడ్డి చేతికి పెత్తనం వచ్చేప్పటికి పాతిక ఎకరాలు మాత్రమే మిగిలింది. వంశపారంపర్యంగా వచ్చిన పేరు ప్రతిష్టలను కాపాడుకోవడానికి ఆయన చేయగలిగినంతా చేస్తూనే వున్నాడు. అందుకే యిప్పుడు ఉన్న పాతిక ఎకరాలు ఊడ్చుకుపోయింది.

ఫీజు కట్టలేదని హాస్టల్లో పేరు తీసేయడంతో ఇంజనీరింగ్ చదువుతున్న చిన్నకొడుకు ఉరేసుకుని చనిపోయినా పెదరెడ్డి 'మంచివాడు'గా వుండటానికే నిర్ణయించుకున్నాడు.

పెళ్ళాం శవం నట్టింట్లో వున్న రోజున చేతిలో చిల్లిగవ్వలేకపోయినా పెదరెడ్డి 'మంచివాడు'గానే నడుచుకుంటున్నాడు.

అందుకే యిపుడు పెదరెడ్డికి భూములు, బావుల్లేవు. తనపొలం దగ్గరే తమ పాలేరుగా వున్నాడు.

ప్రస్తుతం పెదరెడ్డి వడ్లకుప్పకాడ కాపలాగా వున్నాడు. ఆకలి, నీరసం అయినా జాగ్రత్తగా కాపలా కాస్తున్నాడు. ఎంతయినా మంచివాడు కదా!

వడ్లకుప్పకాడ చప్పుడయితే వెళ్ళి దొంగను పట్టుకుంటాడు. దొంగ తనకొడుకు చినరెడ్డే.

"పెదరెడ్డి యింట పుట్టి మానం చెడ్డపని చేస్తావా? వొక్కపూట పస్తుండలేక పోయినావంట్రా యెదవా. వందల ఎకరాలు పోయినా, నీ తాత ముత్తాతలు ఎంటికతో సమానం అనుకున్నేరే. నీ మాదిరి నీతి తప్పినారంట్రా" అంటాడు పెదరెడ్డి.

"నాయినా, నేను జెప్పేదిను. పెద్దమ్మి శోషొచ్చి పడిపోయింది. చిన్నమ్మి సందేళనుంచి ఒకటే ఏడుపు. బిడ్డల బాధ కళ్ళజూళ్ళేక వచ్చినా. నాలుగ్గింజలేకదా! పెదరెడ్డి కూట్నీళ్ళకు కొట్టేసిన మనభూమి ఫలితవేు గదా ఇది" అని గోతం ఎత్తుకుంటాడు చినరెడ్డి.

తండ్రీకొడుకుల మధ్య పెనుగులాట జరుగుతుంది. పిల్లల్ని కాపాడుకోవడానికి గద్దతో పోట్లాటకి సిద్ధమైన తల్లికోడిలా వుంటాడు పెదరెడ్డి. రేపీ విషయం వూర్లో తెలిస్తే మంచివాడికి మచ్చరాదా?

ఎర్రబారిన పెదరెడ్డి కళ్ళలోని పట్టుదలను చూసి, నెత్తి మీది మూటను విసరి నేలకేసి కొడతాడు చినరెడ్డి.

తండ్రి వైపు తిరిగి "థుపూ" మని ముఖాన కేకరించి వుమ్మేసి ఊరివైపు పారిపోతాడు. మంచివాడికి నిజంగా అలాంటి సన్మానం జరగాల్సిందే.

"ఒరే కొడకల్లారా.... నేను మంచోణ్ణి గాదురా, నాకు మానం, మర్రేదా వొద్దురా" అని గొంతు వగిలేలా అరవాలనుకుంటాడు చినరెడ్డి. కానీ మాట పెగిలి పెదవి దాటిరాదు.

ఎందుకు? అతను కూడా మంచివాడి కొడుకే. అతన్లోనూ మంచితనం వుంది కదా?!

మరో మూడు సంవత్సరాల తర్వాత ముక్కుపుల్ల కథ రాశాడు.

◇◇◇

**'ముక్కుపుల్ల'** కథలో సుబ్బమ్మ చనిపోయుంటుంది.

"యేంబాగుండడంలే, కడుపుకింత కూడా, కంటికింత నిద్రా. బతికినంత కాలం రోగం రొచ్చుతోనే గదా బతికింది. సచ్చిసుక పడింది పుణ్యాత్మురాలు" అంటుంది కథకుని అమ్మ ప్రారంభంలో. సుబ్బమ్మ పేదరికంతో చనిపోతుంది. అంత పేదరికంల, అనారోగ్యంతో, ఆకలితో బతుకుతుందంటే ఆమెకెవరూ లేరా అంటే పొరబాటే!

అమ్మ వుంది. ఈమె మీద ఆధారపడి బతుకుతోంది. ఇద్దరు సోదరులు. వాళ్ళ బతుకులు వారికే భారంగా వుంటాయి. ఉన్న ఒక్క కొడుకు దేశాలు పట్టిపోయింటాడు.

ఒకరికింత పెట్టునేగానీ వొకర్నింత చెయిజాచి అడిగేరకం కాదు. వారం దినాల నుంచి జొరంగా వున్నా, పస్తులున్నా చెప్పుకోలా. సుబ్బమ్మ కేవలం అభిమానవతయితే ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరంలేదు. చిన్న తమ్మునికి

ఎనిమిది మంది బిడ్డలు పుడితే అందర్నీ సాకింది ఈమే. సుబ్బమ్మ చనిపోతే నాలుగైదు నూర్లు కార్యానికి అవతాదనుకుంటారు. ఆ మాత్రం జరుగుబాటు వున్న వాళ్ళెవరూ లేరు వాళ్ళలో. పూట గడిచేదే కష్టం. అయినా సరే, రంగయ్య ముందుండి కార్యం జరిపిస్తాడు.

పీనిగనెత్తిన సాయంత్రం సుబ్బమ్మ ఇల్లంతా ఏడుపులతో నిండిపోతుంది. చనిపోయిందని కాదు, ఆమె అరతులం ముక్కుపుల్ల కనిపించలేదని.

"నీయమ్మ బతికేది యింకెట్ట నాకూతురా... నీయమ్మను యింకెవరు మతిస్తారే నా కూతురా" అంటూ నాగవ్వ ఏడుస్తుంది.

అరతులం ముక్కుపుల్ల కోసం స్మశానంలో బూడిదంతా వెతుకుతారు. కనిపించదు.

తోడికోడళ్ళు తిట్లవర్షం కురిపించు కుంటారు.

ముక్కుపుల్ల కుదువ పెడతానని చెప్పి కార్యం కోసం రెండునూర్లు అప్పుతెచ్చింటాడు రంగయ్య. ఆ అప్పు ఎలా తీర్చాలని ఏడుస్తాడు. అందరూ కలిసి ముసలామెను అనుమానిస్తారు. నాగమ్మను బయటకు పంపిచ్చి ఇంట్లో వుండే కుండలన్నీ వెతుకుతారు తోడికోడళ్ళు. ఒకరిమీదొకరు అనుమానంతో జుట్లు పట్టుకోని గుద్దుకుంటారు. వీళ్ళ గొడవలో మగవాళ్ళు కూడా దూరుతారు.

అన్నదమ్ముల మధ్యా, తోడికోడళ్ళ మధ్యా, తల్లీ బిడ్డల మధ్యా పగరగిలింది. తగవులు, తన్నులాటలు, యేడ్పులు, పెడబొబ్బలతో ఆ రాత్రి యింట్లో మరోపీనుగ లేసినట్లుంది అంటాడు రచయిత.

మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః అన్నారు పెద్దలు.

నిజమే. బంగారం ముందు బంధాలు పుటుక్కున తెగిపోతాయి.

అరతులం ముక్కుపుల్లకోసం రక్త సంబంధాలను కూడా మరిచి శత్రువుల్లా తిట్టుకోవడాలు, కొట్టుకోవడాలు... కేవలం లేమితోనే.

◇◇◇

తర్వాతది 'మొగుడూ పెళ్ళాల ప్రేమకత'.

భర్త తిరగగలుగుతూ వుండి, సంపాదన వుండీ పట్టించుకోనపుడు ధైర్యంగా భర్తను వదిలి వెళ్ళిపోయి బతకగలిగే స్త్రీ కథ బిడ్డలగల తల్లయితే, చేతులు పోయి పనులు

........... ★ ...........

**ఒకర్నొకరు అర్థం చేసుకుంటూ కష్టసుఖాలలో నిజంగా పాలుపంచుకునే 'మొగుడూ పెళ్ళాల ప్రేమకత' ఇలానే వుంటుంది. ఒకరినొకరు అర్థం చేసుకోనపుడు సుఖాలు కూడా కష్టాల్లా మారి కాపురాలు కూలుతుంటాయి.**

........... ★ ...........

చేయలేక ఆత్మన్యూనతా భావంతో రాచిరంపాన పెట్టే భర్తను అక్కున చేర్చుకున్న ఇల్లాలి కథ 'మొగుడూపెళ్ళాల ప్రేమకత'

కథ ప్రారంభంలోనే కొన్ని వాక్యాలు చెప్తాడు రచయిత. అవి మామూలుగానే వుంటాయి. ఒక్కో చోట కథకు సంబంధం లేనివేమో అనిపించేలా వుంటాయి. కానీ వాటి వెనుక తను చెప్పబోతున్న కథలోని సారమంతా వుంటుంది. ఈ కథలో కూడా అంతే.

మిడతను మింగడానికి తొండ వస్తూంటుంది. తనను సమీపిస్తున్న తొండను మిడత ఏకాగ్రతంగా చూస్తుంటుంది. కదలదూ, బెదరదు. తొండకు అనుమానం వచ్చి కదులుతుంది. మిడతను పరీక్షించడానికని. అయినా మిడత మెదలదు. చివరకు మిడత మీద తొండ దూకింది. అదే క్షణంలో ఒక వెర్రికేక వినిపించింది అంటాడు రచయిత.

యిక్కడ వినిపించిన కేక మిడతది కావచ్చు. లేక బాధిత స్త్రీది కావచ్చు.

విజయ మొగుడు కొట్టే దెబ్బలు భరించలేక కేకేసింది.

ఈ మొగుడూ పెళ్ళాలకు ప్రతీక తొండ, మిడత, భర్త చేసే చేష్టలన్నీ భార్యకు తెలిసినా మిడతలా చూస్తూ వుంటుంది.

సోంబావ మిల్లులో పని చేసేప్పుడు తాగేవాడు కాదు. విజయను పువ్వులాగా చూసుకునేవాడు. తోబుట్టువులకు బట్టలు పెట్టేవాడు. మిల్లు మూతపడగానే పీనుగలేసిన యిల్లు మాదిరి తయారయింది వాళ్ళ యిల్లు.

"య్యో...యొందిరా... మొగుడు జచ్చిన ఆడదాని మాదిరిగా, సాలుగానీ లెయి. యిది వూరా అడివా. అందరూ బతికినట్టే మనం కూడా బతుకుతాంగానీ లెయి. "అని ధైర్యం చెబుతుంది ముడుక్కోని పడుకోనుండే సోంబావకు విజయక్క.

మిల్లులో పని పోగానే మగ్గం నేయడం నేర్చుకుంటాడు. ఇంట్లోనే మగ్గం పెడతాడు. అతనికి తోడు విజయమ్మ. యిద్దరూ కష్టజీవులు. తిండికి, బట్టకు లోటు లేకుండా జరిగిపోతుంటుంది. 'విజయమ్మ పచ్చటి పసుప్పూసుకున్న ముఖం మీద నుదుటన రూపాయి బిళ్ళంత బొట్టు పెట్టుకుని బుగ్గన వక్కాకు నములుతూ రెండు మగ్గాల మధ్య కూర్చుని కండెలు చుడుతూ మా సోంబావతో మాట్లాడేది' అంటాడు రచయిత.

తాము నేసిన బట్టకు గిరాకీ లేకపోవడంతో ఆ వృత్తిని వదులు కుంటారు వాళ్ళు. కూలిపనులకు పోతారు. తాగుడుకు తిరుగుడుకు బానిసవుతాడు. భార్యను కొట్టడానికి కూడా వెనుకాడడు. కాపురం నాశనం కావడానికి కారణం 'పొరికెదవల సావాసం చేయడమే'.

టీ అంగడి పెట్టుకుంటారు. అక్కడా మామూలే, ఫుల్లుగా తాగడం, భార్యను చావబాదడం, ఎన్నాళ్ళని ఎవరయినా దెబ్బలు భరిస్తారు. భార్య తిరగబడుతుంది.

రైలు కింద సోంబావ రెండు చేతులు పెడ్తాడు. ఎందుకు పెట్టినాడు? భార్యను యిక కొట్టకూడదని, యింత కాలం కొట్టి తప్పు చేశానని. అందుకు ప్రాయశ్చిత్తంగా చేతుల్ని రైలు కింద పెడతాడు. యిప్పుడు విజయమ్మకు అదనపు భారం. భర్తకు అన్ని పనులు ఆమే చెయ్యాలి. ఎంతయినా మగవాడు కదా. తరతరాలుగా వస్తున్న అహం అతడ్ని మామూలుగా వుండనీదు. రెండు చేతులు లేకపోవడంతో భార్యను తన్నడం మొదలుపెడతాడు.

యివన్నీ తెలుసుకుని మరుసటి రోజు విజయమ్మ ఇంటికి పోతాడు కథకుడు. తేటగా హాయిగా వుంటుందామె.

తను సంపాదిస్తూ, భర్తను బిడ్డల్ను సాకుతూ రోజూ తన్నులు తింటూ అతని దగ్గర పడుండాల్సిన అవసరం విజయమ్మకు లేదు. భర్త చేష్టలకు మరొకరయితే ఆత్మహత్య చేసుకునే వాళ్ళు. విజయమ్మ అలాంటిది కాదు.

"మైండు నిండా చెడిపొయ్యి గదా ఆ మనిషి యీ మాదిర్తో జేస్తా వుండేది. యిప్పుడా మనిషిని తప్పుబట్టి యేంపలం? యింకనిప్పుడు ఆ మనిషి మానాన ఆ మనిషిని వొదిలేసి నాదారి నేను జూసుకుంటే న్యాయంగా వుణ్ణా! రెక్కలు రాని బిడ్డల్ని కోడిపెట్ట రెక్కల కింద పొదుక్కుణ్ణె గానీ వొదిలేసి దాని తిండి అది ఎతుక్కుంటా బోతదా? చేతుల్లేని ఈ మనిషి పసిబిడ్డతో సమానం గదా'' అంటుంది

విజయమ్మ.

ఒకర్నొకరు అర్థం చేసుకుంటూ కష్టసుఖాలలో నిజంగా పాలుపంచుకునే 'మొగుడూ పెళ్ళాల ప్రేమకత' ఇలానే వుంటుంది. ఒకరినొకరు అర్థం చేసుకోనపుడు సుఖాలు కూడా కష్టాల్లా మారి కాపురాలు కూలుతుంటాయి.

◇◇◇

మొగుడూ పెళ్ళాల ప్రేమ కత తర్వాత మరో మూడు సంవత్సరాలకు 'నోరుగల్ల ఆడది' కథ రాశాడు రచయిత.

మిగిలిన ఆరు కథలకు యిది భిన్నంగా వుంది. ఈ కథకు కొత్త టెక్నిక్‌ను ఎన్నుకున్నాడు రచయిత. మనల్ని అప్పటి కాలానికి ఒకరు తీసుకెళ్తారు. మరొకరు అప్పటి జీవితంలో వుంటూ ఆనాటి పరిస్థితులను దృశ్యమానం చేస్తారు. ఈ యిద్దరూ ఒకరే.

మొదటి భాగంలో 'ఒక యింటికి ముదురాకుపచ్చరంగు చెక్కతలుపుంటుంది. అట్లాగే వుండనివ్వండి దాన్ని. తీయద్దు. వద్దొద్దు... నెట్టకండి. లోపలంతా చీకటి. సుడిగుండాలు. పోటెత్తే సముద్రాలు. రగిలే పర్వతాలు. వద్దు వెళ్ళకండి ఆ తలుపు జోలికి. అవి కట్టలు తెంచుకుని మనల్ని ముంచెత్తి వూపిరాడనివ్వక వుక్కిరి బిక్కిరి చేయెుచ్చు.

బహుశా కన్నీళ్ళు కావచ్చు. లేదా మరిగే లావా కావచ్చు' అంటాడు రచయిత. తను దృశ్యమానం చెయ్యబోతున్న విషయాన్ని చెప్పకనే చెబుతాడు.

బతకడం కోసం పడుపు వృత్తి స్వర్ణక్కది. అక్కడా క్షణక్షణం పోలీసుల గండమే.

రెండో భాగంలో నీడ తక్కువగా వున్న వేపచెట్టుకిందకు తీసుకుపోతాడు. ఎన్నో తుఫానులను ఎదురొడ్డి, రెమ్మలు రాలినా కొమ్మలు విరిగి పోయినా సజీవంగా నిలబడ్డ మహా వృక్షమది. తిన్నెలాగా విస్తరించిన దాని వేళ్ళను చూస్తే ఒకనాటి దాని రూపం కళ్ళకు కనబడుతుంది.

తను మనకళ్ళముందు నిలప బోతున్న జీవితాల్లోని ఆటుపోట్లను విశదీకరించే వాక్యాలివి.

విటుడిని ఆకర్షించడం కోసం బిందెతో బాయి దగ్గరకు వచ్చింది స్వర్ణక్క. గలగల శబ్దంతో బిందె బావిలోకి దిగింది. ఎండ మండిపోతోంది. కాళ్ళకి చెప్పుల్లేవు ఎండలో నిదానంగా ఆమె నీళ్ళు చేదుతోంది.

మండుతున్న ఎండలో, చెప్పుల్లేకుండా నిదానంగా నీళ్ళు చేదడమంటే వాళ్ళ పేదరికం ఎంతో తెలుస్తుంది. కాళ్ళకు చెప్పులకన్నా ముఖ్యమయిన కడుపుకు తిండికోసం వీళ్ళు ఈ వృత్తిలో వున్నారనేదీ తెలుస్తుంది. దానికి కూడా పోటీ. వొళ్ళమ్ముకున్నా కడుపు నిండని పరిస్థితి.

.............. ☆ ..............

**ఉమామహేశ్వర రావుకు మనుషులంటే ప్రేమ, ప్రాణం. ఎంతంటే మాటల్లో చెప్పలేనంత. అందుకే ముక్కుపుల్ల కథలో బంధువుకాకపోయినా చిన్నప్పుడు పాలుతాపిన సుబ్బమ్మ చనిపోతే వలవలా ఏడుస్తాడు. ప్రేమకు బంధువే అయ్యుండాల్సిన అవసరం లేదంటాడు. మొగుడూ పెళ్ళాల ప్రేమకతలో ఒకచోట 'మా సోంబావకీ మాకూ చుట్టరికం యేదీలేదు. వరుసలు కలుపుకోవడానికి మావూళ్ళో మాకు కులాలు బంధుత్వాలూ అవసరంలేదు' అంటాడు.**

.............. ☆ ..............

మూడో భాగంలో చల్లని కుండనీళ్ళు తాగినా లోలోపల సెగలుగానే వుంది. కడుపులో దిగులుగా వుంది. ఆవేదనగా వుంది. జ్వరం కాస్తున్నట్టుగా వుంది అంటాడు రచయిత.

విజయమ్మ, స్వర్ణక్క బతుకులు అట్లే వుంటాయి. స్వంత ఇల్లున్నా వాళ్ళ బతుకులో చల్లదనంలేదు. వాళ్ళ యింటిని కాజేయాలను కుంటాడు మున్సబు. భార్య మాటలిని వీళ్ళమీదకు గొడవకు వస్తాడు. తల్లీ కూతుండ్లు అసలే నోరుగల్ల వాళ్ళు కదా. "మంచో చెడ్డో మా బతుకు మేం బతుకుతా వుండాం. 'అయ్యాసామీ దయతలవమని' నిన్నేవాడన్నా దేబిరించినామా. నీ కూటికి ఆసిపడినామా. నీ నీళ్ళకి ఆసిపడినామా. ఎవురి గడపలు దొక్కి ఎవురి కొంపలు గూల్చినాం నాయనా. ఆ కొంపా ఈ కొంపా గూల్చి మిద్దెమింద మిద్దె గట్టినోళ్ళంతా పెద్ద మనుషులుగా వుండారు. మా మిందికెందుకని కాలుదువ్వేది. మాట్లాడితే పోలీసోళ్లని అంపిచ్చేది. యేం... నీ దెగ్గిర నూరో ఇన్నూరో తండలకి దీసుకోని కూట్నీళ్ళకి నా యింటిని నీకు దారబోయలేదనే గదా నీ అక్కసంతా" అని దుమ్ము దులిపేస్తారు.

నాలుగో భాగంలో మాత్రం రచయిత నిగూఢతను పాటించలేదు. తర్వాత దృశ్యమానం చేయబోయే విషయంలోకి నేరుగా ప్రవేశిస్తాడు.

లారీ డ్రైవర్ గోపాలం స్వర్ణక్కకు భర్తలా మారతాడు. అతను ఆ యింటికి రావడం మొదులు పెట్టింతర్వాత తల్లీకూతుళ్ళ ప్రవర్తన మారిపోతుంది. ఒకరిమిందకు గొడవలకు పోరు. ఒకరచ్చలే రాగింతంలే. అతనేం తెచ్చేస్తా వుండాడో, యేం తింటా వుంటారోగానీ బయటకే పొక్కదు. గుట్టుగా సంసారం సాగుతుంటుంది. కానీ తల్లీ కూతుళ్ళ ముఖాల్లో మునుపటి కళాకాంతులు లేవంటాడు రచయిత. వాళ్ళు చేసే వృత్తి ఏదయినా కావచ్చు. స్వతంత్రంగా బతుకుతున్నప్పుడు స్త్రీలకు ఎంతో ఆత్మతృప్తి వుంటుంది. భర్త ఎంతటి మంచివాడయినా అతని నీడలో ఆత్మాభిమానాన్ని కోల్పోయి ఆనందంగా భార్య బతకలేదంటాడు. డ్రైవరు గోపాలం లారీ యాక్సిడెంటులో చనిపోయినా పాతవృత్తికి పూనుకోదు స్వర్ణక్క. విజయమ్మ మనోవ్యాధితోనే చనిపోతుంది.

ఐదో భాగంలో కథకుడు, దృశ్యకారుడు ఏకమైపోతారు.

భోగంవాళ్ళు ఆలయాల్లో ఆడటం ప్రభుత్వం నిషేధించి బతుకు తెరువు కోసం ఊరికి దూరంగా పొలం యిచ్చింది. "నీడ పట్టున పుట్టి పెరిగినోళ్ళం. గజ్జెకట్టి ఆడినోళ్ళమే గానీ, మడక గట్టి దున్నినోళ్ళమా. మా బతుకిదేనయిపాయి. మగదిక్కులేని యిళ్ళయిపాయి. రాయిరప్పా ఏరుకోని చెట్టూచేమా కొట్టుకోని సేద్దింజేసే పని... ఆడమనుషుల వల్లవునా... న్యాయం జెప్పు... మంచయినా చెడ్డయినా న్యాయంగుండాల." అంటూ ప్రశ్నిస్తుంది మనోరంజనవ్వ.

"వొంటిమిందుండే నగానట్రా అమ్ముకుంటిమి. యింట్లో చెంబూ తపేలా అమ్ముకుంటిమి. వుయ్యాలబల్లని గాదు, పందిరిమంచాలూ బోసానం పెట్టె అమ్ముకు తింటిమి. ఆకరికి యిల్లూవాకిలి గూడా ఎవురు నిలబెట్టుకున్నారు నాయినా... బోగమీదనేది బోగమోల్లకు మిగిలిండాదా. వొక్క సోర్నమ్మ యిల్లుతప్ప ఆ వొరసవొరసంతా యిళ్ళలో వుండేదెవురూ. అయన్నీ ఆ కుంటి మున్సబుకెట్టొచ్చినాయి? యాడ మడగట్టి యే భూములు దున్ని ఎంత చెమట గార్చినాడు? అడుగుతావుండా. మునిల్దాన్ని జెప్పు నాయినా...!" అంటుది మనోరంజనవ్వ.

వాళ్ళ జీవితం కథకునికి తెలియంది కాదు. తనకు తెలిసిన వారి జీవితాల్లోని చీకటి

కోణాన్ని సమాజానికి తెలపాలనే మనలను మనోరంజనవ్వ దగ్గరకు తీసుకెళ్తాడు. ఆమె ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి కథకుని దగ్గరే కాదు. మనదగ్గరా సమాధానం వుండదు. అందుకే మాట మార్చి "సార్నక్క యిల్లు మాత్రం యెట్లా మిగిలింది" అంటాడు.

''యెట్లంటావా... ఆ అమ్మాకూతుళ్ళు అంతనోళ్ళు బెట్టుకోబట్టే కదా!" అనోరేగన లేకుంటే ఆ జానెడునేలయినా మిగిలిణ్ణా ఆ సార్నమ్మకి" అంటుంది.

చివర్లో మనోరంజనవ్వ "ఆయమ్మి సార్ణ ఈ దినాన బిడ్డకింత పెట్టి తనింత కడుపుకు తింటా వుండాదంటే ఆనోటివల్లనే గదా! నోరు బెట్టుకోకపోతే ఈ వూళ్ళో నిల్వనీడుణ్ణా ఆయమ్మికి? యీ పొద్దుటికి కూడా ఆయమ్మి మానంగా బతకతా వుండాదంటే ఆ నోటివల్లే నాయినా... ఆనోరేగన నాగ్గూడా వుణ్ణుంటేనా". అంటుంది.

ఈ కథలో మనోరంజనవ్వ మూడు తరాల జీవితానికి ప్రతినిధి. వృత్తిని పోగొట్టుకుని, వుయ్యాలబల్లను, బోసాణం పెట్టెను అమ్ముకుని, వున్నయింటిని కోల్పోయి అనాధలుగా మారిన భోగం వాళ్ళ జీవన విషాద చిత్రమిది.

స్త్రీలను, స్త్రీల మనస్సును అర్థం చేసుకున్నది మనోరంజనవ్వ.

బిడ్డలుగల్ల తల్లి కథలో, వెంకునాయుడిది కష్టంజేసిన వొళ్ళు. ఒడ్డూ, పొడుగూ మనిషి. విసుగుపుట్టి కిరీటం తీసి పక్కన పెట్టిన మహరాజులాగా ఠీవిగా వుంటాడు అంటాడు రచయిత. అటువంటి వాడితో రాజమ్మ లేచిపోయింది. దీన్ని సమర్థిస్తున్నట్టుగా "అట్టాంటి మొగోడ్ని చూస్తే ఏ ఆడదానికైనా మనసు పుట్టకుండా వుండునా ఏమి?" అంటుంది మనోరంజనవ్వ.

మనోరంజనవ్వ స్త్రీల మనసుకు దర్పణం.

ఉమామహేశ్వరరావుకు మనుషులంటే ప్రేమ, ప్రాణం. ఎంతంటే మాటల్లో చెప్పలేనంత. అందుకే ముక్కుపుల్ల కథలో బంధువుకాకపోయినా చిన్నప్పుడు పాలుతాపిన సుబ్బమ్మ చనిపోతే వలవలా ఏడుస్తాడు. ప్రేమకు బంధువే అయ్యుండాల్సిన అవసరం లేదంటాడు. మొగుడూ పెళ్ళాల ప్రేమకతలో ఒకచోట 'మా సోంబావకీ మాకూ చుట్టరికం యేదీలేదు. వరుసలు కలుపుకోవడానికి మావూళ్ళో మాకు కులాలు బంధుత్వాలూ అవసరంలేదు' అంటాడు.

వీరి ఏడు కథల్లో ఐదు కథలు ప్రథమ పురుషలో వున్నాయి. మంచివాడు కథలో మాత్రం రచయిత పాత్రలేదనిపిస్తుంది. మిగిలిన అన్ని కథల్లో నేను అనే పాత్ర రచయితే అనేది స్పష్టంగా తెలుస్తుంది. ముక్కుపుల్ల కథలో నేరుగా తన పేరుతోనే పాఠకుల ముందుకు వచ్చి నేనును. కథకుడు వేరు కాదు అని చాటుకుంటాడు. తను, తన కుటుంబం, తన వూరివాళ్ళను దాటి కథల కోసం బయటకు పోడు. అందుకే సుదీర్ఘకాలంలో అతి తక్కువ కథలు రాశాడు.

ఈయన మాండలికాన్ని ప్రతిభావంతంగా వాడుకున్నాడు. తన మొదటి కథ నుంచీ సంభాషణల్లో మాండలికాన్ని రాశాడు. మనుషుల్ని, వాళ్ళ వయసుల్ని, వృత్తుల్ని బట్టి మాండలికం వుండే తేడాలను స్పష్టంగా చూపాడు.

మొగుడూ పెళ్ళాల ప్రేమకథలో కథకునితో "కొంపాగోడూ నువు సారాయంగిడికి దారపోస్తివి. యింకెట్ట బతికేది. నడిరోడ్డున బడితిమి. యింకనయిప్పుడు బట్టుకోని - నువ్వావోడితో మాట్లాడగూడ్దు, యీడితో మాట్లాడగూడ్దు అంటే యెట్ట జరుగుతాది? తీరుగా తలకి సవురుబెట్టుకోని జడేసుకుంటే తిడితివి! మంచిగుడ్డ కట్టుకుంటే అనరాని మాటలంటివి" అంటుంది సార్ణక్క.

సార్ణక్క తన భర్త చేష్టలను కథకునికి వివరిస్తోందిక్కడ. చాలా మంది ఆడవాళ్ళు భర్తలను ఏమీ అనలేకుండా వుంటారు. కానీ మనసులో భర్తచేసే తప్పులను నిలబెట్టి అడగాలనుకుంటావుంటారు. ఎవరన్నా తమగోడు వినేవాళ్ళు దొరికితే భర్త నుంచి తాము ఎదుర్కొంటున్న హింసను, భర్తను తాము అడగాలనుకున్న మాటలను ఏకకాలంలో పై విధంగా మాట్లాడతారు. దీన్ని రచయిత చాలా బాగా తనకథలో వాడుకున్నాడు. ❖

---

ఒకసారి రాత్రిని చూస్తే ఆశ్చర్యం
ఎలా చీకట్లో నడవగలుగుతుందాని
పగలును చూస్తే జాలేస్తుంది
కబోదిలా ఎందుకు ప్రయాణిస్తుందాని
చీకటి వంచన తెలిసి
ప్రమత్తం అప్రమత్తమే
భయమంతా పగలు గురించే
ప్లాస్టిక్ పూలలో పుప్పొడి రేణువులు
పుట్టించిన సృష్టికర్త మానవుడు
ఒకసారి సరళరేఖ
ఒకసారి వక్రరేఖ
ఒకసారి దొంగ
ఒకసారి పోలీసు
ఆనంద భాష్పాల్లో రగిల్చి
కన్నీటి బిందువుల్లో ఆర్పుతాడు!
రాళ్ళతో నిప్పుసృష్టించిన నాటి నుండి
ఆకాశాన్ని ఉయ్యాల చేసుకున్న నేటి దాకా
మార్పుకు రూపశిల్పి!
మనుషుల్లోనూ తరకలు
గాలికి 'పక్షపాతం వుండదు

# నీది కాని మట్టి నీదౌతుంది

**అడిగోపుల వెంకటరత్నమ్**

సిఫార్సుకు తలవంచదు
డబ్బుకు జేకొట్టదు
తాలు భరతం పట్టిన తూర్పార
నిండుగింజలకు నీరాజనం పలుకుతుంది!
ఒక ప్రారంభం
అంతలోనే ముగింపు
ఒక ముగింపు
అంతలోనే ప్రారంభం
ఆరోహణ అవరోహణల మధ్య
మధ్యముల పర్వం!
మట్టికి నువ్వెప్పుడూ దూరం కాదు
ముందున్న మట్టి నీదనుకున్నప్పుడు
నీది కాని మట్టి నీదౌతుంది
నీకు తల్లవుతుంది
నీవు తల్లికి రత్నమౌతావు!

# బతుకు పుట్ట

మల్లంపల్లి విజయకుమార్



బతుకు స్పృహ గుర్తించనపుడు
మనిషి ప్రక్కనే వెన్నాడే
కలల్ని పట్టలేం, ఆలోచనల్ని కదల్చలేం
నీవేం కావాలనుకొంటున్నావో
అది వ్యూహంగా నడుస్తున్నట్లనిపిస్తుంది
గతం మెట్ల మీద ఎక్కుతుంటే
మాటల్ని బట్టి వెళ్ళే దారేదో
గుర్తు పట్టొచ్చనే అపోహ ఒకటి
కీలక ఆ గతాల మధ్య
మౌనం రాజ్యమేలుతున్నప్పుడు
నిరాశా రెక్కలు తెగిన
రక్త స్పృహలేని
అమానవ భాషలు
లోలోన మెలికలు తిరుగుతుంటాయి
తుంటరి పక్షుల్లా
అవి ఆకారాన్ని గాలిస్తుంటాయి
అయినా
మానవ జాడ విస్తరించదు
లోన సమస్యల జల ఊరే కొద్దీ
పలుకుల్లాంటి అవయవాల ఆంగిక భాషణల బట్టి
మనిషి కీలక కుశాగ్ర బుద్ధి నిర్ణయమవుతుంది
శబ్దం నిర్వీర్యమైనపుడు
సంభాషణలు ముసుగులైనపుడు
ఇపుడేం నిర్ధారణలతో
మానవ ప్రవర్తనా సూత్రాలు నిర్మితమౌతాయి?
పది తలల రావణుల్లా
బతుకు తెరువు
పది నాలుకలైనపుడు
ఇపుడు నిమేషమంతా
నిర్మస్తక మదన శోధనం వృధా...
అవును
మనిషి వాసనే పుట్టుకను గుర్తిస్తున్నప్పుడు
తిరిగి, మనిషే మనుగడకు మసిబూస్తున్నప్పుడు
నేను మానవ శరీరంలో
రకరకాల విన్యస్త సామగ్రుల మధ్య
విలువల గుండెనే ఒడిసి పట్టుకొంటాను
నాకిపుడు
వేళ్లు ధరించిన మనుగడ కింద
మనిషి పాదాలు నిర్జీవ మవుతున్నాయి
మనిషి వినా జీవంలేని ముడి
విప్పని ఆలోచన ఏది?
మనిషి వినా నా కంటికి అందమైన స్పర్శానుభూతి ఏది?

---

# రైతు హైకూలు

జి. వెంకటకృష్ణ



నేల ప్రసవించి
మొలకలు పులకలు
ముంగారుపైరు

విరగ గాచి
గంపలు గంపలు పళ్ళు
రైతు కలలు

సంతల నిండా
ఆశపడిన కళ్ళు
టమోటా పళ్ళు

గిట్టే ధరలా?
మధ్య దళారీ కుట్రలా?
రైతు పంటకు!

దళారీ కళ్ళ
దిష్టి తగిలి ధరలు
పాతాళంలో

అమ్ముడుపోదు
ఇంటికీ చేరదు
రైతు కష్టం

శ్రమఫలాలు
చెల్లని చిల్లిగవ్వలు
వుక్రోషంపాలు

బజారుపాలు
బళ్ళకొద్దీ పంట
రైతుశోకాలు

రైతుబతుకు
తాలునిండిన పంటలా
వీధిపాలు

రైతుశోకం
పల్లె బతుకుదైన్యం
అనంతానంతం

---

# హైకూలు

కె. నవీన్

చెట్ల
కాస్ట్యూమ్ డిజైనర్
వసంతం

ఆకుల్ని
ఎత్తుకెళ్ళే దొంగ
శిశిరం

తోట మీద వాలిన
ఇంద్రధనుస్సు
సీతాకోకల గుంపు

ఆకాశం చేతుల్లో
టార్చ్‌లైట్లు
నక్షత్రాలు

భద్రత కప్పని
మింగేసిన
కాంట్రాక్ట్ పాము

# సమీక్షా పర్వం

✦ జీవన స్పర్శ
✦ మంత్రనగరి
✦ జగడం
✦ 2003 తెలంగాణా కథ

జి.వి.




## పలు జీవన పార్శ్వాల స్పర్శ

గ్రామీణ నేపథ్యం కలిగిన ఓ పట్టణ ప్రాంత మధ్యతరగతి మహిళ, ఉద్యమాల అనుభవం కూడ కలగలిపి, ఫలితంగా తాను చూసిన, పరిశీలించిన పలు జీవన పార్శ్వాలను హృదయంతో స్పృశించిన కథల సంకలనం ఇది. మారుతున్న సామాజిక ఆర్థిక పరిస్థితులు, వాటి కుటుంబ సంబంధాలలోను, వ్యక్తుల మధ్య సంబంధాలలోను వస్తున్న పెను మార్పులు, వాటి పట్ల ఓ స్త్రీగా ఆమె పడే ఆవేదన, అంతస్సంఘర్షణ, వాటికి పరిష్కారం కనుగొనాలన్న తపన ఈ కథల్లో నిండుగా ప్రతిఫలిస్తుంది.

నల్లూరి రుక్మిణి గారి ఈ కథలన్నీ వేటికవే బావున్నాయి. అయినప్పటికీ మరిచిపోలేనివి, హృదయాన్ని కదిలించేవి, కలిచివేసేవి కొన్ని ఉన్నాయి. వాటిలో ముందుగా చెప్పాల్సింది **'కడపటి కాపలా'** గురించి. తన పేర ఎలాంటి ఆస్తిగాని, నగలు గాని లేని అత్తగారు అవసాన దశలో ఎంతటి హీన స్థితిని అనుభవించిందీ స్వయంగా చూసిన రత్తమ్మ మానవతా దృష్టితో ఆమెకు సేవలు చేసినప్పటికీ తాను మాత్రం అలాంటి దుస్థితికి లోనుకాకూడదని సర్వహక్కులతో కొంత భూమి తన పేరున పెట్టాలని కొడుకులు ఆస్తులు పంచుకునే సమయంలో పట్టుబట్టి సాధించుకుంటుంది. స్త్రీ అంతరంగాన్ని ఆవిష్కరించే మరో కథ **'కొత్త మోసులు'**. బ్రతికినంత కాలం వేధించుకుతిన్న భర్త రోగంతో తీసుకుని చనిపోయిన తర్వాత భానుమతి అనే మహిళ తన మనసుకు నచ్చిన విధంగా జీవించడం ఈ కథ. తాను అలా స్వతంత్రంగా ఉండటమే కాకుండా తన కూతురు తన కాళ్లపై తాను నిలబడాలన్న ముందు చూపుతో కాలేజీలో చేర్పిస్తుంది. దీన్నంతటినీ ఆమె కొడుకే వ్యతిరేకిస్తాడు. అయినా ఆమె లెక్కచేయదు.

విదేశాల్లో చదువులు, ఉద్యోగాలు వాటితోపాటు పెరిగే ధనాపేక్ష, కుటుంబ సంబంధాలలో వచ్చేమార్పులు గురించి అనేక కథలు సోదాహరణంగా తెలియ చేస్తాయి. అభ్యుదయ భావాలతో పెరిగిన తన పిల్లలు సైతం అమెరికా గురించి ఎంతో ఉన్నతంగా చెబుతుంటే ఓ తల్లి పడే ఆవేదన **'దూరపు కొండలు'** కథలో రచయిత్రి సమర్థవంతంగా చిత్రించారు. అలాగే కొడుకును అమెరికా పంపడానికి నిండా అప్పులు చేసి ఆ కొడుకు తండ్రిని, ఇంటిని పూర్తిగా మరిచిపోతే దివాళా తీసిన ఓ రైతు కథ **'పందేలాట'**. అమెరికా నుండి కొడుకు డబ్బు పంపిస్తే దాన్నంతా ఆస్తులు కొనడానికి, ఇళ్లు కట్టడానికి ఖర్చుపెట్టిన ఓ తండ్రి కథ **'మిడిసిపాటు'**. అమెరికాలో ఉద్యోగాలు కోల్పోయి చాల మంది వెనక్కి వస్తుండటంతో, తన కొడుకు కూడ ఎప్పుడు వస్తాడో, వచ్చి తాను పంపిన డబ్బంతా ఏం చేశావని అడిగితే ఏం చెప్పాలని ఆందోళన చెందుతుంటాడు ఆ తండ్రి. కొడుకులు అమెరికాలో ఉన్నారని వాళ్ల అవసరాలు తీర్చడం కోసం కట్టుకున్న భర్తను కూడ అలక్ష్యం చేసిన ఓ మహిళ కథ **'పోగులు తెగిన అల్లిక'**.

ఉద్యమాలు వాటి కష్టనష్టాల గురించి కూడ రెండు మూడు కథలున్నాయి. మొత్తంగా ఈ కథా సంకలనం రకరకాల జీవితానుభవాలను మన ముందుంచుతుంది. కె.శివారెడ్డి ముందుమాట ఈ సంకలనానికి అదనపుహంగు. అలాగే రఘోత్తమ రెడ్డి పరిచయం కూడ. వస్తురీత్యా చక్కటి వైవిధ్యం కలిగిన ఈ కథల్లో కొన్నింటిలో శిల్ప

పరిపుష్టత తగినంత లేదనిపిస్తుంది. అయితే రచయిత్రి గత సంకలనం కన్నా ఇది ఎంతో పరిణతి, పరిపక్వత కలిగిఉందని శివారెడ్డి పేర్కొన్నారు.

జీవన స్పర్శ, నల్లూరి రుక్మిణి కథలు, ప్రచురణ : విప్లవ రచయిత సంఘం, గుంటూరు, వెల : రు.50, ప్రతులకు : ప్రముఖ పుస్తక విక్రేతలందరు.

పి. గోపాలకృష్ణ




# కొత్త ప్రశ్నల సంపుటి 'మంత్రనగరి'

కొత్తసందర్భాలు ముందుకొచ్చినప్పుడు సహజంగానే కొత్త ప్రశ్నలు తలెత్తుతాయి. కానీ ఒక్కోసారి పాత సందర్భాలుగా మనం యెంచేవి కూడా అంత దాకా మనం గుర్తించలేకపోయిన, తొలగ దోసేస్తున్న ప్రశ్నల్ని కొత్తగా లేవనెత్తుతుంటాయి. పాత సందర్భాలంటే సామాజిక జీవితపు పొరల్లో నిశ్శబ్దంగా పడి ఉంటూ, మనం గుర్తించలేనంతగా అరిగిపోయి అలవాటైపోయి, మనం 'మామూలు విషయాలు'గా ఆపాదిస్తున్నవి - పి. సత్యవతి 'మంత్రనగరి' కథల్లో అటు కొత్తగా కొన్ని ప్రశ్నల్ని ముందుకు తెస్తూ, ఇటు కొత్తగా గుర్తింపుకొస్తున్న పాత ప్రశ్నల్ని కూడా లేవనెత్తుతున్నారు. మనుషుల మధ్య సడలిపోతున్న, సన్నగిల్లుతున్న సజీవ సంబంధాలను మళ్ళీ నిలబెట్టి గట్టి పరచాలన్నదే ఈ కథల లక్ష్యం, ఇతివృత్తం. "మనుషులందర్నీ వర్గాలుగా, మతాలుగా, కులాలుగా, శాఖోపశాఖలుగా, ఆడగా, మగగా, చిన్న వాళ్ళుగా, పెద్ద వాళ్ళుగా వీలైనన్ని ముక్కలుగా విడగొట్టి ఎవరి చుట్టూ వారికి పరిధులు నిర్మించి అందులో వాళ్ళను బంధించి, వాళ్ళు అవి దాటిపోకుండా కాపలా కాసే "వ్యవస్థ మీద ఈ కథలు కోపాన్ని వెళ్ళగక్కడం కాదుగానీ, ఫిర్యాదు చేస్తాయి. ఈ పరిస్థితికి మూలకారణం డబ్బు అని కూడా ఈ కథల్లో రచయిత్రి గుర్తించగలిగారు. మనుషుల మధ్య ఉండాల్సిన స్నేహబంధం విడిపోతూ డబ్బులావాదేవీలు పెరగడం, భార్యాభర్తల మధ్య, తండ్రీకొడుకుల మధ్య, తల్లీ కూతుళ్ళ మధ్య సహజంగా ప్రవహించాల్సిన ప్రేమ ఎండిపోయి డబ్బు గోడలు లేవడం, మానవ సంబంధాలు కృత్రిమం, యాంత్రికం కావడం ఈ కథల్లో చర్చకు వస్తాయి.

'మంత్రనగరి'లో మొత్తం పన్నెండు కథలున్నాయి. దాదాపు అన్నిటిలోనూ ఉన్నవి స్త్రీ జీవితమే. భార్యాభర్తల సంబంధాల్లో, కుటుంబ బాధ్యతల్లో, పిల్లలు పెంపకంలో, పిల్లల పెద్దరికాల్లో స్త్రీ కోల్పోతున్న అస్తిత్వం ఈ కథల్లో ప్రధాన వస్తువు. దీన్నే **'సూపర్ మామ్ సిండ్రోమ్'**లో ప్రతీకాత్మకంగా రచయిత్రి సూచిస్తుంది. అనురాధ చనిపోగా శవం సున్నంగా మారిపోవడమనే 'సింబల్' ద్వారా ఆమె జీవితాన్ని, అందులో ఆమె తనకు తెలియకనే కోల్పోయిన జీవితాన్ని గురించి వివరిస్తుంది. అది సున్నం కాదు. తన కుటుంబ సభ్యుల ఆనందం కోసం, సౌకర్యాల కోసం, అభివృద్ధి కోసం అన్నీ యిచ్చి, సమకూర్చే క్రమంలో "తన మనసుకేం కావాలో, తన శరీరానికేం కావాలో" కూడా చూసుకోకుండా, శిథిలమవుతున్న యంత్రాన్ని టాబ్లెట్లతో పని చేయిస్తూ చివరికి సున్నంగా మారిపోయింది. అదంతా తన గొప్పతనమని, త్యాగమని, ప్రేమ అని ఆమె భావించింది. తమ తల్లి తల్లులకే తలమానికమని బిడ్డలు అనుకొన్నారు. ఇందులో నష్టపోయిన జీవితం గురించి ఎవరూ పట్టించుకోలేదు.

ఇట్లా కథను ఒక సింబల్‌తో ముడిపెట్టి దానితో కథ నడుపుతూ, మళ్ళీ దాన్నే వాస్తవిక స్థితిగా వర్ణించడం ఈ కథల్లో రచయిత్రి అనుసరించిన ఒక 'టెక్నిక్'. మహలక్ష్మమ్మ తులసికోట గట్టున కూచోని కన్నీళ్ళు కారిస్తే అవి చెరువు కాగా, ఇంటి ఆడవాళ్ళు స్నానాలు చేసేవారు. బట్టలు ఉతుక్కొనేవారు. పిల్లలు ఈత కొట్టే వారట! గోవులు యింటికొచ్చేవేళ **'గోధూళివేళ'** - అది మహలక్ష్మమ్మ కాలంలో - కానీ ఇప్పుడు ఆఫీసుల నుంచి, కాలేజీల నుంచి ఉద్యోగినులు హడావుడిగా యిళ్ళకు చేరే వేళ గోధూళివేళ; ఆలస్యం అయితే సంజాయిషీ యిచ్చుకోవలసినవేళ. "దారిలో కూరలు, పిల్లలకి చిరుతిళ్ళు, వృద్ధులకు మందులు కొనడానికి ఓ అరగంట పడితే దానికి సంజాయిషీ ఉంటుంది. బస్సులు అందబోతేనూ, ఫ్రెండ్‌ని పలకరిస్తేనూ సంజాయిషీ ఉండదు".

**'పహరా'** - మనిషికీ మనిషికి వుండే అద్భుతమైన సంబంధం స్నేహం. దాన్ని గుర్తించలేక, ఒక మనిషిలో నుంచి మరో మనిషిలోకి ప్రేమను, జ్ఞానాన్ని ప్రసరించనివ్వకుండా, జీవితాల్ని సంకుచితం చేసే 'సాంస్కృతిక పెత్తందారీతనాన్ని' స్త్రీలను పహరాల్లో బంధించకపోతే 'చెడిపోతార'ని భావించే పురుషాహంకారాన్ని ఈ కథ నిలదీస్తుంది. **'ఎచటికి పోతావీ రాత్రి'**లో మరో రకం శాసనం. 'నీ కొడుకు చెప్పినట్లు విను, మీ అమ్మ చెప్పినట్టు విను, నీ మొగుడు చెప్పినట్లు వింటూపో, సున్నేజాన్! ఇస్ మే హై తుమ్హారీ భలా". డబ్బు దాచుకొంటే చాలు, ఇల్లు కొనుక్కొంటే చాలు. దేనికీ కొరగాని సేవలెందుకు? ఆలోచించవద్దు. అవతలి వైపు చూడొద్దు. రోజూ మంటల్లో కాలిపోతేనీకేం, మైథిలి ఫ్యాన్‌కి వేళ్ళాడితే నీకేం. రేపు నీ కొడుక్కి చదువు కొనడం గురించి, నీ కూతురికి మొగుణ్ణి కొనడం గురించీ ఆలోచించు, చాలు" అనే పెత్తందారీతనాన్ని ఈ కథ ప్రశ్నిస్తుంది.

**'ఇరుకు'** కథ ప్రపంచం చిన్నదైపోయిందనుకొనే కొద్దీ బతుకులు ఇరుకు కావడం గురించి చెబుతుంది. ఎవరికి వారు తమకే పరిమితం చేసుకొనే బతుకులు - తల్లితండ్రులను కూడా తమ అవసరాలకు తప్ప ప్రేమతో చూడలేని ఇరుకు బతుకులు. మనుషులు వాళ్ళచుట్టూ వాళ్ళు తిరుగుతూ డబ్బు చుట్టూ' తిరుగుతున్నారు. మనుషుల విలువ తరిగిపోయి. వస్తువుల విలువ పెరుగుతోంది, ఇళ్ళు ఇరుకవుతున్నాయి, వాటితోపాటు మనసులూ ఇరుకైపోతున్నాయి. ఈ పరిస్థితిలో "ప్రపంచం చిన్నదైందా, లేక ఇరుకైపోయిందా?" అనే ప్రశ్న ఎదురవుతోంది.

మరో మంచి కథ **'పతిభక్తి'** - అంటే పతి మీద భక్తి మాత్రమేకాదు, పతిదేవుడి దైవభక్తిని కూడా భార్య భరించాల్సి రావడం. తాగుబోతు భర్త అయ్యప్ప దీక్ష తీసుకొని నియమాలు పాటించడం అతనికి బాగానే ఉంది, కానీ భార్యకు చాకిరీ రెండింతలు కావడం, భర్త దీక్ష కోసం ఆమె తన శరీరాన్ని మనస్సును కూడా కష్టపెట్టాల్సి రావడం - ఈ క్రమంలో 'దీక్ష' అతనికో సరదా కాగా, ఆమెకొక వ్యథ అవుతుంది. ఓ నలభైరోజులు బూతులు, సారాయికంపు లేదనే కానీ, వాటి కోసం ఆమె వెచ్చించింది తక్కువ కాదు. అయినా ఈ భక్తివల్ల తనకు

లాభమేమిటన్న ప్రశ్నకు సమాధానంలేదు. మనుషుల్లో నలభై రోజులు మార్పు, తర్వాత మళ్ళీ ఎప్పటి కంపు. కొత్త ప్రశ్నలు లేవనెత్తే పాత సతీసుమతి కథ.

**'అవకాశాల కోసం'** యువతరం అమెరికాకు ఎగబడడాన్ని **'తిమింగల స్వర్గం' 'మంత్రనగరి'** కథల్లో రచయిత్రి సున్నితంగా విమర్శిస్తుంది. రెండూ ప్రతీకాత్మక కథలే. 'తిమింగల స్వర్గం' ఇంపోర్టెడ్ గుండె, మెదడు అమర్చడం లాంటి ప్రతీకలతో కథ ఆద్యంతం నడుస్తుంది. అమెరికాను పెద్ద తిమింగలంగా వర్ణిస్తూ, అది చాలా మందిని మింగేసిందని, అక్కడ వాళ్ళందరూ తమ "మెదళ్ళను, హృదయాలను తీసిపడేసి తాము కండిషన్ చేసి వుంచిన మెదడు, గుండెలను అమర్చుకొంటున్నార"ని రచయిత్రి భావం. 'మంత్రనగరి'లో కూడా అమెరికాలో స్థిరపడి కొత్త వ్యాపార సంస్కృతిని అలవర్చుకొంటూ "ప్రపంచాన్నంతటినీ ఒక చోట చేర్చే "మనీపవర్‌ని గౌరవించాలని భావించే యువతుల్ని గురించి చెబుతుంది. ఈ సందర్భంలో రచయిత్రి నాణానికి ఒకవైపు మాత్రమే చూస్తున్నట్లనిపిస్తుంది. యువతరం 'అవకాశాల కోసం' విదేశాలకు ఎగబడుతున్నారంటే, అది వాళ్ళ తప్పు అవుతుందా? అట్లాంటి పరిస్థితులు మన సమాజం కల్పించబట్టే వాళ్ళు మరోవైపు ఆకర్షితులవుతున్నారన్న వాస్తవాన్ని గుర్తించనక్కర్లేదా? వాళ్ళ పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకోనవసరంలేదా? ఒకవైపు ఈ వలసను తప్పుపడుతూనే ఇంకోవైపు **'ఒక వసుంధర'** కథలో కొడుకు యింట్లో పని మనిషిగా ఉండలేక, రహస్యంగా పొరుగింటావిడ సాయంతో అమెరికా వెళ్ళి 'ఆయా'గా స్థిరపడిన అమ్మ మీద రచయిత్రి సానుభూతి చూపుతుంది. ఈ వైరుధ్యం అర్థంకాదు.

**'ఆజాదీ'** కథకు ఎక్కువ, నవలకు తక్కువ. ఇందులోనూ "రక్త సంబంధాలలో ఆర్థిక కాలుష్యాలు చోటు చేసుకొంటున్న సందర్భమే" ఇతివృత్తం. పాత్రలు, సంఘటనలు ఎక్కువైపోవడంవల్ల, చెప్పదలచుకొన్నది బలహీనపడి, కథ చిక్కుపడిపోయింది.

అన్ని కథలకూ నేపథ్యం స్త్రీవాదమే అయినా, రచయిత్రి పనికట్టుకొని తన వాదాన్ని ప్రొజెక్టు చేసినట్టు అనిపించకపోవడం కథలకు బలాన్ని, విశ్వసనీయతను కలిగించాయి. మానవ సంబంధాల్లో సహజమైన ప్రేమానుబంధాలు పోయి, అన్ని బంధాలూ డబ్బుతో ముడిపడడంవల్ల ఎక్కువగా నష్టపోతున్నది స్త్రీయేనని రచయిత్రి దాదాపు అన్ని కథల్లో ప్రతిపాదించారు. అయితే అందుకు ప్రధాన కారణం అర్బనైజేషన్ అనే అభిప్రాయాన్ని కూడా రచయిత్రి సూచిస్తారు. ఉమ్మడి కుటుంబాలు, పల్లె వాతావరణాలకు రచయిత్రి ఇష్టపడడం వరకు బాగానే ఉంది కానీ అని మాత్రం డబ్బు ప్రభావానికి లోనుకాలేదా? ఏ ప్రభావానికైనా వ్యవస్థ మొత్తంగా లోనవుతుంది కానీ, పల్లెలు, పట్టణాలనే తేడాలుంటాయా?

మొత్తం మీద 'మంత్రనగరి'ని తెలుగుకథను మరింత సంపన్నం చేసే కథా సంపుటిగా పేర్కొనవచ్చు.

**మంత్రనగరి- పి. సత్యవతి కథలు. పేజీలు 117, వెల : రు.40/-, ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, దిశ పుస్తక కేంద్రం.**

---

**కె.పి. అశోక్‌కుమార్**




# వన్ మాన్ షో

నిత్య దారిద్ర్యాన్ని, వర్ణ విపక్షతను అధిగమించి ఉన్నత స్థాయికి ఎదిగిన ఒక దళిత ఆదర్శమూర్తి కథే "జగడం" నవల.

దారిద్ర్యంలో, వెట్టిచాకిరిలో మగ్గిపోయే దళిత బాలురకు ప్రభుత్వ సంక్షేమ పథకాలు కొంత అండగా నిలిచాయి. తినడానికి తిండిలేని పరిస్థితుల్లో, రెక్కాడితేకాని డొక్కాడని పరిస్థితుల్లో సాంఘిక సంక్షేమ హాస్టళ్ళు వారికి ఒక దారి చూపాయి. అవి ఎలాగుంటాయో వాటి సమాచారం కూడా తెలియని స్థితిలో ఊరిలో వున్న రాజయ్యను అతని స్నేహితుడు లక్ష్మీపతిని ఒక ఆబ్కారీ జవాను నల్గొండ తీసుకుపోయి స్కూళ్ళు, సంక్షేమ హాస్టల్‌లో చేర్పిస్తారు. చదువుల మీద ఆసక్తి వున్న రాజయ్య అక్కడి గ్రంథాలయాధికారి మిత్ర వల్ల అంబేద్కర్ సిద్ధాంతాలతో ప్రభావితుడవుతారు. డిగ్రీ పూర్తి చేసిన తర్వాత లక్ష్మీపతి ఇంటి పరిస్థితులవల్ల ఉద్యోగంలో చేరడం, పెళ్ళి చేసుకోవడంతో అతడి ఎదుగుదల అక్కడే ఆగిపోతుంది. రాజయ్య మాత్రం హైదరాబాద్ వచ్చి లా పూర్తి చేసుకొని ప్రాక్టీసు పెడతాడు. దళితుల హక్కుల కోసం పోరాడడంతోపాటు దళితులపై జరిగే అత్యాచారాలు – అన్యాయాలను ఎదుర్కోవడంలో వృత్తిపరంగా ఎప్పుడూ ముందుంటాడు. కారంచేడు, చుండూరు దళితుల తరపున పోరాడి వారికి న్యాయం జరగేట్టుగా కృషి చేస్తాడు. విమల అనే జోగినికి విముక్తి కలిగించి ఆమెకు కర్తవ్యాన్ని బోధించి ఒక కొత్త జీవితం వైపు మళ్ళిస్తాను. విమల విషయంలో ప్రత్యర్థులు నిందవేసి కోర్టుకు గుంజినా భయపడలేదు సరికదా ఆమెను భార్యగా స్వీకరించి ఆదర్శప్రాయంగా నిలుస్తాడు. రాజయ్య సేవానిరతి, ప్రజల్లో అతనికి వున్న పలుకుబడి చూసి రాజకీయ పార్టీలు అతడ్ని తమ అభ్యర్థిగా ఎన్నికల్లో నిలబెడదామని ప్రయత్నిస్తే "నాయకుడిగా వుండి ప్రజలకు దూరం కావడం కంటే, ప్రజలకు సన్నిహితంగా వుండి వారి బాగోగుల కోసం పోరాడటమే మంచిది" అని నిర్ణయించుకోవడంతో నవల ముగుస్తుంది.

ఇందులో చిన్నప్పటి నుండి రాజయ్య తన చుట్టుపక్కల తన గూడెంలో జరిగే సంఘటనల నుండి హేతువాద దృక్పథాన్ని పెంపొందించుకోవడాన్ని చాలా సహజంగా చిత్రీకరించారు. దేవుడి పెళ్ళి పేరుతో బొమ్మల పెళ్ళిని వైభవంగా జరపడం, దురాచారాల పేరిట వృథా ఖర్చును పెంచడం, జంతుబలులను నిరసించడం, జోగినీ వ్యవస్థతోపాటు ఆశ్రిత కులాల పేరిట కొనసాగే భయంకర వివక్షతను ఖండించడంతోపాట వాళ్ళ అభివృద్ధి కోసం తాపత్రాయపడటం పాఠకులను ఆకట్టుకుంటుంది.

రాజయ్య పాత్రద్వారా ఈ నవల అరవై ఏళ్ళ తెలంగాణా జన జీవితాన్ని ప్రతిబింబించగలిగింది. అప్పటి తెలంగాణా గ్రామాల్లో భూస్వాములు కొనసాగించిన నిరంకుశ పెత్తందారీ విధానాలు, దళితులపై కొనసాగించిన ఆర్థిక, లైంగిక దోపిడీని, వర్ణ వివక్షతను రాజం బాల్యంలోనే పసిగట్టగలిగాడు. రజాకార్ల ఆగడాలు, తెలంగాణా సాయుధ పోరాటంతో అల్లకల్లోలమైనా తెలంగాణా జీవితాన్ని రాజయ్య జ్ఞాపకాల్లోంచి మనం చూడవచ్చు. రాజం లా చదువుతూ ప్రత్యేక

తెలంగాణా ఉద్యమాన్ని ప్రత్యక్ష సాక్షిగా వివరిస్తారు. ప్రాక్టీస్ చేస్తూ కారంచేడు, చుండూరుల దురాగతాలను, బి.ఎస్.పి. రాజకీయాలను జగజ్జీవన్‌రాయ్-కాన్షీరామ్‌ల గొప్పతనాన్ని తెలియజేస్తారు. అయితే ఈ నవలలో మొదటి నుండి చివరి వరకు తెలియజేసిన ఏ రాజకీయ ఉద్యమం కానీ, సంఘటనలు కానీ రాజయ్యను ప్రభావితం చేయవు. అందుకే వాటిని ఊరకే ఏకరువు పెడుతూ పోవడంవల్ల నవల సాధించిన అదనపు ప్రయోజనం ఏమీ లేదు. విశ్లేషణా రహితమైన ఈ సమాచారం ప్రధాన ఇతివృత్తం పొడిగింపుకే ఉపయోగపడింది. అందుకే వర్ణన దారి వర్ణనది, నాయకుడి దారి నాయకుడిది అయింది. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు ప్రాథమిక విద్యలో ప్రవేశించిన రాజయ్య, ప్రత్యేక తెలంగాణా ఉద్యమమప్పుడు 'లా' చదవడం, మండల్ కమీషన్ అప్పుడు పెళ్ళి కావడం, ఇలా అన్నింటా ఆలస్యమే కావడానికి కారణం. పాత్రకు, కాలానికి మధ్య సరైన సమన్వయం లోపించడంవల్లనే అని మనం అర్థం చేసుకోవచ్చు. శిరీష రాజయ్యను ప్రేమించడం, దూరం కావడం అంతా ఏకపక్షమే. శిరీష ప్రేమకు స్పందించని, ఆమెను పెళ్ళి చేసుకోవడానికి ముందుకురాని రాజయ్య, ఆమె పెళ్ళి వేరొకరితో జరగడంతో - పెళ్ళి అనగానే కులం, గోత్రం జ్ఞాపకం వస్తాయనడం, ఐ.ఎ.ఎస్. మొదలైన పైస్థాయి దళితులను పెళ్ళిపేరుతో బ్రాహ్మణ స్త్రీలు ట్రాప్ చేస్తారని వ్యాఖ్యానించడం ఆ పాత్ర స్థాయికి తగినట్లుగా లేదు. అలా కాకుండా, శిరీష, రాజయ్య. మధ్య ప్రేమ చూపించి, కులం పేరుతో దూరం కావడాన్ని చూపించినా బాగుండేది. అయినా గాఢంగా ప్రేమించిన శిరీష కులం సాకుతో, ఇంట్లో వాళ్ళ ప్రోద్బలంతో వేరే పెళ్ళి చేసుకుంటానని రాయడం కూడా అంత కన్విన్సింగ్‌గా లేదు. లక్ష్మీపతి, మిత్ర, శిరీషతోపాటు ఇందులో వున్న ప్రాతలన్నీ రాజయ్య గొప్పదనాన్ని ఎలివేట్ చేయడానికే ప్రయత్నిస్తాయి తప్ప వాటిలో స్వంత వ్యక్తిత్వం వున్నట్లు కనిపించదు. అందుకే ఈ నవల అంతా సినిమాటిక్ ట్విస్ట్‌లతో వన్‌మాన్ షోగా తయారయింది.

**'జగడం' డా॥ బోయజంగయ్య, బోజ పబ్లికేషన్స్, నల్గొండ, వెల:రు.100/-, పేజీలు 209. అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో లభిస్తుంది.**

---

**• డా॥ వెన్నవరం ఈదారెడ్డి**




# తెలంగాణ కథ 2003

కథ ఎప్పుడు ఎలా సాహిత్యంలో పుట్టిందో సరిగా చెప్పడం కుదరదుకాని మనిషి బతుకు వెతల నుండే కథ పుడుతుందని చెప్పొచ్చు. మనిషి వెతను కథగా మలచే క్రమంలో శిల్పం ఆవిర్భవిస్తుంది. వెత ఎంత గాఢంగా వుంటే దాన్ని ఎదుర్కొనే వ్యక్తిలో పోరాటశక్తి ఎంత తీవ్రంగా వుంటే కథ చెప్పడం అంత బాగా కుదురుతుంది. కథ చెప్పే పద్ధతినే శిల్పం అంటాం. వెతే కథ అన్నది ఉన్నతస్థాయి అనుభూతి దశ.

తన 'అదాలత్ కథల' ద్వారా రచయితగా తన స్థానాన్ని పదిలపరుచుకున్న కర్ర ఎల్లారెడ్డి తెలంగాణ రచయితల కథల నుండి పన్నెండు మంచి కథలను డాక్టర్ అంపశయ్య నవీన్, డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డిగార్ల నిర్దేశనంలో ఎంపిక చేసి 2003 తెలంగాణా కథను ప్రచురించి శ్లాఘనీయమైన పని చేశారు.

ఇందులో పన్నెండు కథలున్నాయి. ఇందులో 'భాషా సౌందర్యం' అనే పేరుతో శ్రీమతి కె.పద్మలత రాసిన మొదటి కథలో ఆంధ్ర ప్రాంతంలో విద్యావంతులం, సంస్కారులం అని చెప్పుకునే కొందరు తెలంగాణాలోనే ఉంటూ తెలంగాణీయుల నిసర్గసుందరమైన సహజమైన భాషలోని యాసను కించపరిచే విధానాన్ని తెలియచేశారు.

రెండో కథ స్కైబాబ రాసి మొహబ్బత్ 1424 హిజ్రీకథ. ఈ కథలో ఓ ముస్లిం అమ్మాయి, ఓ ముస్లిం అబ్బాయిల ప్రేమముచ్చట్లు 'చాట్'లో తెలంగాణా యాసలో సాగింది. తెలంగాణాలోని ముస్లింల తెలుగుభాష యాస ఎంత ముచ్చటగొలుపుతుందో ఈ కత తెలియజేస్తుంది.

మూడో కథ భాగ్యరేఖ రాసిన 'ఇగురం' కథ. ఓ చదువుకున్న సుజాత అనే వైవాహిక స్త్రీ అత్తతో సమష్టికుటుంబంలో ఇమడలేక 'అలాగ సంసారం' (వేరుపడడం) పెట్టుకోదల్చి లచ్చిమక్క (నాయనమ్మ) దగ్గరికి వచ్చి సలహా అడుగుతుంది. అలాగయితే ఖర్చులు పెరిగి కుటుంబం భారమైపోతుందని, ఉమ్మడి కుటుంబ లాభాలు చెప్పి వద్దంటూ 'ఇగురం' చెబుతుంది. ఇందులో కథనం, సంభాషణలు అన్నీ యాసలోనే సాగినవి. ఇగురం అనే పదం తెలంగాణా యాస సృష్టించుకున్న అద్భుతపదం. ఏ పనైనా ఇగురంతో చెయ్యాలంటారు తెలంగాణాలో. దీన్ని అర్థంలో పట్టించటానికి తెలుగులో సమానమైన పదం తోచటం లేదు. దీనికి టాక్ట్‌ఫుల్ అని కాన్షియస్ అని ఇంటలిజెన్సి అని అర్థం చెబితే సరిపోతుందనిపిస్తుంది. తెలివిగా, జాగ్రత్తగా ముందుచూపుతో పని చేయటాన్ని ఇగురం అనవొచ్చునేమో! బహుశ వ్యవహారం, యవ్వారం, ఇగురం, ఇలా యీ పదం వచ్చివుండవచ్చు. ఏ పదాలైనా 'ఇగురం' అనే పదంలోని గాంభీర్యాన్ని అందుకోలేకపోతున్నాయి.

నాలుగోకథ బెజ్జారపు రవీందర్ రాసిన 'పోరుపల్లి'. ఇందులో నర్సవ్వ, లచ్చవ్వ అనే స్త్రీలు రాయికంటి అనే ఊళ్ళో నివసిస్తుంటారు. నర్సవ్వకు నారిగాడు అనే కొడుకు, లచ్చవ్వకు ఓ మనుమడు ఉంటారు. బళ్ళో కొమురయ్య మాష్టారు చెప్పే పాఠాలు వీళ్ళ నిత్య జీవితాంశాలకు సరిగా అన్వయించవు. మూడు కాలాల్లో మూడు రకాలైన దుస్తులు వేసుకోవాలి. పోషకాహారం తీసుకోవడంవల్ల ఆరోగ్యం బాగుంటుంది అన్న మాష్టారు సలహాలను అమలు చేయాలంటే వారి బీదరికం ఒప్పుకోదు. కాని ఒక రోజు మాష్టారు పటం వేసి ఝాన్సీలక్ష్మిబాయి కథ చెప్పినాడు. ఆ కథ వింటున్నప్పుడు తన అమ్మమ్మ లచ్చవ్వ కతే జ్ఞాపకం వచ్చింది మనుమనికి. తనకున్న ఎకరం పొలం ఊరిదొర కాజేస్తే ఎన్నో ప్రయత్నాలు చేసినా స్వాధీనం చేసుకోలేకపోయింది. అయితే ఓ సెంటిమెంటును ప్రయోగించి ఆ భూమిని స్వాధీనం చేసుకుంది. ఓ పొత్రాయిని రాత్రి తన భూమిలో పాతిపెట్టివచ్చింది. తెల్లవారి అది బయలుపడడంతో లచ్చవ్వ దాన్నో దేవతగా చేసి పూజించసాగింది. ఆ దేవత జోలికి రావద్దని, నాగుబామును చంపడంవల్ల దొర కోడలు కడుపు పండలేదని భయపెట్టింది. దాంతో దొర ఆ భూమిని వదిలివేసాడు. ఇది ఆ పల్లెలో ఝాన్సీలక్ష్మీబాయి లాంటి వీరకథే. ఇలాంటి లచ్చవ్వలు

పోరుతల్లులుగా తెలంగాణాలో కనబడతారు. ఇది గొప్ప శిల్పంతో రాయబద్ధ కథ.

ముదిగంటి సుజాతారెడ్డిగారు రాసిన కథ 'ముంజులు' ఐదోది. కాలిఫోర్నియా (అమెరికా)లో ఎండాకాలంలో ప్రజలు చల్లని సముద్రతీరాల్లో తిరగడం, స్నానాలు చేయడం, స్విమ్ సూట్లల్లో స్విమ్మింగ్‌పూల్స్‌లో ఈదడం, కోక్‌లు తాగటం, చల్లని కోక్‌గ్లాస్‌లు, ఐస్‌క్రీం కోక్‌లు, కండ్లకు నల్లని రేబాన్ గాగుల్స్, నెత్తిమీద క్యాప్‌లు, ప్యాంట్స్ వేసుకోకుండా తిరగడం, ఇలాంటిది అమెరికాలో ఎండాకాలపు జీవితం.

మరి భారతదేశంలో ఎండల్లో చెప్పుల్లేకుండా ఇటుకలు మోస్తూ, మట్టి తవ్వుతూ, తార్‌రోడ్లు వేస్తారు. ఇది ఎండాకాలంలో తెలంగాణీయుల జీవితం.

ఇలా సామాజిక వాతావరణంలోని వ్యత్యాసాల్ని చెబుతూ దాదాపు 50 సంవత్సరాల క్రితం తెలంగాణాలో ఎండాకాలంలో ముంజలు తింటూ, కల్లు తాగుతూ పల్లెజనం ఎంత హాయిగా జీవించారో ఈ కథ అద్భుతంగా చూపుతుంది.

రవీందర్ అమెరికాలోని ఏర్‌కండిషన్ గదిలో కంప్యూటర్ ముందు కూర్చొని ప్రాజెక్టువర్క్ చేస్తున్నప్పుడు, కంప్యూటర్ స్క్రీన్‌మీద ఒకచోట డా. ప్రమోద్ ముంజాల్ అనే అక్షరాలు కనిపిస్తాయి. ముంజాల్ అనే పదం కనబడగానే తాను తెలంగాణాలో నానమ్మ దగ్గర ముంజలు తింటూ, కల్లుతాగిన విషయాలు మనసులో మెదులుతాయి. ఆ సంఘటనల్ని రచయిత్రి వివరంగా యిందులో చెప్పారు. సైకాలజీలో అసోషియేషన్ ఆఫ్ ఐడియాస్ అనే ఒక కాన్‌సెప్ట్ వుంది. ఒక పదంగాని, వస్తువునుగాని చూసినప్పుడు దాని తాలూకు జ్ఞాపకాలు స్మృతికి వస్తాయి. దానితో కత నడపడం చైతన్యస్రవంతి కథాశిల్పంలోని ఒక భాగం. ఈ కథలో ఈ భావం మెరుపులా మెరిసిపోతుంది.

తెలంగాణాలో ప్రసిద్ధ కథకునిగా మంచిపేరున్న కాలువ మల్లయ్యగారు రాసిన 'పోట్రపుతు' ఆరోకథ. జానపదుల నాడిని, వాడిని తెలియచేసేవి వీరి కథలు. ప్రపంచీకరణలో మన వ్యవసాయ రంగం, ముఖ్యంగా తెలంగాణాలోని వ్యవసాయరంగం ఎదుర్కొంటున్న సమస్యలు ఇందులో కథారూపకంగా చర్చించబడ్డాయి. మన రైతాంగానికి సబ్సిడీలు, నీరును, కరెంటును సరిగా ఇవ్వకుండా మన రైతులను ఇతర దేశాల వాళ్ళు పండించే పంటలను పండించాలని అధికారులు చెప్పడం, వాటిని రైతులు తిరస్కరించడం యీ కథలో చెప్పబడింది. అధికారులు చిలుకపలుకులు పలికినట్లు వ్యవసాయ ముచ్చట్లు రైతులతో చెప్తారుగాని భూమిగుణం, వాతావరణం లాంటి విషయాలను పరిగణించకుండా పంటలు పండించాలని ప్రభుత్వాలు చెప్పడం శాస్త్రీయ దృష్టికాదని ఈ కథ తెలియజేస్తుంది. కొండయ్య పటేల్ అధికారుల సభకు హాజరు కావడానికి తొందరగా వస్తున్నప్పుడు కాలుకు పోట్రవుతు తగిలి గాయమైంది. కట్టుకట్టుకొని ఆ సభకు హాజరై అవగాహనలేని అధికారులకు పోట్రవుతులాంటి ప్రశ్నలు వేసి వారి ఆట కట్టించడం ఈ కథలోని కథనశిల్పం. ఈ కత కూడా తెలంగాణా మాండలికంలోనే నడిచింది.

లీడర్‌సాబ్ అనే ఏడో కథను గీతాంజలిగారు రాసారు. ఈ కథను చదువుతూంటే పోయిన సంవత్సరం రాజశేఖర్‌రెడ్డిగారు చేసిన పాదయాత్ర యాదికి వస్తుంది. జనంలో కలువక ముందు లీడర్‌సాబ్ ఫాక్షన్ రాజకీయాలు చేస్తూ అపోజిషన్లో కూర్చున్నాడు. కాని ప్రజలతో కలిసి తిరుగుతూ వారి అవస్థలు స్వయంగా చూస్తూ వారితో మమేకం అయిపోయి ఉచిత కరెంటు ఇస్తానని మూతపడ్డ ఫ్యాక్టరీలను తెరిపిస్తానని చెప్పాడు. కాని చివరల్లో ముఖ్యమంత్రి అయ్యాక 'పట్నంలో అయిదు నక్షత్రాల హోటల్లో పదిశాతం కరెంటు ఛార్జీలను పెంచటానికి మరియు విద్యుత్ సంస్థల ప్రైవేటీకరణ ఒప్పందం మీద సంతకం చేశాడు. పాదయాత్రల ద్వారా గెలిచి ప్రజలను వెన్నుపోటు పొడిచాడని కథ

## సమీక్షల శీర్షికకు...

1. ఈ శీర్షికలో సమీక్షకు రెండు ప్రతులు ఇవ్వాలి.
2. వ్యక్తుల పేరుమీద రాయనవసరం లేదు.
3. ఆరు నెలల కన్నా ముందు ప్రచురితమైన పుస్తకాలను దయచేసి పంపకండి. పంపినా సమీక్షించడం జరగదు. పంపిన వెనువెంటనే కంటే ఆ తర్వాతి సంచికలో సమీక్షించే అవకాశం ఎక్కువ.
4. సమీక్షలు రాయించి పంపడం, సమీక్షకులను రచయితలే తీసుకుని రావడం మంచి పద్ధతులు కావు.
5. సమీక్షలు చేయాలన్న ఆసక్తి వున్నవారు రాస్తే అవకాశాన్ని బట్టి ఇవ్వగలము. అయితే తీసుకున్న వారు సకాలంలో ఇవ్వలేకపోతే రచయితలకు, పాఠకులకు నిరుత్సాహం కలుగుతుంది.
6. ఇది వరకే వెలువడిన పుస్తకాలపై ఏదైనా రాయదలుచుకుంటే అది 'నచ్చిన రచనలు' శీర్షికకు పంపొచ్చు.

తెలుపుతుంది. మళ్ళీ ఇలాంటి ముఖ్యమంత్రిని ఓడించటానికి ఓడిపోయిన ముఖ్యమంత్రి పాదయాత్రలు చేయడానికి కుట్రను పన్నుతున్నాడని కథను ముగించింది. ఏ నాయకుడైనా నిజాయితీగా, నిబద్ధదృష్టితో పని చేయడం లేదన్నది ఈ కథలోని ధ్వని.

జాతశ్రీగారు రాసిన 'అంతర్ముఖం' కత ఎనిమిదవది. పల్లెల్లో కల్లు అమ్ముకుంటూ జీవనాన్ని సాగిస్తున్న గౌడవారి ఆర్థిక దీన పరిస్థితిని ప్రపంచీకరణ నేపథ్యంలో ఈ కథ వివరిస్తుంది. మల్లేశం గౌడ్‌కు కొద్ది భూమి ఉన్నా వర్షాలు లేక, కల్తీ విత్తనాలు, మందులవల్ల నష్టాలే వస్తున్నాయి. కల్లు అమ్ముకుని జీవిస్తామంటే కోకోకోలాలు, నల్లకల్లు వచ్చి అతని జీవితాన్ని అతలాకుతలం చేసింది. కొడుకు చదువుకున్నా ఉద్యోగం లేదు. కొడుక్కు యాభైవేలిచ్చి కువాయిట్‌కి ఎలాపంపాలో అర్థం కాలేదు. అప్పు పుట్టే స్థితి కనబడడం లేదు. ఈ ఆలోచనలతో తాటిచెట్టెక్కి తల తిరిగి పడిపోయాడు. ఇలా పల్లెల్లో గౌడ వారి వృత్తి వారి మృత్యువుకు కారణమవుతుందని కథ తెలియజేస్తుంది.

పెద్దింటి అశోక్‌కుమార్ రాసిన 'సావుదప్పు' కత తొమ్మిదవది. తెలంగాణా పల్లెల్లో మాదిగ కులస్తులు చావుడప్పు వాయిస్తారు. అందుకు వారికి లభించే ప్రతిఫలంతో కొన్ని అవసరాలు తీర్చుకుంటారు. ఇలాంటి వ్యవస్థను గ్రామాల్లో ఉన్నతకులాలకు చెందిన వారు ఎలా భ్రష్టు పట్టిస్తున్నారో ఈ కథ తెలియజేస్తుంది.

చిన్న గోపాలరావు అనే పెద్ద కామందు చనిపోతే చావుడప్పు వాళ్ళతో ఊరేగింపు ప్రారంభమైంది. ఐదారు వందల దాకా చిల్లర డబ్బులు జమ చేసి నేలపై వేసి అందుకోమంటున్నారు పోశాలు కొడుకుని. ఇతనికి కడుపులో నొప్పి ఉన్నా కాళ్ళు చేతులు గుంజుతున్నా కంట్రోలు బియ్యానికి డబ్బులు లేవని వాటి కొరకు తల్లి కొడుకును ఆ గ్రూపులో చేరమని ప్రోత్సహించింది. దాహంతో నాలుక పిడుచ కట్టుకొని పోతున్నా నీరు తాగకుండా కల్లు తాగకుండా డబ్బుల్ని అందుకోమని జనం ప్రోత్సహిస్తున్నారు. ఇలా సాగుతున్న దశలో దింపుడు కల్లంకాడ చచ్చిన పటేల్ లేచి కూర్చున్నాడు. వెంటనే బంధువర్గమంతా బతికిన పటేల్‌ను కార్లో వేసుకొని వెళ్ళిపోయారు. ఈ పైసలు ఏరే పిల్లవాడు రక్తం కక్కుకుంటూ ఆయాసపడినా ఊళ్ళోవరకైనా కార్లో తీసుకుపోలేదు. చచ్చిన పటేల్ బతికినందువల్ల చావుడప్పు వాయించేవాళ్ళు చేసిన కష్టానికి ప్రతిఫలం రాక నిరాశకు గురైనారు. 'గట్టుకు మొరికిన కుక్క లెక్క అయిపాయె' అన్న వారి యొక గాలిలో కలిసిపోయింది. ఇలా వాళ్ళ బతుకులు ఎలా దోపిడికి గురవతున్నాయో చివరకు చావుకూడా చావుడప్పును ఎలా మోసగిస్తున్నదో చాలా అద్భుతమైన కథన శిల్పంతో వాస్తవీకరించారు రచయిత.

కె.వి. నరేందర్‌గారు రాసిన 'ఉసుల్లు' కథ పదవది. ఈ కథ మారుతున్న గ్రామీణ వ్యవస్థలో వృత్తులు తారుమారుగావడాన్ని చిత్రించింది. దొరలు పట్టణాల్లో చేరి చాకలి మంగలి వృత్తులను పేర్లుమార్చి చేబట్టి ఎలా డబ్బు సంపాదిస్తున్నారో ఈ కథ చక్కగా వివరించింది. వృత్తులు మారినా పెద్దోళ్ళ ప్రవృత్తులు మారడం లేదని కథ తెలుపుతుంది.

ఉసుళ్ళకు ఇనుపరెక్కలొస్తున్నాయి. ఉన్నవాడు చిన్నవృత్తులు చేసుకుంటూ పెద్దగా డబ్బు సంపాదిస్తున్నారని ఒక అర్థం. చిన్నవాళ్ళు కూడా ఆర్థికంగా బాగుపడి పెద్దోళ్ళచేత పనులు చేయించుకుంటున్నారు అనే మరో అర్థం ఈ కథ ద్వారా స్ఫురిస్తుంది.

బి. గణేశ్‌గారు రాసిన 'అజాద్ హైదరాబాద్' అనే కథ పదకొండవది. ఎన్నో కష్టాలుపడి, ఉద్యమాలు లేవదీసి తెలంగాణ ప్రజలు, హైదరాబాద్‌ను నిజాం పాలన నుండి విముక్తంగావించుకున్న వైనం ఈ కథ చెబుతుంది.

చివరిదైన పన్నెండవ కథ 'స్కైలాబ్' యెన్నం ఉపేందర్ రాసినది. స్కైలాబ్ భూమిని ఢీకొడ్తుందని, జనమంతా చనిపోతారని రేడియోలో చెప్పారు. అది విన్న ప్రజలు తమ స్వార్థాలను మోసాలను మరిచిపోయి అందరూ కలిసిపోయారు. బతికే ఆశలేనప్పుడు బీదరికం వున్నా కలిసే వుంటారు. బతకాలనే మొండి ఆశవున్న వారు బీదరికంలో ఎలా అపస్వరాలు సృష్టించుకుంటారో ఈ కథ స్కైలాబ్ సంఘటనద్వారా చూపారు.

ఇలా తెలంగాణా పల్లెలు స్వాతంత్ర్యం వచ్చాక కూడా ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణల ద్వారా సమస్యల వలయాల్లో చిక్కుకుని ఎలా విలవిలలాడుతున్నాయో ఈ కథలు చెబుతాయి. వీటికి తోడు అదనంగా ఆంధ్రవలస, పాలకుల దోపిడి, చివరికి భాషలోని యాసస్థాయిలో కూడా జరుగుతున్నదని ఈ కథాసంపుటి తెలియజేస్తుంది. తెలంగాణా అగ్నిగుండంలా మారి వారి జీవితాలను కాలుస్తున్నది అని ఈ కథా సంపుటం తెలియజేస్తున్నది.

**(2003 తెలంగాణా కథ (పన్నెండు ఉత్తమ కథలు), పేజిలు 116, వెల : రు.40/-, కాపీలకు :2-5-449, అదాలత్ వెనుక, సుబేదారి, హన్మకొండ-506 001)**









# శేఫాలిక విశ్లేషణ గురించి...




దాసరి అమరేంద్ర

అక్టోబర్-డిసెంబర్ 2003 ప్రస్థానంలో అత్తలూరి నరసింహారావుగారి 'శేఫాలిక' విశ్లేషణ చూసాను. దీనినే ప్రసంగంగా ఏప్రిల్ 27, 2003న విశాఖలో జరిగిన శేఫాలిక ఆవిష్కరణసభలో విని ఉన్నాను. అక్షరాలు అచ్చాయాక వాటి మీద వచ్చిన వ్యాఖ్యలకు రచయిత స్పందించడం సవ్యంగాదని నా నమ్మకం. అయినా అత్తలూరిగారు చెప్పిన కొన్ని విషయాల మీద నా అభిప్రాయం అందించడం నా బాధ్యత అనిపించి ఈ మాటలు...

కథల్లో కనిపించే 'నేను'లు రచయిత కానవసరంలేదు. 'బతకనేర్వని వాడు' కథలో చైనా వాళ్ళను – పీతకళ్ళ వెధవలు అంటాడు కథ చెప్పేనేను. తన స్నేహితుడి గురించి చెబుతూ – వాడి ధోరణిలో ఎన్ని వైరుధ్యాలో... వాడి లక్ష్యాలు ఎంతలోపభూయిష్టాలో' అంటాడు. ఇలాంటి (పీతకళ్ళ) వ్యక్తీకరణలు రచయితల మానసిక పరిణితిని ప్రశ్నార్థకం చేస్తాయి. స్నేహితుడి లక్ష్యం స్పష్టంగా ఉంటే వైరుధ్యాలూ, లోపభూయిష్టాలూ రచయితకు ఎక్కడ కనిపించాయో అర్థం గావడంలేదు" అన్నారు అత్తలూరి. కథలోని 'నేను' ఓ లంపెన్ ఎలిమెంటుగా మొదలెట్టి లక్షలు ఆర్జించిన సుబ్బుడు. అతని సంస్కారస్థాయినీ, మానసిక పరిణితినీ, ఆలోచనా పరిధినీ విశదీకరించే ఎన్నో సంగతులు ఆ కథలో వున్నాయి. అతని మనసులోంచి అలాంటి మాటలు రావడం సహజం. అవి రచయితవి అనుకోవడం ఆశ్చర్యకరం.

సామెతలూ లోకోక్తుల గురించి ప్రస్తావిస్తూ – ఒక్క బతకనేర్వని వాడు లోనే అది 15 దాకా ఉన్నాయంటే వాటి అవసరం ఎంతో తెలుస్తుంది అన్నారు అత్తలూరి. నాకు సామెతల బలహీనత ఉన్న మాట నిజమే. కానీ అది సుమారు నాలుగున్నర వేల పదాల పెద్ద కథ. ఎంత నిడివికి ఎన్నిసామెతలు ఉండ వచ్చునో నిర్దేశించే ఆదేశ సూత్రాలు ఉండి ఉంటే జాగ్రత్త పడేవాడినే!

'చెదరగూడని స్వప్నాలు' కథలో ఓ అమ్మాయి ఓ అబ్బాయి కలిసి తిరగడం గురించి జనం – గుసగుసలు పోలేదు. చెవులు కొరుక్కోలేదు. అన్న విషయం మీద అత్తలూరి 'ఇప్పటికీ ఈ పరిస్థితి లేదే, 20 ఏళ్ళ క్రిందట ఉందంటే నమ్మబుద్ధి కావడం లేదు' అన్నారు. కథలో రాసింది 30 ఏళ్ళ క్రితం నిజంగా జరిగిన విషయం. నమ్మడం, నమ్మకపోవడం పాఠకుల అవగాహనకు వదిలేస్తే బావుండదూ?!

'సెలవల్లో కథ గురించి రాస్తూ' ఇంటి పని ఆనందాన్నీ, పతనం చైతన్యాన్నీ ఇస్తుందని సుజాత పాత్ర ద్వారా నిరూపించారు' అంటారు అత్తలూరి. అలాంటి నిరూపణ నా ఉద్దేశంగాదు. సామాన్య గృహిణికి ఇంటి పనీ వంట పనులను మించిన అర్థవంతమైన వ్యాపకాలు ఉండాలి. అన్నది ఆ కథలో నేను చెప్పాలనుకొన్న విషయం.

'శేఫాలిక' కథలోని కొన్నికొన్ని వ్యక్తీకరణల్ని అనవసరం, ఎబ్బెట్టు, అనాలోచితం – అన్నారు. ఎంచేతో వివరణ లేదు. ఎబ్బెట్టు, అనవసరం అన్నమాటల్ని విమర్శకుల అభిప్రాయాలుగా స్వీకరించవచ్చు. 'అనాలోచితం' అన్నది రచయితకే చెందిన విషయం. 'మనుషుల్లో అంటే పాతికేళ్ళలో ఎన్నో మార్పులు వస్తాయిగానీ వృక్షాలకు ఆ ప్రమాదం తక్కువగదా' అని నేను ఆ విషయాన్ని అనుభవించి ఆలోచించిన తర్వాతే అన్నాను.

విదేశాలకు వెళ్ళిన ఓ మనిషి తెలుగు బెంగతో సతమతమైపోయిన 'కుహూరవం' కథ గురించి చెబుతూ టెలికమ్యూనికేషన్లు విస్తృతంగా ఉన్న రోజుల్లో ఇలాంటి కథలకు అవకాశం ఉందా' అన్నారు. ఆ కథా కాలం గల శతాబ్దపు ఎనభైలు. తెలుగు బెంగ అన్నది సాంకేతిక సదుపాయాలకు అందని మానసిక స్థితి.

'విజయ'కథలో విజయ తన చిన్నతనంలో స్నేహితులకు కూడా ఫస్టు మార్కులు వచ్చే అవకాశం కల్పించడం కోసం ఓ లెక్కలబిట్టు కావాలని తప్పు చేస్తుంది. 'ఇలాంటి అసహజ అంశాలు లేకుండానే విజయ వ్యక్తిత్వాన్నీ విలువల్నీ చిత్రీకరించవచ్చు' అంటారు అత్తలూరి. ఇది నేను నిజ జీవితంలోంచి గ్రహించిన ఓ 'సహజ' సంఘటన. 'నాకులేని ఆచరణ శీలతా, ఆదర్శాలపట్ల అంకితభావం విజయకు ఎలా అలవడిందా అని తండ్రి అబ్బురపడటం సిల్లీగా ఉంది' అంటారు అత్తలూరి. ఎందుకు సిల్లీనో తెలియదు.

'భద్రత' కథ గురించి చెబుతూ 'మనిషి తన మనుగడ కోసం ప్రపంచంలో ఎక్కడ ఉన్నా ఆయా సమాజాల్లో ఒదిగిపోయి సర్దుకుపోవడమే అతనికి భద్రత అని ఈ కథ చెబుతుంది. ఇది మాత్రం భద్రతా– అన్న ప్రశ్న ఈ కథ చదివాక కలుగుతుంది' అంటారు. కథలో చెప్పింది 'ఆయా సమాజాల్లో కలిసిపోయి, ఇమిడిపోయి, మమేకమైబతకడం' గురించి. ఒదిగి సర్దుకుపోవడం గురించి కాదు.

'గురి ఎరుగని బాణం'లో ఓ పాత్ర 'పంటలన్నీ వర్షాధారం, దైవాధీనం...' లాంటి అనవసరపు మాటల్ని మాట్లాడటం గురించి ప్రస్తావిస్తూ 'ఎకానమీ ఆఫ్ వర్డ్స్ అండ్ థాట్స్ అని చలం రాసింది చదువుతాం గానీ ఆచరణే అసలు సమస్య' అంటారు అత్తలూరి. కించిత్తు ఎక్కువగా మాట్లాడే వాళ్ళు కొందరుంటారు. అది అంత అభ్యంతరకరమా?

'చదువు' కథ చెప్పే మనిషి మొట్టమొదట్లోనే అంటాడు – నేనో తికమక మనిషిని – అని, అలాంటి గందరగోళపు మనిషితో కథ చెప్పించడం నేను ప్రయత్న పూర్వకంగా చేసిన పని. 'చదువు' లేని రాములయ్య తలచుట్టూ అక్షరాల కాంతి వలయాన్ని చూసి కథ చెప్పే మనిషి 'గందరగోళం, అయోమయం' అంటాడు. అది రచయితలోని గందరగోళంగా భావించడం సవ్యంగాదు. వ్యాసం చివర్లో పుస్తకాలకు ప్రొఫెషనల్ ఎడిటర్ల అవసరం గురించి రాస్తూ అత్తలూరి 'కొన్ని కథల అనంతరం బ్రాకెట్ చేసిన రాతలు అక్కడక్కడ కన్నా ముందు మరెక్కడన్నా వరసగా వుంటే బావుంటాయి' అన్నారు. వారు చెప్పిన విషయం పాఠకులకూ రచయితకూ అర్థంగావడం కోసం ఆ బ్రాకెట్ చేసిన పుస్తక భాగాలను విశ్లేషణతోపాటు ప్రస్థానంలో ప్రచురించి ఉంటే బావుండేది.

శేఫాలిక విశ్లేషణా ప్రయత్నంలో అత్తలూరి వారు నరసింహావ తారం ఎత్తారు. అభినందనీయం. కానీ హిరణ్యకశిపుడెవరో ప్రహ్లాదుడెవరో గమనించకుండా అక్షరతాండవం చేస్తే – జగమేలే పరమాత్మా ఎవరితో మొరవిడుదూ?! (సాంకేతికమైన పొరబాటువల్ల గత సంచికలో రావలసిన ఈ ప్రతిస్పందన ఆలస్యమైంది. అయినా ప్రచురిస్తున్నాం)



# కుర్బానియత్

వర్ఘుల శివకుమార్

రాత్రికి రాత్రి
దుఃఖపుతెరలు చీల్చుకుంటూ
చెల్లాచెదురుగా పడున్న
మాంసపు ముద్దల మధ్యలోంచి
కూలిపోయిన గూళ్ళనొదిలి
కలల్ని వదిలి కన్నీళ్ళనొదిలి
కర్బలామైదానమైన వాళ్ళం....

ఆ సగం కాలిన దేహం నాదే
ఆ ఎగిరిపడ్డ చేతులూ
నా నెత్తుటి ఆనవాళ్ళే
మా బతుకుల్నే లక్ష్యం చేసుకుని
కాలుదువ్విన సంకీర్ణ కారుణ్యం...

పగను ఆహంకారాన్ని వారసత్వంగా
తీసుకుని పుట్టిన వాడా!
మాకూ మానేలకూ మధ్య
ప్రేమల్ని నువ్వెలా అంచనా కడతావ్

మేం మానేల ఎడారి గుండెల్ని
బతుకు తీపితో చదును చేసుకున్నాం
ఈ ఇసక పర్రల్ని చెమటతో తడిపి
గూళ్ళు కట్టుకున్నాం
నీరందక నీడందక
దిగులు సముద్రాలు ఈది ఈది
మానేల చమురు చనుబాలదయతో
ప్రాణాలకు ఊపిరిపోసుకున్నాం

ఆక్రమణాలకు అలవాటుపడ్డ దాహం నీది
మా నేల కోసం ప్రాణాల్ని సైతం
ఖుర్బానీ పెట్టే సాహసంమాది
నీ దుర్మార్గం నిన్నటి సందర్భాన్ని కమ్ముకోవచ్చు
అక్కసుతో ఓ వికృత ప్రజాస్వామ్యాన్ని
ఇరాక్ నేలకు బహూకరించవచ్చు
మామౌనానికి సంకెళ్ళు తగిలించి,
మా సహనాల మీద జులుం కొనసాగిస్తూ,
నువ్వు ప్రకటిస్తున్న మానవతా సూత్రాలు
జైళ్ళలో మా ఖైదీల దేహాల మీద
నీ కిరాయి సైనికుల, కిరాతకపు గుర్తులై
వెక్కిరిస్తున్నాయి

కూలిపోతున్నా తరలిపోతున్నా
తలొంచినా, తల్లడిల్లుతున్నా
మాకు బతుకంటే
ఓ పునశ్చరణ... ఓ పురిటినొప్పి

రాగలకాలమంతా
నీ దారి గుండెల్నిండా
మా ఆత్మ విశ్వాసాల మందుపాతర్లే
నిన్ను అనుక్షణం తరుముతున్న
చావు భయం చిరునామా తెల్సిన వాళ్ళం
రేపు మళ్ళీ మళ్ళీ ఎదురుపడతాం
పదునెక్కిన లక్ష్యంతో...
కొన ఊపిర్ల మీద నిలుపుకుంటున్న
మా మట్టి మీదిమముకారాలతో...

# వెలుతురు చినుకులు

వొడ్నాల సూర్య



దుర్గమ చీకటిగనిలో
పయనించే సంచారి
పాదాలు రాళ్లలా బండబారి
న ఉక్కుపాదాలు
వాళ్ళు తీస్తున్నది నల్లని బొగ్గునా?
కాదు కాదు
మనందరి వెలుతురిని!
సూర్యుడిలా చీకటిని చీల్చే
వెలుగు విద్యుత్ కిరణాలని!
అనునిత్యం మృత్యుపోరాటం
అయినా ధైర్యసాహసాల పయనం
వెలుగు సూర్యులు వారు
వెలుతురు చినుకులు వారు
నిరంతరం బొగ్గుచూర దుమ్ము
ధూళి నడుమల నల్లబారిన వెలుగు రేఖలు
చిమ్మ చీకటిలో
గూనినడకతో
మోసుకు వస్తారు
నల్లబంగారంని
నగరాలని మెరిపిస్తారు
శ్రమ శక్తితో
వెలుగు సూర్యులు వారు
జాతికి వెలుతురు చినుకులు వారు

# ఉద్యమ కవితా జలపాతం 'బుదడు' కావ్యం




దూసి ధర్మారావు

శ్రీకాకుళం జిల్లా సంస్కృతి, వంశధార పరీవాహ ప్రాంతంలోగల దంతపురి, శాలిహుండం, శ్రీముఖలింగం వంటి చారిత్రక ప్రదేశాల జీవన విధానంతో తరతరాలుగా ప్రభావితం అవుతూ వస్తున్నది. వంశధార గట్లంట పదేళ్ళ పిల్లలూ, పశువులూ, అప్పుడప్పుడూ తప్పివస్తూ, కొన్నాళ్ళ తర్వాత ఎవరికీ చెప్పాపెట్టకుండా తప్పిపోతూ ఉండడం ఈ ప్రాంత ప్రజల అనుభవంలోని విషయం. ప్రజల అనుభవగాథల్లో ఉన్న ఈ విషయం తీసుకుని అలా తప్పివస్తూ పోతూ ఉండే పిల్లలు ఎవరై ఉంటారు అని కవి ఛాయారాజ్ తనలో తనే ప్రశ్నించుకుని, వాస్తవ చరిత్రనిండా అనాథలైన పిల్లలు కోకొల్లలు ఉన్నారనీ, మన కథలలో చిరునామాలు లేనిపిల్లలు వీరులై ఉన్నారనీ వీళ్ళతో కర్ణులెందరు? భరతులెందరు? అని తీవ్రంగా ఉద్యమాల దృష్టితో ఆలోచించాడు. అనేక ఆధునిక విప్లవాలలో అమరులౌతున్న వీరులే వీరు అని తన కాల్పనికతతో అనుసంధానించుకున్నాడు.

కవి ఛాయారాజ్ ఈ వంశధారా తీరంలో పుట్టి పెరిగి, ప్రాచీన బౌద్ధక్షేత్రం శాలిహుండం చరిత్ర గాథలతో గాఢమైన పరిచయం కలిగినవాడు. ఒక అనాథ బాలుడిని విప్లవవీరులకు ప్రతీకగా మలచుకుని అతడికి బుదడు అని నామకరణం చేశాడు. శ్రీకాకుళం ప్రాంతంలో నదీ తీరాలలో నివసించే ప్రజల అనుభవగాథలలో ఆకస్మికంగా కనిపిస్తూ, కొంత కాలం వారి ఇళ్ళలోనే కలిసి జీవిస్తూ, అంతలోనే అదృశ్యమైపోయే అద్భుతబాలుడే బుదడు. విప్లవవీరుడై, విప్లవ వీరులకు ప్రతినిధియై అనేక ఉద్యమాలలో విప్లవాలలో బుదడు మరణించాడు. బుదడు మరణిస్తూనే ఉంటాడు. "మృత్యువు బుదడికి ప్రియురాలు. అతడ్ని ధ్వంసం చేస్తుంది. మళ్ళీమళ్ళీ పునర్నిర్మిస్తుంది" ప్రపంచంలో ఎక్కడ ఏ రకమైన ఉద్యమం జరిగినా, ఏ విప్లవంలో ఏ వీరుడు మరణించినా అతడు బుదడే. అలా నిరంతరం విప్లవాల ముందు నిలిచి, ప్రాణత్యాగం చేస్తున్న విప్లవవీరుడైన బుదడి మీద ఛాయారాజ్ రచించిన స్మృతికావ్యం 'బుదడు'.

ఆధునిక సాహిత్యంలో కవి ప్రతిపాదించే ఇతివృత్తాన్ని బట్టి కావ్య శిల్పానికి ప్రాధాన్యతనిస్తూ ప్రసిద్ధ ప్రతీకలతో వస్తు నిర్వహణ చేయడం గొప్ప కావ్యాల లక్షణం. ఛాయారాజ్ ఈ కావ్యంలో స్థిర చలద్రూప చిత్రణం చేస్తూ ప్రతిపాద్య వస్తువును కవితామయం చేస్తూ నిర్వహిస్తాడు.

**"తల్లిభూదేవి బుద్ధిలోంచి ధ్యానముద్ర జేగురు ఏనుగై**
**హృదయాన్ని మూపున మోసుకొచ్చి**
**నది కుడిగట్టున తుండంసాచి తూర్పున మోకరిల్లింది**
**ఏనుగు కొండయి హృదయం ఆరామమై**
**ప్రేమ ప్రవాహమై జాలి జైన కరుణ బౌద్ధ స్థావర శాలిహుండమై నిలిచింది"**

ఇలా శాలిహుండం స్థిర రూప వర్ణనతో కావ్యం ప్రారంభించి, ఏనుగు తొండం చాచి విశ్రాంతి తీసుకుంటున్నట్టున్న శాలిహుండం కొండను కవితామయం చేసి ప్రాచీన మహాకావ్యలక్షణాలు స్ఫురింప చేశాడు కవి. ధ్యానముద్ర, హృదయం, ప్రేమ, ఆరామం పదాలతో తన కావ్య వస్తువును ధ్వనింపచేశాడు. కొండ శిఖరానికి తల ఆన్చి

**కొండ వాలున మొండెం వాల్చి**
**వంశధారా ప్రవాహంలో పాదాలు ముంచి**
**ధ్యానిస్తుంటాడు బుదడు.**

కొండ కింది భాగంలో ప్రవహించే వంశధారలో పాదాలు ముంచి నిలిచిన బుదడి తల కొండ శిఖరం అని ధ్వనించి బుదడి వ్యక్తిత్వాన్ని, శాశ్వతత్వాన్ని కొండ సారూప్యంతో వర్ణించి బుదడిని మనకు పరిచయం చేస్తాడు.

కవి ఈ దీర్ఘకావ్యాన్ని ఒక నాయకుడి గురించో, ఒక జాతి గురించో ఒక సంఘటన గురించో రాయలేదు. మానవ చరిత్రలో స్వేచ్ఛ కోసం, స్వాతంత్ర్యం కోసం, విమోచన కోసం సమాజం కోసం ప్రాణత్యాగం చేసిన విప్లవ వీరులందరి గురించి రాశాడు. ఈ బుదడుని ప్రపంచ విప్లవాల వీరుల ప్రతీకగా మలచడానికి కవి ఎంచుకున్న కవితామార్గం ధ్వని ప్రధానంగా సాగింది.

**"భగత్సింగు అల్లూరికి రాసిన లేఖ**
**గిరిజన బుదడి చేతిలో ఉంది"**
**గోల్కొండ మీంచి నైజాము గుర్రంపై దుమికాడు బుదడు**
**మూసీనది ముద్దాడింది బుదడిని**
**యాదగిరిగుట్ట బుదడు. ఏరువాక బుదడు.**
**భూమి యిరుసు బుదడు**
**విప్లవం తెలంగాణాలో వీరగెరిల్లా బాలుడు, బాలసంగం బుదడు"**
**మరోచోట**
**"విప్లవ తెలంగాణా రక్తం నగ్జల్‌బరీలో ఉరిమింది**
**నగ్జల్‌బరీ మేఘం నెత్తురు కురిసింది**
**శ్రీకాకుళోద్యమంలో చిందులేశాడు బుదడు"**

అని ఆంధ్రదేశంలోని విప్లవోద్యమాలన్నిటికీ బుదడిని నాయకుడ్ని చేసి 'భూమి యిరుసు బుదడు' అన్నమాటతో భూగోళంపై జరిగిన ఉద్యమాలన్నిటిలోనూ బుదడి ప్రమేయాన్ని వర్ణించాడు కవి. ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న ఒక చారిత్రక విషయాన్ని ఆధారం చేసుకుని, బుదడి లాంటి మహావీరుడు జన్మించడానికి కారకులైన తల్లితండ్రుల్ని ఊహించి కల్పిస్తాడు కవి. శాలిహుండం వంశధార దక్షిణతీరంలో ఉంది. అవతలి ఉత్తరం తీరంలో వనిత మండలం అని ఒక ఊరుంది. నది మధ్యలో మనుషుల రాకపోకలకు అనుగుణంగా రాళ్ళు పేర్చి ఉంటాయి. స్త్రీ పురుష సంగమ సౌందర్యారాధనే విముక్తీ, నిర్వాణమని భావించే వజ్రయాన బౌద్ధభిక్షువులు, నది దాటి వనిత మండలం

వెళ్ళి సౌందర్యారాధన చేసి తిరిగి వస్తూండేవారు. ఈ గాథ ఆధారంగా వంత పేరుగల బౌద్ధభిక్షుకిని కవి సృష్టించాడు. ఈ వంత కవి ఊహలో మెరిసిన నదీకన్య. ఆమె ప్రసవించిన నమూనా బిడ్డడు బుదడు. వజ్రయాన బౌద్ధభిక్షుడి వంత పురుష బౌద్ధ భిక్షువుల స్పర్శకు విప్లవించి వంశధారలో దిగింది. "ఎర్రని ఉషా సూర్యబింబాన్ని 'అందుకుని, గర్భకోశంలో దించుకుని, పిండంగా మార్చుకుని, పదేళ్ళ ఎత్తున పాపడ్ని కని బౌద్ధారామం మీదికి దింపి అదృశ్యమై పోయింది వంత". ఈ ఊహానదీ కన్య వంతనే భారత ఉపఖండంగా భావిస్తాడు కవి.

**"వంత విశ్వసౌందర్య**
**వంత ఝంఝు వంత సువర్ణముఖి వంత నాగావళి**
**వంత వేగావతి వంత బాహుదా"**

అని వర్ణించి వంశధార నుండి ఉపఖండంలోని నదులన్నిటిలోనూ చేరిపోయిందని చెప్పాడు. వంత విప్లవ వనిత.
**'ఉద్యమ రక్తంలోంచి పుడుతున్న విప్లవ బాలలకు పొత్తర్లు పడుతోంది.**
**"కరుణ ప్రజ్ఞల సమ్మేళనంలో ఆమె ఊహలు**
**గర్భస్థమై రూపుకడుతున్నప్పుడు**
**నిర్యాణజ్ఞానం నాడి తెగిపోయింది**
**వంత వంశధార ఉరవడిలో దుమికింది.**
**ఆమె గర్భస్థ శిల్పం అసంపూర్తిగా నీటిలోకి ప్రవించింది.**
**వంశధారలో వంత ఒక్క సుడిగుండమై లేచి**
**బుదడిని తన గర్భకోశంలో దాచుకుంటుంది"**

బుదడిలాంటి మహా విప్లవ వీరుడు జన్మించడానికి కవి ఊహించి కల్పించిన తల్లి వంత వీరమాత. విప్లవ వనిత. మలబార్, మోప్లా, వర్లీ, సంతాల్, తెలంగాణా, నక్సల్‌బరీ శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటాలలో విప్లవ వీరుల నందించిన తల్లి వంతను భారత ఉపఖండంగా భావిస్తాడు కవి.

కావ్యంలో 'మూడోపుట' (అధ్యాయం) బుదడికి స్మృతిగీతంగా రచించబడింది. ఈ పుటలో కవి బుదడితో తాదాత్మ్యం చెందుతాడు. ఈ భాగంలో ప్రకృతి విషాదం ప్రతీ పదంలోనూ పఠితలను కదిలిస్తుంది. ఈ భాగంలో ఛాయారాజ్ కవితా రూపం మనకు కనిపిస్తుంది.

**"అతడి నాసికాగ్రం మీదున్న మృత్యువు వజవజావణికింది.**
**తనను పీల్చేస్తాడేమోనని భయపడింది**
**అతడి కనుకొలకులలో చిక్కుకున్న కాలం గిలగిలా గింజుకుంది**
**తనను కాల్చివేస్తాడేమోనని భయపడింది.**
**అతడి స్వరపేటికలో మూలుగుతున్న స్వరం కిరకిరలాడింది**
**తనను మూసి వేస్తాడేమోనని భయపడింది**
**అతడికి చాలా మృత్యువు లుంటాయని అతడి సంకల్పానికే తెలుసు"**

బుదడి వీరలక్షణాలు ప్రశంసించి, చివరి చరణంలో బుదడి శాశ్వతత్వాన్ని వివరించాడు
**శ్రీకాకుళ రక్తంలో విప్లవయుగ సూర్యబింబ శిల్పి**
**మరణం మెడన జముకును వేలాడదీసి వదిలాడు**
**మృత్యువు గుండెల మీద తుడుం మోగించి వదిలాడు**
**నిర్మల ఆకాశం కింద కర్మలనేలపైన భార రహితంగా వెల్లకిలా**
**చివరి పేజీ మీద పడేసిన పెన్నులా అతడు.**
**ఆ శరీరం మీద సూర్యకిరణాలు తెగిరాల నివ్వండి. రగలనివ్వండి**

ఈ పంక్తుల్లో జముకు, తుడుం వంటి వాద్య విశేషాలను విప్లవ సంకేతాలుగా వర్ణిస్తూ విప్లవ వీరులను స్ఫురింపచేశాడు.
**మోప్లా తిరుగుబాటుల చేతుల్లోని**
**మట్టిపెళ్ళల్లో అతడిచోటు ఉంది**
**మణిపూర్ జెలియంగ్రాంగ్ ఉద్యమలోతుల్లోని**
**గ్లెడిమ్లా చెక్కకోటలో అతడశయ్య ఉంది**
**ముండాలు గోండుల గొంతుకల్లోని**
**ఘర్జనల్లో అతడి గమ్యముంది**

అనే పంక్తుల్లో చరిత్రలో అన్యాయాన్ని ధిక్కరించి విప్లవించిన ప్రపంచ మానవ జాతులన్నిటిలోనూ బుదడి ప్రమేయాన్ని చూపించి తన కావ్యాన్ని విశ్వజనీనం చేశాడు. అన్ని ఉద్యమాలలోనూ అంతర్లీనంగా ప్రవహిస్తున్న ఒకే సంబంధాన్ని సూత్రీకరించాడు.
ఆర్యులపై దండెత్తిన దస్యుడేడీ
గంగ భూములు దున్నిన దళితుడేడీ
గోపడేడి బుదడేడి చిన్నబాబేడి
చరిత్ర సమాధులపై విరబూసిన
ధరిత్రి చిరునవ్వులలో వెదకండి

ఈ చరణంలో చరిత్ర పూర్వం నించి అనుశ్రుతంగా సాగివస్తున్న విప్లవాచరణను దర్శించి, తన కావ్యాన్ని సార్వకాలికం చేశాడు.

చావు పుటకలులని విప్లవ వంశధారా ప్రవాహంలోకి బుదడి స్మృతులతో పాటే కవి కూడా కలిసిపోతాడు.

"ఏ భ్రమణంలో బుదడ్ని చుట్టుకుని భూగోళం పరిభ్రమిస్తుందో, ఆ స్థితి నన్ను పట్టుకుని సమాధుల లోతుల్లోకి దిగుతున్నాయి. ఈ సంకేతాన్ని అంగీకరించడం ఒకటే శాశ్వతం" అంటూ కవి "మృత్యువు గొప్ప మర్యాదస్త. ఈ మహా సౌందర్యరాశికి కవిగా నా జనన మరణాలను దానం చేస్తూ రాసిన నా స్వగత వచన స్మృతికావ్యం బుదడు" అంటాడు. భాషలో ప్రవాహాలాంటి సంబోధనలు, ఊహ ఉద్విగ్నలొచ్చారు, విషాద విచారలొచ్చారు వంటి ప్రయోగాలు ఉద్దేశపూర్వకంగా చేసిన ఛాయారాజ్, శ్రీకాకుళం జిల్లా మాండలికంలోని అనేక పలుకుబళ్ళకు, కావ్యగౌరవం కల్పిస్తున్న కవి ఆధునిక సాహిత్యంలో ప్రతిభావంతంగా దీర్ఘకావ్యాలు రచిస్తున్న ఛాయారాజ్ గుమ్మ, దర్శని, నిరీక్షణ, కావ్యాల కొనసాగింపుగా ఉద్యమ సాహిత్యానికి అందించి కావ్యేతిహాసం బుదడు.

ప్రపంచ విప్లవోద్యమాల నాయకునిగా, మహా వీరునిగా బుదడిని పరిచయం చేసి విశ్వమానవ విమోచనోద్యమాలన్నిటిలోనూ అతని మహోన్నతమైన విప్లవాచరణను అద్భుతమైన కవితా మార్గంలో ఆవిష్కరించాడు. విశ్వజనీనము, సార్వకాలికము అయిన కావ్యం రచించాడు.

ప్రాచీన ఆధునిక మహా కావ్య లక్షణాలన్నింటినీ కలిగి ఉన్న కావ్యం బుదడు. స్మృతికావ్యంగా రచించబడింది కాబట్టి కరుణరస ప్రధానమే అనిపించినా, క్రీడాత్మక విప్లవం, ప్రేమవంటి సంవేదనలు సహకారులుగా రసపోషకమైన సంవేద ప్రధానంగా కలిగించే కావ్యేతిహాసం బుదడు.

"కొన్ని చరిత్ర జ్ఞాపకాలను ఆధారంగా చేసుకుని, అపూర్వమైన కాల్పనికతతో, ఉద్యమ సాఫల్యకాంక్షతో అనుసంధించి ఛాయారాజ్ రచించిన బుదడు కావ్యం ఆధునిక సాహిత్యంలో ఉద్యమ కాల్పనికతలో గొప్ప ప్రయోగం"

"మహాకావ్యాలకుగల ప్రవాహక మౌఖిక స్వభావ లక్షణాలను ఛాయారాజ్ కావ్యం అందుకుంది. అది చదవడంలో కన్నా వినడంలో బాగుంటుంది. మయకో విస్కీ కవిత్వంలో మాదిరి ప్రతి కవితా చరణాన్నీ మెట్లుమెట్లుగా అమర్చినట్లయితే ఛాయారాజ్ కవిత్వంలో జలపాతాల శ్రేణులు స్ఫురిస్తాయి" అన్న డాక్టర్ సూర్యసాగర్ మాటలు ప్రత్యక్షర సత్యాలు.



# పడిలేచే కెరటం



జి. వెంకటకృష్ణ

పని మీద గూడూరు వెల్తూంటే ఎలా చూసారో ఏమో పేట మలుపు దగ్గర. "సార్... సార్సార్..." గట్టిగా పిలుస్తూ సత్యజ్ఞానినీ నన్నూ ఆపేసారు. బైక్ మీద నుండే 'బాగున్నారా... ఏమిటీ విశేషాలు" అని పరామర్శిస్తుంటే, నలుగురైదుగురు ఒకేసారిగా

"అసలుకి మేము గుర్తున్నామా సార్, మావూర్నీ మమ్మల్నీ మరిచిపోయినార్లే సార్... యీ పక్కలకి రావడమేలేదు... యిట్లా పోతానే... సూడకుండానే పోతాండారు..." నిష్ఠూరంగా మాట్లాడుతుంటే, అందులోని అభిమానానికి యిబ్బంది పడుతూ, సత్యజ్ఞాని బైక్ స్టాండు వేసి, నన్ను పరిచయం చేశాడు.

"సార్ తెలుసా... మన వాడే..."

"నమస్తే" అని చెప్తే ప్రతి నమస్కారం అందరూ చేస్తూ

"రండిసార్ టీ తాగుదాం..." దారితీస్తూంటే, పేటలోంచీ సత్యజ్ఞానిని చూసి మరికొందరు వచ్చి చుట్టూ మూగి

"నమస్తే సార్" అంటూ వరుసబెట్టి చెప్తూన్నారు. కొందరు (నేనెవరో తెలీకున్నా సత్యజ్ఞానితో వచ్చినందుకేమో) నాక్కూడా చెప్తున్నారు

నాకు చూడ్డానికి చాలా ఆశ్చర్యంగా, ఆనందంగా వుంది. వాళ్ళ కళ్ళలో సత్యజ్ఞానిపట్ల గౌరవం, ప్రేమా, ఆరాధనా అన్నీ కలగలసి యితను తమకెంతో ఆత్మీయుడని చెప్పకనే చెబుతున్నాయి

ఇంతలో ఒక నడివయస్కుడు

"ఎవుర్రా వొచ్చింది..." గుంపును చెదరగొడుతూ... చూసి

"ఆ సత్యంసారూ... ఎన్నాళ్ళకెన్నాళ్ళకు... అబ్బా యిప్పుడికి గుర్తుకొస్తిమా సారూ" అంటూ కౌగిలించుకొన్నాడు.

సత్యజ్ఞాని అతని చేతిని ఆప్యాయంగా నొక్కుతూ

"ఏంనా... డా కన్నన్నా బాగున్నారా.... అవును మనోహర్ బాగున్నాడా హైదరాబాద్‌లో గదా..."

దానికి అవునని తలూపుతూ

"అలేమ్... ఆడ మంచమేయండిలే... సారొచ్చాడు"

గట్టిగా పురమాయిస్తున్నాడు.

"అనా... యిపుడు కాదన్నా... ముందుకు పోవల్లా అర్జంట్ పని మీద వెళ్తున్నాము..." సత్యజ్ఞాని సంజాయిషీ యిస్తూ "ఏంది సార్... యిట్లొచ్చి అట్ల పోతానంటావ్... సర్వే పొదుపుగానీ ఆ హోటల్లోకి పొయెస్తాం దా... వాడు రోంతనీల్లుతాన్నాడు.."

"ఏమి... ఏమైనా సమస్యనా... ఏమంటున్నాడూ... మనల్ని రానీయడంలేదా" సత్యం ఆరా తీస్తూంటే

"చెప్పండిలే... నాకైతే చెప్తారే... హోటలోడు కిరికిరి చేస్తాన్నాడంటిరే... సార్‌కు చెప్పండి"

నలుగురైదుగురు ముందుకు వచ్చి

అవుసూడిసార్ యీ మధ్యా మెల్లగ మనొల్లని బైటనే టిఫిన్ చేయమంటూన్నాడు... గ్లాసుల్ని కడుక్కోండి టీపోస్తా అంటున్నాడు... రోంత వానికి చెప్పు...!

"అట్లనా... వానికెట్లుందంటా... చూద్దామ్..."

అందరమూ హోటల్లోకి వెల్లాము.

వెల్లగానే హోటలతను సత్యజ్ఞానిని గుర్తుపట్టి

"నమస్తే సార్... ఎప్పుడొస్తిరి టీ తాగుతారా..." వినయంగా అడిగాడు.

"యిట్లాంటి వాటికేమీ తక్కువలా" వెనుక నుంచీ విన్పించాయి.

"ఏమండీ మా వాల్లని హోటక్కొస్తే యిబ్బంది పెడ్తున్నారంటా...

యిదేమీ బాగాలేదు... మేందీన్ని సీరియస్‌గా తీసుకుంటాం... కేసు..." సత్యజ్ఞాని మాటలు పూర్తీ కాకుండానే

"అదేమి లేద్సారు... అట్లెందుకు చేస్తానూ... నాకేమి తెలీదా... ఏమంటే యిదే యిల్లూ యిదే హోటలు నాకు వేరే రూంలేదు గదా అందుకే ఎక్కువ మంది అయినపుడు బయట కూచోమంటున్నా అంతే" అని వాళ్ళవైపు తిరిగి

"ఏం బజారన్నా... అంతే గదా... నా మీద అట్ల చెప్తే యెట్లబ్బా"

"నువు సర్దుకుంటావని సెప్తిమిలేవోయ్... నువు సక్రమంగా వుంటే సెప్తామా..." వెనుక నుంచీ ఎవరో గట్టిగా అన్నారు.

"టీ తాగండి సార్..." హోటల్ అతను టీ అందిస్తుంటే

"మంచిదండి.... మళ్లీ కంప్లైంట్ రానియద్దండీ.... హోటల్ ఎవరికైనా హోటల్‌గానే వున్నీయండి.. ఏమంటారా..."

టీ తీసుకుంటూ సత్యజ్ఞాని

"అవులేసార్, అంతేలేండి సార్..." అంటూ అందరికీ టీ అందించాడు.

టీ తాగుతూ డాకన్నగారితో వూరి విషయాలు మాట్లాడుతూంటే

"గుల్లోకి పోయొస్తాం రాండిసార్..." అంటూ అందరూ వుత్సాహకంగా అడిగారు. ఆ మాటకు

సత్యజ్ఞాని నా వైపు చూస్తూ నవ్విన నవ్వులో చూసావా వీళ్ళ వుత్సాహం అన్నట్టుంది.

పేటలోంచీ రోడ్డు దాటుకొని గుంపుగా రాముని గుడిలోకి వస్తూంటే గుడిలో వున్న నంబి పూజారి గుడ్లప్పగించి చూస్తూన్నాడు. మమ్మల్ని

"పూజసేయి సామీ, మా సారోల్లు వొచ్చినారు..." అందరూ వుషారుగా అంటూంటే ఆయన గర్భగుడిలోకి వెళ్ళి మంగళహారతితో బయటికొస్తూ చూస్తున్న చూపులు మింగలేక కక్కలేక అన్నట్లున్నాయి.

నేను డా కన్నగారిని "రోజూ గుడికొస్తారా...." అనడిగితే "యాడొస్తాం సార్... మనకు పేటలో మారెమ్మ గుడి వుంది... దీంట్లోకి బంధువులొస్తే తోలికొస్తాం... పెండ్లిండ్లు జరిగే మెరువునితో యింటి కొస్తాము, సావుల కొస్తామా..." 'ఇదంత ముఖ్యంగాదు రావల్లంటే రావల్ల అనుకుంటూ వస్తాము' అన్నట్లుంది ఆయన మాటల ధోరణి. గుళ్ళోంచీ బయటికొచ్చి, అందరికీ చెప్పి మా ప్రయాణం కొనసాగించాం.

"చూడూ... ఎంత చైతన్యమో... మాదిగలు హోటల్లోకెళ్ళి డిమాండ్ చేయడమూ, వూరిగుడిలోకి వెళ్ళి పూజ చేయమని అడగడమూ మామూలుగా గ్రామాల్లో చూడగలమా....:"

"అవును నేనూ అదే ఆలోచిస్తున్నా... ఎంత అద్భుతమైన దాన్ని చూశానా అని యిది వినడానికి చాలా మామూలుగా వుండొచ్చుగానీ. యిది ఎలా జరిగిందో గానీ పేట వాళ్ళు యింత మామూలుగా గుల్లోకి పోయిరావడం, వూర్లో అందరూ వెళ్ళే గుల్లోకే వెళ్ళడం ఎంత గొప్పగా వుందో బలే జరిగింది గదా...."

"నిజమే గొప్ప విషయమే... దీని కోసం తక్కువ అవస్థలు పడ్డారా... ఎంత యుద్ధం చేసారో, అయితే ఒక విషయం యీ గుడి మీద భక్తి లేదు వీళ్ళకి యిక్కడికి రావడం కేవలం గుర్తింపు కోసం మాత్రమే". "అవును అదీ తెలుస్తూనే వుంది... రాముని మాయలో పడకుండా మారెమ్మనే నమ్మడం కూడా గొప్ప విషయమే"

◇◇◇



ఆ వూరి పేరు గుడిపాడు. యస్సీలకు కేటాయించిన నియోజక వర్గంలోని గ్రామం.

పూర్వం యీ ప్రాంతంలో తుంగభద్రా తీరం వెంబడి జైన ఆశ్రమాలూ దేవాలయాలూ ఉండేవట. రామానుజాచార్యులు విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేస్తున్న క్రమంలో జైన పండితుల్ని తన వాదనా పటిమతో ఓడించి జైనాశ్రమాల్ని 'పాడు' చేస్తూ వెల్లాడట.

జైనాశ్రమాలు పాడు పడినందుకు గుర్తుగా యీ వరుసలో చాలా గ్రామాలకు పేరు చివర 'పాడు' వుంటున్నదని ఒక కథ.

గుడిపాడు కూడా అట్లాంటి (గ్రామమే) జైనాశ్రమమే అయ్యుండవచ్చు. కారణం ఏమైనప్పటికీ యిక్కడ యిప్పటికీ క్రైస్తవ ప్రభావం చాలా తక్కువ. ఊరికున్న ఒకే ఒక నీటి వనరు పెద్దకుంట. అందులో ఎప్పుడూ నీళ్ళుంటాయి. ఆ కుంటలో వూరి రెడ్ల కడవలైనా పేటవాళ్ళ కడవలైనా ఏక కాలంలో మునుగుతాయి అదీ యీ వూరి ప్రత్యేకత.

అట్లాంటి ఊర్లో–

అందరూ చందా తీసుకొని రామాలయాన్ని కట్టించుకున్నారు. మాదిగల్లోనూ రైతులున్నారు. వాళ్ళూ చందాలిచ్చారు. నిర్మాణం పూర్తి అయి విగ్రహ ప్రతిష్ఠాపన చేసే ముందు రోజు ధ్వజస్తంభాన్ని ప్రతిష్టించారు. అక్కడ ప్రారంభమయింది కథ.

ధ్వజస్తంభం నిలపడానికి వూరిజనమంతా మూగి చాలా ప్రయత్నమే చేశారు. పైకి లేస్తుంది కిందికి వాలిపోతుంది. చాలాసార్లు యిలానే జరుగుతూంటే

పూజారికి అర్థంకాక తలగోక్కోని... యోచన చేసి "అయ్యా పెద్ద రెడ్డిగారిని పూజ చేసి టెంకాయ కొట్టమనండి, అప్పుడు లేస్తుంది" అన్నాడు.

పూజారి ఆలోచన కరెక్టే అనుకొని రెడ్డి భక్తిశ్రద్ధలతో తతంగం ముగించి ధ్వజస్తంభం నిలుపమన్నాడు.

పైకి లేచింది. ఎటు వైపు బ్యాలెన్స్ తప్పిందో అంతలోనే వాలిపోయింది.

తర్వాత, పూజారి చిన్న రెడ్డిని పూజ చేసి టెంకాయ గొట్టమన్నాడు. ఆయన పేరుతోనూ స్తంభం పైకి లేచి – వాలిపోయింది.

అన్ని వైపులా సమాన బలం పెట్టడం లేదన్న విషయమే మరిచిపోయి. వూర్లో అందరి పేర్ల మీదా పూజలు చేయడాలు, లేపడాలూ, ఒరిగిపోవడాలూ తంతులా జరుగుతూంది.

చూసీ చూసీ విసుగొచ్చిన పేట యువకులు ఆఖరుకు స్తంభాన్ని లాగే వాళ్ళలో చేరి చుట్టూ మోకులను సరిచేసుకుంటుండగా

పూజారి ఎవరి చేతుల్లోదో టెంకాయ వున్న పళ్ళెం అందుకొని అందులోని టెంకాయ కొట్టి, పళ్ళెం వెనక్కిస్తూ చూసాడు

అలివేలమ్మ అందుకుంటోంది గర్వంగా, ఆమె పక్కనే పాటలు కట్టే కుంటెమ్మ కూడా వుంది. పూజారి గుండెల్లో రాయపడింది.

ఈసారి స్తంభం లేచింది. వాలిపోతున్న దాన్ని పేట జనాలు పట్టుకున్న వైపు బ్యాలెన్స్ చేయగా నిలబడింది. వూర్లో కొందరు దీన్ని గమనించారు.

స్తంభం నిలబడడమే ముఖ్యం అనుకొని అంత శ్రమలో ఆ విషయాన్ని వదిలేశారు.

మరుసటి రోజు అసలు కథ అక్కడ్నుంచే మొదలవుతుందని వాళ్ళు వూహించనేలేదు.

అయితే పూజారి మాత్రం 'కుంటిది దీని మీద పాటలు కట్టి పాడుతుంది' అనుకున్నాడు మరుసటి రోజు.

"ధ్వజస్తంభాన్ని మేము నిలుపగా లేని అంటు మా పిల్లలు ముట్టుకుంటే వొచ్చిందా..."

దుబ్బన్న గద్దించి అడుగుతూంటే పెద్దరెడ్డితోపాటు వూర్లో చిన్నాచితకా కులాల వాళ్ళందరూ కుతకుత వుడికిపోతున్నారు. "అసలు గరుడ స్తంభం నిలబడిందే మేమిచ్చిన టెంకాయతో. అది మరిచిపోతిరా..." డా కన్న అంటూంటే భరించలేకపోతున్నారు.



గుడి ముంగిట వచ్చని మామిడి తోరణలతో, చెండుపూల హారాలతో, రంగు కాగితాలు రెపరెపలతో లౌడ్ స్పీకర్లో పాటలతో సంబరంగా,

గుళ్ళోకి పూజకై వస్తూన్న వూరి జనాలతో సందడిగా వున్న వాతావరణం ఒక్కసారిగా వుద్రిక్తంగా మారిపోయింది.

"యాడుండే వాళ్ళు ఆడుండాలవోయ్... పవిత్రంగా పూజలు చేసి విగ్రహ ప్రతిష్టాపన చేస్తుంటే మీ పిల్లని గుళ్ళోనికి పంపుతారా తప్పుగాదారా... తప్పు చేసింది గాక దాన్నే సమర్థించుకుంటా వారా తప్పుడ్నా కొడకా..."

"మాటలు మంచిగరానీ రోడ్డే యీ గుడి కట్టనీకె మేమూ చందాలిచ్చి నాము. మా పిల్లది గుడికట్టకాడికి వొచ్చినందుకే కొడతారా... పసిపిల్లలని గూడా చూడకుండా.... యిప్పుడు మేము గుల్లోకే వొస్తాము. ఎవుడు రానీరో సూస్తాము..." డా కన్న రెడ్డి మాటలకు తగ్గకుండా జవాబిచ్చాడు.

దెబ్బలు తిన్న పిల్ల డా కన్న చెల్లెలి కూతురు.

అందంగా అలంకరింపబడ్డ గుడి అరుగుల మీద ఆడుకుంటున్న వూరి పిల్లల్ని చూస్తూ అరుగు మీదకు తానూ అమాయకంగా ఎక్కి ముఖం పగిలేలా దెబ్బలు తిన్నది, బోయ రంగస్వామి తలారి గదా, చేతిలో ఎప్పుడూ పొన్నకర్రతో తిరుగుతూంటారు. దాంతో ఫటీమని యిస్తే పళ్ళూడి రక్తం కారదా... నిన్న గరుడస్తంభం ఎత్తడంలో పేటవాల్లు వున్నింది చూసినప్పట్నుంచీ పందుతున్న మంట చల్లారే దాకా ఆ పిల్లను తరిమి తరిమి కొట్టాడు రంగస్వామి.

ఆ పిల్ల ఏడుపూ, రక్తమూ పేటపేటను కదిలించింది. ఎందుకు కొట్టారో కారణం తెలుస్తూనే, నిన్న ధ్వజస్తంభం నిలుపడంలో తామూ భాగమైనప్పుడు, గుళ్ళోకి ఎందుకు పోగూడదూ, దీన్నిట్లా వొదలగూడదూ అనుకున్నారు. పేటపేట ఆడా మగా గుడి దగ్గరకు బయల్దేరినారు వాళ్ళముందు దుబ్బన్నా డా కన్నా రాముని వద్దకు వెళ్తున్న జాంబవంతుల్లా వున్నారు. పాటలు కట్టే కుంటెమ్మ వాల్లనే ఒకే తీరుగా చూస్తోంది, వాళ్ళ ముఖాల మీదుగా 'పాట' ఆమె లోపలికి దూకుతూ సుడులు తిరుగుతోంది.

పేట పేట గుడిముందర నిల్చొని తనను ధిక్కరిస్తూ వుండటం పెద్దరెడ్డికి అవమానంగా, కోపంగా వుంది. రెడ్డికి తెలుసు వూర్లో మంది వాళ్ళే ఎక్కువని. మొన్న ఎలక్షన్లలో ఎం.పి.టి.సి.గా పేటలో వాణ్ణే నిలపాల్సి వచ్చింది. వాడొక నోరులేనివాడు, తన మాట వినేవాడే కానీ యిలాంటి సందర్భాల్లో పనికిరాడు. దుబ్బన్ననూ, డాకన్ననూ తను లొంగదీసుకోలేడు... ఏమి చేయాలో తెలీని రెడ్డి బోయరంగస్వామి వైపు చూసాడు.

"ఏం బోయోనివిరా నువ్వు... థూనీ..." అన్నట్లుందా చూపు.

"మేమూ వొచ్చి మీరూ వొచ్చి గుల్లో పూజలు చేస్తే మా విలువ ఏంది వోయ్, మా కన్నా తక్కువ నా కొడుకులు మీరు గుల్లోకి రాగూడదు... ఎట్లా వొస్తారో అదీ చూస్తాము..."

బోయ రంగస్వామి రెడ్డి చూపు సందేశాన్ని అందుకొని తన కులవొల్లనందరినీ కూడగట్టుకుంటూ ముందుకొచ్చినాడు.

మిగతా చిన్నా చితకా కులాల వాళ్ళు కూడా 'మాదిగలేంది గుల్లో కొస్తామనడం ఏంది దొమ్మపొగురు నాయాండ్లు కాకపోతే... కాల్లతో రాచి పారేయుల్ల యీ నాయాల్లని' అంటూ ఏకం అయినారు.

మాటా మాటా పెరిగి చేయీ చేయీ కలిసి కట్టెలు గాల్లో ఆడి యిరువైపులా రాళ్ళ వర్షం కురిసీ నల్గురైదుగురు పేట జనం తీవ్రంగా గాయపడినారు. వాళ్ళలో యిద్దరి పరిస్థితి మరీ తీవ్రం. చాలా మందికి రాళ్ళు తగిలి రక్తాలు కారినాయి.... కుంటెమ్మ నుదిటికి గాయం అయ్యింది. వీళ్ళ గాయాలతో పోల్చితే వూర్లో వాళ్ళకు పెద్దగా తగల్లేదనే చెప్పాలి.

విగ్రహ ప్రతిష్టాపన తర్వాత గుడి ఆవరణ రక్తసిక్తమైంది. పేట జనాల రక్తంతో రాముని కడుపు చల్లబడింది. సాయంత్రానికంతా వార్త కర్నూల్లో పాకింది. డా కన్న ద్వారా సత్యజ్ఞానికి విషయం తెలుస్తూనే తన మనుషులతోపాటు కొందరు విలేకరి మిత్రుల్ని కూడదీసుకొని వచ్చి పేటకు అండగా నిలిచాడు.

ఉదయం అన్ని వార్తా పత్రికల్లోనూ "దళితులపై దాడి" ప్రముఖ వార్త అయ్యింది, దాంతో పాటు ఆసువుగా పాటలు కట్టి పాడుతున్న కుంటెమ్మ కూడా వార్త అయ్యింది. ధ్వజస్తంభం నిలపడం దగ్గర్నుంచీ రాళ్ళ వర్షం దాకా వూర్లో రెడ్లు చేస్తున్న అన్ని అకృత్యాలపైనా ఆమె పాడుతున్న పాటలు విన్న, వాళ్ళ ఆశ్చర్యం వార్తా కథనమై అందరికీ తెలిసింది.

పేట వాళ్ళు పోలీస్ స్టేషన్లో కేసు పెట్టాలనుకున్నప్పుడు 'వూర్లో వుండే రెడ్ల మీద మాత్రమే కేసు పెడదామనీ, మిగతా సన్నా చిన్నా కులాలొల్లని కేసులో యిరికించేదొద్దని' డా కన్న వాదించినాడు. 'అదేందిరా అట్లంటావు వా నాయల్లేమి తక్కువొల్లా, వాళ్ళేగదా యింత జేసిందని' దుబ్బన్న అంటే

"అయినా గానీలే కేసు వాళ్ళ మీద పెట్టేదొద్దు... అన్నిటికీ ఎనకలుండేది ఎవురు... రెడ్లు గదా.... వాళ్ళతోనే తేల్చుకుందాం..."

అన్నాడు.

"యిదేం ఎత్తబ్బా... అర్థం అయితాలేదా..." అని బజారన్న కలగజేసుకుంటే "అవు సిన్నాయనా... యిది ఎత్తు అనుకో, యింకేమైనా అనుకో యిదే మనం సేయాల్సింది" అని అందర్నీ వొప్పించి స్టేషన్లో అట్రాసిటీస్ యాక్ట్ కింద కేసు పెట్టించినాడు.

యస్సైని కూడా ఆశ్చర్యపోయి 'అదేమబ్బా మిగతా వాళ్ళనందరినీ వొదిలేసి రెడ్ల మీద మాత్రమే పడుతున్నారు' అన్నాడు.

ఆ వార్త వూర్లో పాకి బోయగేర్లో ప్రతి యింట్లోనూ గుసగుసలు. అట్రాసిటీస్ యాక్ట్ గురించి లాయర్లూ పోలీసులూ చెప్పగా విని హడలిపోతూ ఏమి చేయాలబ్బా అని అనుకుంటున్న కింది కులాలకు ఆశ్చర్యంతోపాటు, వూపిరి తిరిగినట్లైంది.

పేపర్లో వొచ్చిన కథనాలూ, దళితుల జిల్లా వ్యాపిత నిరసనలూ, జిల్లా యంత్రాంగాన్ని నిందితుల్ని శిక్షించేలా ఒత్తిడి చేశాయి.

ఊరి రెడ్ల చుట్టూ వుచ్చు బిగుసుకుంది.

ఆ విషయం వాళ్ళకూ స్పష్టంగా అర్థమయ్యింది. వాళ్ళ లాయర్లూ అనుకూలురైన పోలీస్‌లూ అదే చెప్తున్నారు. అట్రాసిటీస్ యాక్ట్‌తో చాలా తలనొప్పి. శిక్ష గ్యారంటీ.

అయితే అక్కడే కథ కాస్తా మలుపు తిరిగింది.

◇◇◇

దుబ్బన్నా డా కన్నా బావా బావమరుదులు. పేటలో పెద్ద రైతులే. రెండు కాడ్ల ఎద్దులూ, పెద్ద యిండ్లూ ఇరవై, ఇరవైయైందు ఎకరాల భూమీ.... వ్యవసాయాన్ని నమ్ముకున్న మట్టి బిడ్డలు.

డా కన్నా అక్కనే దుబ్బన్న పెండ్లాడిందేది.

అక్క అలివేలమ్మంటే డాకన్నకు ప్రాణం. అలివేలమ్మ వొళ్ళు అలుపెరగనిది. పుట్టింట్లో ఎంత కష్టపడేదో అంత అభిమానమూ పొందేది. అయితే అత్తగారింట్లో కష్టమొక్కటే పొందింది.



దుబ్బన్న పై పై తిరుగుళ్ళకు అలవాటు పడిన బావతం. మంది పనుల మీద తిరుగుతున్నాననో కాంట్రాక్టు పనుల మీదనో గంజి ఖద్దరు నలగకుండా రోజూ ఆఫీసుల చుట్టూ తిరగడమే ఒకపనిగా చేసుకొని యింటి పనులూ వ్యవసాయపు పనులూ పట్టించుకునే వాడు కాదు. అలివేలమ్మ అత్తగారింట్లో కాలుమోపినప్పట్నుండీ కొడుకు ఎదిగి డిగ్రీదాకొచ్చినా, యింటి తిప్పలన్నీ ఆమెవే. దుబ్బన్నను మనోహర్ గురించి ఎవరన్నా అడిగితే.

'నా పనుల మీద నేనుంటానా... వానికత నాకు తెలీదు.. అంతా వాల్లమ్మే' అనేవాడు.

అలివేలమ్మకు పొద్దున్నే లేచినప్పట్నుంచీ రాత్రయ్యేదాకా పనులు... ఒకటే పనులు... పాచి కసువులు వూడ్వడం, గాడిపట్లో వూడ్పించడం మొదలుకొని రొట్టెలు కొట్టీ కూరలు చేసీ, కూలీలను తొలకపోయి చేన్లలో పనులు చేసుకోవడం దాకా ఆమెను చుట్టుకోని అలివిగాని పనులు.

అలివేలమ్మ కష్టమే ఇరవైయేళ్ళుగా ఆ యింటి భాగ్యాన్ని పెంచుతోంది.

"ఆమె కాబట్టి అట్లాంటి మొగున్తో కాపురం చేస్తాంది" అంటుంది లోకం వాళ్ళ సంసారాన్ని గురించి.

దుబ్బన్న పగలంతా ఖద్దరు నలక్కుండా తిరగడమే కాదు చీకటి పడితే చుక్కలేకుండా వుండలేదు. పగలంతా దేశమ్మీద తిరిగి రాత్రి యేవేళకో తాగి యింటికొచ్చి శ్రమ చేసి అలిసి నిద్రపోతున్న అలివేలమ్మను నిద్రలేపి చిన్నచిన్న వాటికి గొడపెట్టి ఆమెను తన్నేది. పిల్లికి ఎలుకను చూస్తే చెలగాటం రేగినట్లు ఆమె బిక్కచచ్చి దెబ్బలు తింటూంటే ఆనందంగుండేది అతనికి. ఇరవై ఏండ్లుగా అలివేలమ్మ యీ హింస పడుతూనే వుంది. ఆ బాధ పాటలు కట్టే కుంటెమ్మ ద్వారా పాటై చేన్లలో విత్తనాలు విత్తేప్పుడో, కలుపులు తీసేప్పుడో, పంట కోతలప్పుడో పల్లె పడుచుల కళ్ళల్లో కన్నీలవుతూ వుంది.

ఈ మధ్యా దుబ్బన్న, పెద్ద రెడ్డిమీదనే కేసు పెట్టి ముప్పుతిప్పలు పెడుతున్నానని, తన చుట్టూ మూగే అనుచరులతో గప్పాలు కొడుతూ, వాళ్ళు 'నువ్వంతటోనివి', 'యింతటోనివంటే' వుబ్బి పోతూ మరింత తాగుతున్నాడు. తాగి యింటి కొచ్చి అంతగానూ అలివేలమ్మను హింస పెడుతున్నాడు.

ఆమె ఓర్చుకోలేకపోతుంది. తన బాధ ఎవరు తీరుస్తారు. తమ్మునికి చెప్పుకొనీ వుపయోగంలేదు. బావంటే గౌరవంతో అతనికి బుద్ధిమాటలు చెప్పలేడు, అమ్మ మాటలూ అత్తమాటలూ మొగుడు లెక్క చేయడు. ఆమెకు మిగిలిన ఏకైక మార్గం కొడుకు చెప్పినట్లు చేయడం.

దుబ్బన్న ఆ రాత్రి చిత్తుగా తాగొచ్చి పిచ్చిగా వొర్లుతూ అడ్డమొచ్చిన వాల్లమ్మను ముసల్దని కూడా చూడకుండా తోసేసి భార్య జుట్టుపట్టుకొని యిష్టమొచ్చినట్లు తన్నీ తన్నీ అలసిపోయి నిద్రబోయినాడు, మత్తు వదలి పొద్దున్నే కళ్ళుతెరిచి చూస్తే అలివేలమ్మ యింటిలో లేదు. "దుర్మార్గం నాబట్టా... పెండ్లామంటే లెక్కయ్యక ఆ తీరుగా పోరుబెడితే యెట్లాదైతే కాపురం చేస్తాది... బావో చెరువో సూసుకోనుంటాది..." తల్లి అరుస్తూంటే దుబ్బన్న వొంట్లో సన్నగా వణుకు పుట్టింది. బావ మరిది డాకన్న యింటికిక పోయి అడిగినాడు. వాళ్ళు ఆశ్చర్యపోయి వెదకడం మొదలుపెట్టినారు. అలివేలమ్మ కనపడడం లేదు. వూరి చుట్టూ అన్ని బావుల్లోనూ కుంటల్లోనూ వెదికారు నిరాశే ఎదురైంది. ఒక దినం గడించింది... రెండు దినాలు గడిచాయి... వెతుకుతూనే వున్నారు. తెల్సిన వూర్లకంతా మనుషుల్ని పంపారు జాడలేదు... వారం గడిచింది... నెలలు గడుస్తున్నాయి. అలివేలమ్మ భర్తపోరు పడలేక యిల్లు వదలి పోయిందని లోకం అంటోంది. పాటలు కట్టే కుంటెమ్మ నోటి పాటై దుబ్బన్న దుర్మార్గం వూరంతా పాకింది.

పేటలోని జనాన్నంతా కూడగట్టుకొని రామాలయంలోకి దూరి దాన్ని మైలు పరిస్తే దేవుడు వూరికే వుంటాడా అందుకే పెళ్ళాం యిల్లొదిలిపోయింది. అరిష్టం కొట్టింది వాణ్ణి అని వూర్లో కొందరు అనుకుంటున్నారని తెలిసి దుబ్బన్నకు పిచ్చెక్కింది.

'మగోడన్నంక కొట్టకుండా వుంటాడా పెండ్లాన్ని, ఆ యింతకే యిల్లిడిసి పోతే ఏమనల్లా.... అట్లయితే దేశంలో సంసారాలు నడిచినట్లేనా..." దుబ్బన్న మనసు మూలుగుతుంది.

"డా కనికి, ఆ కుంటి దానికి తెలీకుండా వుంటుందా ఎక్కడికి పోయుండేదీ", తనకు నమ్మకమైన వాళ్ళు యిట్లాంటి మాటలు చెప్తూంటే, అనుమానం కూడా వొస్తాంది.

కథ యిలా మలుపు దిరిగిన సందర్భంలో

కేసుపై అరెస్ట్ అయి బెయిల్ తీసుకొని బయటికొచ్చిన రెడ్డిని

లాయర్లు చెప్పిన మాటలు భయపెడుతున్నా

ఇన్ని లక్షలు పోసి గుడికట్టిస్తే పనికి రాకుండా పోయేనే అని యింటికొచ్చే వాళ్ళందరితోనూ అంగలారుస్తూనే వున్నాడు. తనపైన కేసు పెట్టిన, పేటవాళ్ళ మీద కారాలూ మిరియాలూ నూరుతూనే వున్నాడు.

"లాయర్లు రాజీ చేసుకోండి లాకుంటే శిక్ష తప్పదు.

అంటూంటారు అయినా యింత బతుకు బతికి యింటినెక సచ్చినట్లు ఆ నాయళ్ళతోని రాజీ చేసుకోవడమూ... సన్నజాతి, నా కొడుకులు... వొగొగన్ని వొంగబెట్టి పియ్య రాసిన సెప్పుతో కొడదామంటే యీ గబ్బు గవర్నమెంటు అడ్డముంది... కలెక్టరూ యస్పీ ఆకులం నాయండ్లే. ఏం జేయనీకీ ల్యాకుంటుంది. రెడ్డి పుట్టుక పుట్టి వూర్లో మాట సెల్లుబడి కాకుంటే పక్కూర్లలో నా పరువేంగావల్లా" అనుకొని

ఊర్లో రైతులందరికీ మాదిగల్ని పనిలోకి రానీయొద్దని కట్టడి చేసి, మంగలి నారాయణనూ చాకలి నాగన్ననూ పిలిపించి "లే! ఎవురేగాని మీ కులమోల్లు మాదిగ నాయండ్లకు గెడ్డాలు గీక్కూడదు గుడ్డలు వుతగ్గూడదు సూడండ్రి" ఆజ్ఞలు జారీ చేసినాడు. రెడ్డి మాట శాసనంలా అమలయ్యింది.

ఇదంతా బయటకు తెలుస్తూ, ప్రజా సంఘాలు దీన్ని ప్రచారం చేస్తుండడం వల్ల పనులు బడి గూడూరుకో, కర్నూలుకో ఆఫీసులకు పోయినప్పుడో రెడ్డికి యిబ్బందిగా కూడా వుంది.

అలాంటి సమయంలోనే

''ఇదింటివా రొడ్డీ దుబ్బన్నగాని పెండ్లాము యిల్లిడిసిపోయింది. యాడుందో తెలీక ఆనా కొడుకు సస్తాన్నాడు, దాకడే వాల్లక్కను దాపెట్టినాడని వానికి అనుమానమంటూ... వాళ్ళకు వాళ్ళకే యిచ్చాడు పడేతట్లుంది..." బోయరంగస్వామి విషయం చేరవేసినాడు.

తాను లొంగకుండా ఆ నాయాల్లని ఎట్ల లొంగదీసుకోవాలా వాళ్ళను తన కాళ్ళ కాడికి ఎట్లా రప్పిచ్చుకోని కేసు నుంచీ బయటపడాలా అని చూస్తున్న రెడ్డికి బోయరంగస్వామి మాటలు కొత్త ఆలోచనల్ని యిచ్చాయి. ఆ ఆలోచనలతోనే తనకు అనుకూలుడైన ఎమ్మెల్యే నాగమునిని కలిసి ఎత్తులు వేసినాడు.



తర్వాత నాల్గు రోజులకు ఎమ్మెల్యే నుంచీ దుబ్బన్నకు పిలుపొచ్చింది. వెళ్ళిన వెంటనే కూచోబెట్టి మర్యాదలు చేసి 'ఏందుబ్బన్నా యస్సీ కార్పొరేషన్‌లోన్ల సంగతి యాడిదంకొచ్చింద'ని అడిగానాడు.

"అదే సార్ మీరే సూడల్లా... ఆ ఈడి అదిగో యిదిగో అని తిప్పుతాండాడు" అని అనగానే

"అదెంతపని దుబ్బన్నా ఆ ఈడీ మనవాడే మన మాటింటాడు చెప్పి సాంక్షన్ చేయిస్తా వూర్లో మీటింగ్ బెట్టి లోన్లు పంచుదాం... అది సరే గానీ వూర్లో రెడ్లతోని మనకెందుకు లిగాడి గుల్లోకి మనం పోతే ఎంతా పోకపోతే ఎంతా, కూడుకొస్తుందా కురాకొస్తుందా, వూర్లో వాళ్ళతోని గలాటా యాలా కోర్టుల చుట్టూ వాళ్ళను తిప్పేది ఏంటికి, రాజీగాండ్రి రెడ్డితోని నేను మాట్లాడతా" అని పాచిక విసిరాడు.

"అదిగాదుసార్ వాళ్ళు మనోల్లని ఎంత అవమానం జేసిరి గరుతస్తంభం నిలబడి నిగిందే మన బలంతోని ఆది క్యూడా రానీయమండ్రి మనోల్లని తిప్పులాడిచ్చి తన్నిరి కేసులు పెట్టి యిచ్చాడు. రాజీ అంటే మనోల్లు నన్నేమంటారో"

"ఓర్నీ దుబ్బన్నా నీకు మాట రానిస్తావా జనాలకు యిన్ని లోనూ యిన్ని పన్లూ చేయిస్తాండావు, రాజీ గూడా మన మంచికేనయ్యా యీ గలాటలోని మీకు వూర్లో పనులు లాకుండైనాయా, వాళ్ళకూ యిబ్బంది గుందా, యిద్దరికీ యిదేమన్నా బాగుందా చెప్పు గుళ్ళోకి దూరితే ఏమన్నా కిరీటమొచ్చిందా... మీ వూర్లో మీరే మందెక్కువ గాబట్టి రెడ్లు తగ్గిండారుగానీ లాకుంటే యింకా ఎంత ఘోరం జరిగేదో... అందుకే దీన్ని మొగ్గలోనే తుంచేయమంటున్నా అదీగాక పంచాయితీ ఎలక్షన్లొస్తాండాయి రిజర్వేషనైలే నిన్నెనిలుపుతానంటున్నారు? ఆలోచించు.

"... కానీ సార్ మావోడు దాకడు వొప్పుకుంటాడా... యింత జరిగీ వూరికే రాజీ అయితే మమ్మల్ని మేము తగ్గించుకున్నట్లు కాదా..."

"ఏంది దుబ్బన్నా అట్ల మాట్లాడుతావు? నువు నాయకుడివి. నువ్వు చెప్తే నీ మనుషులు వినాలా దా కన్దే ముందయ్యా వాడు నీ బావమర్ది... నీ కాంట్రాక్టు బిల్లులు పాస్ గావాల్నావొద్దా... దేవుందేముందయ్యా నాలుగు రాళ్ళు సంపాయిల్లగానీ..."

యెమ్మెల్యే మాటలకు దుబ్బన్న ఆలోచనల్లో పడ్డాడు. వేడి మీదనే యినుమును సాగదీయాలన్నట్లు రెడ్డి కూడా సరిగా ఆ సమయానికే అక్కడికొచ్చి

"కాదురా దుబ్బన్నా నీ పెండ్లాం వెళ్ళిపోయిన సంగతి దాకనికి తెలీకుండా వుంటుందా... రొంత కండ్లు తెరచి చూడూ... మొన్న పెద్దాసుపత్రిలో నీ పెండ్లామూ నీ కొడుకూ కన్పించిరంటా... అదే మీ ఓబన్న చిన్నాయన కూతురు కనింటే చూన్నీకె కాన్పుల వార్డుకు పోయినట్లున్నారు. ఆ కుంటిది కూడా ఆడనే వున్నెంటా, యింత పబ్లిక్‌గా దా కదు నీకు మోసం చేస్తాంటే తిక్కోని లెక్క వుండావు గదరా..."

దుబ్బన్నకు దా కన్న మీద కోపం నషాలానికి ఎక్కింది. అట్నుంచీ అటే బుధవారపేటలోని చిన్నాయన యింటికి పోయినాడు తన కొడుకే పథకం వేసి అళివేళమ్మను కర్నూల్లో వుంచుకున్నాడని నిర్ధారించుకొని, కొడుకును నిలదీశాడు.

'నువ్వూ నీ మేనమామా కూడబలుక్కోని నన్ను యింత మోసం చేస్త్రా' అని రంకె వేసినాడు. 'నా పరువూ మర్యాదా దీసి నల్లుర్లో తలెత్తుకోనీకుండా చేస్తిరి గదరా' అని అంగలార్చినాడు.

'మాయనెందుకంటావునాయనా.... ఆయనకేమీ తెలీదు. యిదంతా నీ నుండే జరిగిందే... నీకు అమ్మ విలువ తెలిసి రావాలనే యిట్లా చేసినా యిప్పటికి నువ్వు మారనంటే నేనూ అమ్మా వేరే వుంటాము, తర్వాత నీ యిష్టమని' మనోహర్ తెగించి చెప్పేటప్పటికి

"ఇదంతా నీ మేనమామ దా కడిచ్చిన బలంరా... మొదట వానికత చూస్తా" అని వూరికొచ్చి దా కన్నను పిలిపించినాడు

"ఏం బావా పిలనంపితివి"

"అట్లా కూపోరా దాకా... మనోల్లంతా పనులు లేక, కూలికి బయటి వూల్లకు పోలేకా అవస్థలు పడతాండారు... సాకలోల్లూ మంగలోల్లు కూడా మనల్ని మాట్లాడియ్యడంలా, నువ్వూ నేనూ వున్న కాడికి బాగుండాము, మనకు గడుస్తా వుంది లేనోల్ల కడెట్లా, ఇదేం బాగాలేదుగానీ, వూరోల్లతోని రాజీ చేసుకుందాం... ఏమంటావు"

"వాల్లేమన్నా రాయబారమంపినారా..."

"అదేమీ లేదుగానీ యెమ్మెల్యేసారు చెప్తాన్నాడు. ఎంత కాల మిట్లా కాలబడతారు. యిద్దరికీ రాజీ చేస్తా నంటాన్నాడు"

"కేసు బలం సందనీ గెలవలేమనీ మనూర్రెడ్లే అయిన కాడికి పోయింటారు, బగట్ పార్టీ గదా ఆయన నీకు చెప్పింటాడు. ఒక మాట చెప్తాను బావా, కేసు మన దిక్కే బలంగా వుంది. మనూర్రెడ్లకు బుద్ధి చెప్పడానికిదే ఛాన్సు, గుల్లోకి రానీంది ఒక్కటే కాదు సానా వుండాయి, హోటల్లకి రానీరు, పోతే రెండు గ్లాసుల పద్ధతి వుండనే వుంది. బస్సుల్లో వాల్లెక్కితే మనము నిలబడాల, ఆటోల్లో పక్కన కూచోనీకె లేదు. మన ఆడోల్లని ఎంత మందిని గబ్బులేపిండారో లెక్కేలేదు. తప్పుకుంటే శానా వుంది.... ఒక దగ్గరన్నా మన బలమేందీ వాళ్ళకూ తెలిసి రావొద్దా."

"వాళ్ళ గుళ్లోకి రానీకుంటేనేమి మనకు గుడి లేదా, వాళ్ళ ఆటోల్లోకి రానీకుంటే మనోల్లే యిబ్బడు ముప్పైయారు ఆటోలు మనూర్నించే నడుపుతారు ఆ నాయల్లే మన ఆటోలు ఎక్కల్లా, నీ కేమన్నా చెప్తుంటే ఒక రకంగా ఎక్కదు. ఆ సంగమొల్ల మాటలు యినుకుంటా యికారాలు పడ్తాండావు. నీకు గడుస్తాందని మనోల్లందరికీ మీ సంగమొల్లు చెప్పే మాటలు కూడా బెడ్తామేంలే, కేసు తెంచుకుంటే అందరికీ అంతో యింతో వూపిరి తిరుగుతాది" దుబ్బన్న ఆగ్రహం బిగబట్టుకుంటూ మాట్లాడినాడు.

"నీకు రాజకీయంగా వూపిరి తిరగనీకె మందికి మోసం సెయ్యద్దు బావా. మనూరి రెడ్లకు బుద్ధి సెప్పాలంటే యీ కేసు నడపాల్సిందే అంతగ్గావాలంటే కేసు వొదులుకుంటాము గుళ్లోకి మనల్నీ రానీమను రెండు గ్లాసుల పద్ధతి తీసేయమనూ, రెడ్లను అంతో యింతో వొంచుకోకుండా రాజీపడితే మందికి నువ్వు మోసం చేసినట్లే అయితుంది..."

ఎంతో శాంతంగా చెప్పినాడు డా కన్న.

"నువ్వు నాకు చేస్తాన్న మోసం కంటే మందికి నేను మోసం చేస్తాన్నానేంరా..."

"నీకు నేనేమి మోసం చేస్తాన్నాను బావా"

"ఏమీ ఎరగనట్టు మాట్లాడొద్దురా.... లంగ నా కొడకా... మీయక్క యాడుందో నీకి తెలీదేంరా నన్ను ఏ మారుస్తాండావు".

తీవ్ర స్వరంతో అడిగినాడు.

"నాకు సంబంధంలేదు సూడు బావా, నీకూ, నీ కొడుక్కూ సంబంధించింది".

"నీకి తెలీదేంరా... నువ్వు పురెక్కించ్చింటావు... నా సంసారం ఆగమైతావుంటే నీకి సంతోషంరా..."

".... కొట్టి బయటకు నూకింది నువ్వు.... యానాడన్నా సరిగా చూసుకున్నావా ఆయమ్మను... ఆమె ఎన్ని అవస్థలు పడుతున్నా మేమే మన్నా అన్నామా... మాయంతకు మేం ఏడ్చుకున్నాంగానీ... యిప్పుడు మమ్మల్ని అడుగుతావా... సంసారం ఆగమైతావుందని..."

"చూడ్రా రెండ్రోజుల్లో మీ అక్కను పిలుచుకొని రావల్లా... నువ్వే అందరినీ రాజీకి వొప్పిచ్చల్లా... లాకుంటే జరిగేదేమీ చెప్పను చేసి చూపిస్తా..."

డా కన్న ఏమీ బదులు పలక్కుండా చరా చరా వెళ్ళిపోయాడు. ఆ తర్వాత దుబ్బన్న వేగంగా పావులు కదిపాడు.

ఎస్.సీ కార్పొరేషన్ లోన్ల కోసమని మందిని పోగేసుకొని తిప్పి శాంక్షన్ లెటర్లు జారీ చేయించి, ఇరవై మందికి వచ్చిన వాటిని చూపి వంద మందిలో ఆశలు కల్పించాడు.... అక్కడితో వదలకుండా డా కన్న దీనికంతా అడ్డమొస్తున్నాడనీ వాని మాటలు వినొద్దనీ ప్రచారం చేయమని తన ముఖ్య అనుచరులకు చెప్పాడు...

వీటికి పరాకాష్టగా ఒక మధ్యాహ్నం డాకన్నవీ అతని మనుషులవీ గడ్డివాములు అంటుకొని మండిపోయినాయి, ఆ రాత్రి డా కన్న పొలంలో కరెంటు మోటారును ఎవరో దొంగిలించారు. గడ్డివాములు ప్రమాదవశాత్తు అంటుకున్నాయేమోనని కొందరన్నారుగానీ, చాలా మందికి అది ఎవరు చేయించారో అర్థమవుతూనే వుంది. ఇంకొందరు తమవేం కాలిపోతాయో, తమ వస్తువులు ఏ దొంగలెత్తుకుపోతారోనని భయపడ్డారు.

రెండో రోజు కుంటెమ్మ కొడుకూ కోడలూ పక్కూర్నుంచీ సైకిల్ మీద వస్తూ వుంటే, అతన్ని కొట్టి పడేసి అమ్మాయిని అత్యాచారం చేశారు.

డా కన్నకు బావ ఎత్తులు అర్థమవుతున్నాయి.

'దుబ్బ న్నెంబడి వుంటే లోన్లు అవీ యివీ యిప్పిస్తాడు. ఎదురేసుకోని యాల అవస్థలు పడల్లా' అని పేట మొత్తం తన వెనుక నడవాలన్న దుబ్బన్న వుద్దేశ్యం అర్థమయ్యాక డా కన్న వూరికే వుండలేకపోయాడు.

అడిగి నోల్లందరికీ లోన్లు యీటానికి ఏమన్నా లబ్బి దాపెట్నాడా కర్నూల్లో, అది అయ్యేదేనా, యీయన మాట్లింటే లోన్లు వొచ్చీదేమో గానీ రొడ్డి చేతిలో బొమ్మలమయితాము.... రొడ్డితో రాజీ ఏమిటికి పడల్లా యింత అవమానం సేయించుకోని...'

పేటలోని చాలా మందిది యీ మాటేనని తెలిసి, దాన్ని అందరికీ చెప్పడానికి జిల్లాలో ప్రజా సంఘాల్ని గుడిపాడుకు ఆహ్వానించి పెద్దసభను ఏర్పాటు చేశాడు. సత్యజ్ఞానీ, మనోహరూ ఆ ఏర్పాట్లు చేశారు.

మారెమ్మ గుడి ఆవరణలో షామియానా కింద హైదరాబాద్ నుండీ వొచ్చిన రేలా పాటల బృందం కదంతొక్కింది. ఊరు మొత్తం వాళ్ళ ఆటలతో పాటలతో వుపన్యాసాలతో ప్రతిధ్వనించింది. ఆ సభతో పేట మొత్తం యిదీ అని చెప్పలేని వుత్సాహంతో పొంగిపొర్లింది. దగా దగా మండిపోయిన గడ్డివాముల్లా వాళ్ళ మనసులు వేడెక్కినాయి.

ఆ సాయంకాలం వూరేగింపుగా పేట జనం తప్పెట్లు 'జజ్జనకు జనా... జనకు జనా' మోగుతూంటే గుళ్లోకి వెళ్ళి ఆనందంతో ఎగిరి దుంకినారు. ఆ వుత్సవంలో పదేళ్ళ శివుడు తప్పెటపై వేసిన దరువు అందరి శరీరాల్నీ కదిలించింది. కుంటెమ్మ (కోడలికి జరిగిన అన్యాయానికి) గాయపడ్డ గొంతు నిప్పులు కక్కింది. దుబ్బన్న దుర్మార్గాలను పాటకట్టి ఆడింది.

ఊహించని పరిణామాల్తో పేటలో దుబ్బన్నా వూర్లో రెడ్డీ నడుము విరిగిన పాములైనారు. ఏమైనా చేద్దామంట యిప్పుడే ఒక కేసుంది. మల్లా యింకొకటి నెత్తిమీదకు తెచ్చుకోవాల్సి వస్తుందని రెడ్డి భయపడ్డాడు.

ఆ రాత్రి అలివేలమ్మ యింటికి తిరిగొచ్చింది. ఏమీ జరగనట్లే మౌనంగా తన పనుల్లో తాను మునిగిపోయింది. ఆ రాత్రి దుబ్బన్నకు ఒక చుక్క మందు కూడా లోపలికి దిగలేదు.

◇◇◇

ఇప్పటికీ గుడిపాడు పేటకు బంధువులెవరైనా వొస్తే వాళ్ళకు మొదట ఆ వూరి ఈడిగవాల్లో బోయవాల్లో నడిపే హోటల్లో స్టీల్ గ్లాసులో టీ తాగించి, తర్వాత రామాలయంలోకి తీసుకపోయి నంబి పూజారితో పూజ చేయించి మంగళహారతి యిప్పిస్తారు. ఆ తర్వాత తమ యిండ్లలో ఆతిథ్యమిస్తారు. అది వాళ్ళు అతిథుల్ని గౌరవించే తీరు, లేదూ తమను తాము గౌరవించుకునే తీరు.

కృష్ణాపురంలో మాదిగలు వూరి పంచాయితీ కట్ట ముట్టుకున్నందుకే చావు దెబ్బలు తిన్నారనో, ప్యాపిలిలో వినాయకున్ని వూరేగిస్తూ భంగపడ్డారనో యీ గుడిపాడు కథను అబద్ధమని అనుకోకండి, వీలైతే ఒకసారి రండి, గుడిపాడు పోదాం... పేట వాళ్ళంతా మన బంధువులే... వాళ్ళతోపాటు మనమూ గుళ్లోకి వెల్దాం, పేట జనాలు గుళ్లోకి పోవడంలో వుండే వుద్విగ్నాన్ని వాళ్ళతోపాటు పంచుకుందాం, ఆ గొప్ప విజయంలో మనమూ కలిసి "అశ్వరథ... అశ్వరథ" అంటూ వాళ్ళను వుత్సాహపరుద్దాం... రండి! ❖

# ఉషోదయ యాత్రలో...

మరుమాముల దత్తాత్రేయశర్మ

నగరానికి నిద్రముసుగు తొలగకముందే
ఉషోదయానికి ఊపిరిపోస్తూ
ఊహల్ని రగిలిస్తూ 'ఉదయయాత్ర' సాగిస్తున్నాను

ఆమని బాగోగుల్ని చూద్దామని
బషీర్‌బాగ్, జామ్‌బాగ్, కుందన్‌బాగ్, ఆనంద్‌బాగ్....
పేర్లకే పరిమితమైన నా తోటల నగరంలో
ఆమని బాగోగుల్ని చూద్దామని
అన్ని బాగులూ వెదికాను.

ట్రాఫిక్ జామ్‌లో చిక్కుకొన్న పల్లెటూరి రైతుల్లా
అక్కడో మొక్కా ఇక్కడో మొక్క
బిక్కుబిక్కుమంటూ
ఫుట్‌పాత్‌లపై బతుకునీడుస్తున్నాయి
తమకంటే దిక్కులేని
ఏవో కొన్ని బికారీ పక్షులకు నీడనిస్తున్నాయి



నిన్నరాలిన ఎండుటాకుల్లో
బీడువారిన పంటపొలాల్లో
తేమలింకిన కంటికొలకుల
పేదరైతుల హృదయఘోషలు వినబడ్డాయి.

నిన్నరాలిన ఎండుటాకుల్లో
ప్రేమ విఫలమై మనసు వికలమై
బతుకు పుస్తకాన్ని అర్ధాంతరంగా చించేసుకొన్న
యువ జంటల ఆత్మలు అల్లాడుతున్నాయి

నిన్నరాలిన ఎండుటాకుల్లో
బతుకు మగ్గం మోతలుడిగిన
బడుగు వర్గం కలంకారీ
కళాహీనపు జరీనేతల
చిక్కుముడులే వెక్కిరించాయి.

ఇంతలో
నిన్నరాలిన జీర్ణపర్ణాలను
ఊడ్చివేస్తూ ఊదరబెడుతూ
ఒక సాంధ్య సమీరం మెత్తగా నన్ను తాకింది

కళ్యాణ ఘడియల కోసం ఎదురుచూస్తున్న
సాలంకృత వధువులా
కొత్తగా, మత్తుగా, గమ్మత్తుగా
పచ్చిక పరుపుల పరువాల్ని పరచుకొని సింగారమైన
ఓ 'ట్రాఫిక్ ఐలాండ్' వద్ద ఆగాను

ఆ చిన్న తోట మధ్యన నిలిచిన పొన్నచెట్టు
చిత్రంగా నన్ను చూసి పలకరింపుగా నవ్వింది
'కాసింత వసంతాన్ని చూపెదతావా?' అని ఆశగా అడిగా
మారు మాట్లాడకుండా జాలిగా నాపై పూలవానను కురిపించింది

మస్తుగా ముస్తాబైన ఆ తోటనిండా
ఎలదేటి పాటల కిలకిలలే
రంగురంగుల పూల పొంగులతో

తోట మొత్తం అన్ని పార్టీల బహిరంగ సభలకు
వేదికగా ఉంది

పచ్చపచ్చని పూలతేరుపై ఊరేగుతూ
ఓ గడసరి తుమ్మెద
"మళ్ళీ ఈ తోటను నాకే అప్పగిస్తే
శిశిరానికి సలాంకొట్టి
నిత్యవసంతాన్ని అందిస్తా"నని
వాగ్దానాలు చేస్తుంది

అందుకే ముందస్తుగా ఈ చిగురుటాకులకు
మరందం నగిషీలు చెక్కుతున్నానంది
కోరుకున్న కోయిలల్ని పిలిపించి
సరికొత్త రాగాల సరాగాల్ని చవిచూపిస్తానంది

మా బోంట్ల తేంట్ల మాటలకు మోసపోవద్దని
చెబుతూనే మరో తేటి
గారాబాలు కులుకుతూ ప్రతిపువ్వునూ పరామర్శించి
స్వీయ ప్రచారాన్ని గావించుకుంటూ
నెత్తావి మాధురుల పూల చిత్తాలకు హత్తుకొనేలా
వికాసాల పాటలు పాడి జుంటితేనెలు జుర్రుకుంటుంది.

గ్రీష్మ ఊష్మం ముంచుకొస్తున్నా సరే
ఈ తోటకు మనసంతా వసంతమే
ఆశల దోబూచులాటలో
కమ్మని హామీలలో కనిపించేదంతా స్వర్గమే!

'వసంతాన్ని చూశావా! కవికుమారా!'
అని ప్రశ్నించినట్టుగా మళ్ళీ పూలజల్లు కురిసింది పొన్న
తలపైకెత్తి చూద్దును గదా! పొన్న కళ్ళనిండా కన్నీళ్ళే.

పొన్న నిలుచున్న చోటే
ఎవరో ఒక కీర్తిశేషుని శిలా ప్రతిమను
త్వరలో ఆవిష్కరించనున్నారట..
పొన్నకిక ఇదే చివరి వసంతమట...

పొన్నపూల జల్లులో పరీమళాల భాష
కరుణ రసార్ద్రంగా ధ్వనించింది.
చేయని తప్పుకు ఉరిశిక్ష ఖరారైన ఖైదీలా నిలుచున్న
పొన్నను చూడలేక
అంతరంగం ఆషాఢ మేఘమైంది

పొన్నకూ నాకూ మధ్య కొన్నిక్షణాల నిర్భరమౌనం
నగరం మేల్కొంటున్న సవ్వడి...
ఎవరికీ పట్టని పొన్న వేదనను భరించలేక
నిస్సహాయంగా వెనక్కు తిరిగాను.




ఘోష
తరిమెల అమరనాథరెడ్డి
వెల : రు. 30/-

ఐదు దశాబ్దాలుగా
నేనూ నా నాటకరంగమ్
ఏడిద గోపాలరావు
వెల : రు. 100/-
(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం పాక్షిక ఆర్థిక సహాయంతో)







అమ్మ వెళ్ళిపోయింది
మాడభూషి రంగాచార్యులు
వెల : రు. 60/-




పనివాడితనం
అక్కినేని కుటుంబరావు
వెల : రు50/-
ప్రచురణ : స్వేచ్ఛ ప్రచురణలు
హైదరాబాద్




సలాం ఇస్మాయిల్
నివాళి వ్యాసాలు
వెల : రు. 50/-
ప్రచురణ : ఇస్మాయిల్ మిత్రమండలి

కథావార్షిక 2003
సం॥ డాక్టర్ వి.ఆర్. రాసాని,
మధురాంతకం నరేంద్ర
వెల : రు. 50/-
ప్రచురణ : మధురాంతకం
రాజారాం సాహిత్య సంస్థ




సినిమాలోచన
కిర్మణయి
వెల : రు. 50/-
ప్రచురణ : అనల్ప కమ్యూనికేషన్స్







బాబాల బండారం
తెలకపల్లి రవి
వెల : రు. 40/-
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్




మెరీనా
డాక్టర్ మణిగోపాల్
వెల : రు. 50/-
ప్రచురణ : వనమాలి ప్రచురణలు

వీరతెలంగాణా విప్లవ పోరాటం
గుణపాఠాలు
పుచ్చలపల్లి సుందరయ్య
వెల : రు. 200/-
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్








# యువకవుల నవోత్తేజం.. కర్నూలులో కవి సమ్మేళనం

నవకవుల సమ్మోహనా వేదికగా కర్నూలులో సాహితీ స్రవంతి నిర్వహించిన కవిసమ్మేళనం కొనసాగింది. ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన ఈ కార్యక్రమం సాహిత్యంలో తలపండిన వారూ, ఇపుడిపుడే సాహిత్యాన్ని వంటబట్టించుకున్న నవకవులూ పాల్గొన్నారు. ఇటీవలి ఎన్నికల్లో లౌకిక శక్తులకూ, వామపక్షాలకూ బ్రహ్మరథం పట్టిన ప్రజాతీర్పు సందర్భంగా నగరంలోని కోల్స్ కళాశాలలో మే 25న ఈ కార్యక్రమం జరిగింది. సీనియర్ జిల్లా నాయకులు తెలకపల్లి నరసింహయ్య, సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ బసవరాజు అధ్వర్యంలో జరిగిన కవిసమ్మేళనానికి అనూహ్య స్పందన లభించింది. ప్రచారార్భాటాలు తప్పా ప్రజా సమస్యలు పరిష్కరించకపోగా ప్రజలను ఎనలేని బారాలు మోపుతూ ప్రపంచ బ్యాంక్‌కు తాకట్టు పెట్టిన మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు హైటెక్ విధానాలకు ప్రజలు స్వస్తి చెప్పిన వైనాన్ని కవులు చక్కగా వివరించారు. స్వదేశీ జపం చేస్తూ విదేశీ సామ్రాజ్యవాదుల కొమ్ము కాస్తూ బహుళజాతి సంస్థలకు స్వాగతం పలుకుతూ మరోవైపు జాతియ సమైక్యతకు మతసామరస్యానికి చిచ్చు పెడుతున్న మతోన్మాద రాజకీయాలను ప్రోత్సహించిన భారతీయ జనతా పార్టి విధానాలను వారు ఎండగట్టారు. ఎన్నికల్లో ఆ రెండు పార్టీలను వామపక్ష లౌకిక ప్రజాస్వామ్య శక్తులు ఐక్యంగా విజృంభించి ఓడించాయంటూ కొనియాడారు. ఎన్నడూ లేని విధంగా ఈ కార్యక్రమంలో పదిమందికి పైగా నవకవులు వెలుగులోకి రావడం విశేషం. సామ్రాజ్య వాదుల కొమ్ముకాసే ప్రభుత్వాలు తారుమారైన విధానాన్ని మిత వాక్యాలతో వారు చక్కగా వివరించి సాహితీ వేత్తలు, సాహిత్యాభిమానుల మన్ననలు పొందారు. ఉదయం 11గంటల ప్రాంతలో ఒక్కొక్కరుగా సీనియర్ కవులు కార్యక్రమ స్థలానికి చేరుకున్నారు. 11.30 గంటలకల్లా 50 మందికి హాజరయ్యారు. సాహితీస్రవంతి కన్వీనర్ బసవరాజు "మాతెలుగు తల్లికీ మల్లెపూదండ" గేయంతో కార్యక్రమం ప్రారంభమైంది. ఈ సాహితీ కార్యక్రమానికి ప్రజాశక్తి కర్నూలు ఎడిషన్ ఇన్‌ఛార్జీ పిడుగు సుబ్బరాయుడు అధ్యక్షత వహించారు. ప్రధాన వక్తగా డాక్టర్ శాంతమ్మ మాట్లాడుతూ సాహిత్యమనేది ప్రజలను చైతన్య పరిచేదిగా ఉండాలనీ, ఓ రచయిత బానిసల జీవితాలను వర్ణిస్తూ రచించిన గ్రంధాన్ని చదివిన ఓ చక్రవర్తి బానిసలకు స్వేచ్ఛను ప్రసాదించాడనీ ఉదహరిస్తూ రచనల ప్రాధాన్యతను వివరించారు. ఈ సందర్భంగా పలువురు వక్తలు ఉపన్యసించారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో పలువురు కవులు తమ కవితలను ఆలపించారు. నవ రచయిత్రి జయలక్ష్మి "యూజర్ ఛార్జీల మోతతో మా కడుపులపై కోత పెట్టావు,పొదుపు లక్ష్మి సెల్లంటూ ఇచ్చి మా జేబుకు చిల్లు పెట్టావు. ఇంకుడు గుంతలను తవ్వి ఆ గోతిలో నువ్వే పడ్డావు" అని తన ఆవేశాన్ని వెలిబుచ్చడంతో సభలో హర్షధ్వానాలు వెల్లివిరిశాయి. మరో నవ రచయిత్రి అరుణ తన కవితను వినిపిస్తూ "మానవత్వానిదే ఈ విజయం, మతపిశాచులది పరాజయం, రానున్నది సోషలిజం" అని తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. నవ కవి సుధాకర్ తన కవితను వినిపిస్తూ "కులం కుతంత్రాలకు మతం మత్తుకు బంధువునేనే, బడుగు జీవుల పాలిట రాబందువును నేనే, అంటూ అంతా వెలిగిపోతుందని చెప్పింది నేనే నా అధికారానికి గోతులు తవ్వుకుంది నేనే " అంటూ చంద్రబాబు,వాజ్‌పేయి వైఫల్యాన్ని ఎండగట్టారు. మరో రచయిత్రి కృష్ణవేణి తన కవితను వినిపిస్తూ "కనకరాసులు కూడబెట్టుకున్నావు, మాకు కరెంట్ షాకులు ఇచ్చావు, డబ్బు మదంతో మమ్ములను కొనాలనుకున్నావు మా ఓటుతో మీ కోటలు పెకలించాము" అంటూ తమ కవితను వినిపించారు. ఇలా రెండున్నర గంటల పాటు ఆద్యంతం ఆసక్తికరంగా కార్యక్రమం సాగింది. కార్యక్రమం ముగింపు సందర్భంగా సిపిఎం సీనియర్ నాయకులు టి.నరసింహయ్య మాట్లాడుతూ సాహితీ స్రవంతి శ్రీశ్రీ, గురజాడ, జాషువా వర్ధంతి జయంతి సందర్భంగా మాత్రమే కార్యక్రమాలు నిర్వహించడానికి పరిమితం కాకుండా ఇరాక్ పై అమెరికా దురాక్రమణను ఖండిస్తూ, గోద్రా సంఘటనను నిరసిస్తూ ఎప్పటికప్పుడు స్పందిస్తుందని కొనియాడారు. దాదాపు యాభై మంది కవులు, అభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో సీనియర్‌కవులు ఎలమర్తి రమణయ్య మహమ్మద్ హుస్సేన్, బాలన్న కవి, శుభాకర్‌రావు, గిరిరాజు, అల్లాబక్షు, అబ్దుల్ సత్తార్, పత్తి ఓబులయ్య పాల్గొని ప్రజాతీర్పుపై కరుకైన పదాలతో ఆలపించిన కవిత్వాలకు అపూర్వ స్పందన లభించింది. సందర్భోచితంగా ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించే సాహితీ స్రవంతిని కొనియాడారు. సాహితి స్రవంతి సభ్యులు మట్టయ్య వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

-పుప్పాల మట్టయ్య, కర్నూలు.



## బ్యాలెట్-బ్యాలెట్ ఆవిష్కరణ

నాటితరం నాయకుల్లో ఉన్న సంకల్పం, స్వార్థ రాహిత్యం, ప్రజల కొరకై పాటుపడే తత్వం నేటి నాయకుల్లో మచ్చుకైనా కనిపించడంలేదని అన్నారు. ఏప్రిల్ 11న కరీంనగర్ శారదానికేతన్ పాఠశాలలో ఉదయసాహితి సంస్థ దాస్యం లక్ష్మయ్య సంపాదకత్వంలో వెలువరించిన ''బ్యాలెట్-బ్యాలెట్'' కవితా సంకలనాన్ని స్వాతంత్ర్యసమరయోధులు బోయినపల్లి వెంకటరామారావు ఆవిష్కరించారు. "బ్యాలెట్-బ్యాలెట్" సంకలనం ద్వారా 65 మంది కవులతో సంకలనం వెలువరించడం సంతోషదాయకం అన్నారు.

సంకలనాన్ని పరిచయం చేసిన కవి గుళ్ళపల్లి తిరుమల కాంతికృష్ణ మాట్లాడుతూ ఈ కవితా సంపుటిలో ఓటు విలువ, నాయకుల మనస్తత్వాలు, ప్రజాస్వామ్య విలువలు తదితర అంశాలు గురించి లబ్ధప్రతిష్టులైన కవులతోపాటు వర్ధమాన కవుల కవితలున్నాయన్నారు. కవి అన్నవరం దేవేందర్ ప్రసంగిస్తూ ఒక చారిత్రక సందర్భంలో వెలువడిన పుస్తకం "బ్యాలెట్-బ్యాలెట్" అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన కవి కె. విజయనర్సింహారావు ప్రసంగిస్తూ ఎన్నికల నేపథ్యంలో కవులంతా స్పందించిన తీరు ప్రశంసనీయమన్నారు. సాహితీవేత్త కె.ఎస్. అనంతాచార్య బహుభాషానువాద రచయిత నలిమెల భాస్కర్ ముందస్తు మాటలో కవులు వ్యక్తపరిచిన తీరును ప్రశంసించారు. శ్రీదాస్యం లక్ష్మయ్య, వేణుశ్రీ, ఆడెపు చంద్రమౌళి, నారోజు, టి. రామాంజనేయులు, మాడిశెట్టి గోపాల్ తదితరులు ప్రసంగించారు. అనంతరం కవితా గానం జరిగింది.

**-దాస్యం లక్ష్మయ్య, అధ్యక్షులు, ఉదయ సాహితీ, కరీంనగర్**

## దర్భశయనం అభినందన

పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం, సాహిత్య పురస్కారం అందుకున్న సందర్భంగా దర్భశయనం శ్రీనివాసాచార్యగారికి కరీంనగర్ జనచైతన్యవేదికలో మార్చి 30న అభినందన సభ జరిగింది. కరీంనగర్, సాహితీ గౌతమి ఆధ్వర్యంలో జరిగిన ఈ సభలో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రముఖ కవి కె. శివారెడ్డి ప్రధాన వక్తగా పాల్గొన్నారు. దర్భశయనం ఐదు కవితా సంపుటులలోని కొన్ని కవితల్ని గానం చేస్తూ కవి కవితా ప్రస్థానాన్ని విశ్లేషించారు. ఈ సందర్భంగా ఆయన పురస్కారానికి కారణమైన "వేళ్ళు మాట్లాడే వేళ" కవిత్వ సంపుటి విశిష్టతను తెలియజెప్పారు. వారాల ఆనంద్, నలిమెల భాస్కర్, సాహితీ స్రవంతి కన్వీనర్ వేణుశ్రీ మాట్లాడారు. డా॥ డి. నరహరి ఆచార్య, మాడిశెట్టి గోపాల్, హరిప్రసాద్ దర్భశయనాన్ని సత్కరిస్తూ అభినందించారు. ఇంకా చాలా మంది అభిమానులు కవిని, అతని కవిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని కొనియాడారు. సభకు అధ్యక్షత వహించిన డా॥ జి. లక్ష్మణరావు, శ్రీనివాసాచార్యకు శాలువా మరియు జ్ఞాపికను బహూకరించారు. చివరగా అభినందన గ్రహీత దర్భశయనం శ్రీనివాసాచార్య మాట్లాడుతూ తన కవితా ప్రవాహానికి ప్రేరణనిచ్చిన సంజీవదేవ్, కాళోజీ, శివారెడ్డిలను తలచుకుంటూ వారు ఏ విధంగా ప్రేరకాలుగా నిలిచారో చెప్పారు. సాహితీ గౌతమి ప్రధాన కార్యదర్శి అనంతాచార్య వందన సమర్పణ చేశారు.

-బి.వి.ఎన్. స్వామి



## నాయుడుబావ పాటల ఆవిష్కరణ

కవి, కళాకారుడు సాదనాల వెంకట స్వామి నాయుడు రచించిన నాయుడు బావ పాటలు గేయ సంపుటిని ప్రముఖ సినీ దర్శకురాలు శ్రీమతి జయ ఆవిష్కరించారు. ఖమ్మంలోని చాంబర్ ఆఫ్ కామర్స్ భవనంలో సాయంత్రం 'ఆనందలహరి' సంస్థ ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది.

ఈ సందర్భంగా శ్రీమతి జయ మాట్లాడుతూ "చిక్కని కవిత్వమున్న ఒక మంచి పుస్తకాన్ని ఆవిష్కరించినందుకు ఆనందంగా ఉంద"ని అన్నారు. ఖమ్మం ఎస్.పి. వి.వి. శ్రీనివాసరావు ప్రధానోపన్యాసం చేశారు. మెడినోవా హాస్పిటల్స్ అధినేత డా॥ హరీష్ పుస్తకాన్ని సమీక్షిస్తూ ఎంకి పాటల్లో నాయుడు బావకి ఎంకి ఒక్కటే సర్వస్వమనీ, అయితే ఈ నాయుడు బావకి ప్రపంచం సర్వస్వ"మని అన్నారు. న్యాయవాది వి.వి. అప్పారావు, ఆకాశవాణి కొత్తగూడెం స్టేషన్ డైరెక్టర్ కె.వి. హన్మంతరావు, దూరదర్శన్ ప్రొడ్యూసర్ ఐ.వి. రావు మాట్లాడారు. ఇంకా ఈ కార్యక్రమంలో ఖమ్మం మున్సిపల్ ఛైర్‌పర్సన్ డా॥ ఎ.నాగమల్లిక, చాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షులు కొప్పు నరేష్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు. ఈ పుస్తకానికి ప్రముఖ దర్శకుడు బాపు ముఖచిత్రం వేశారు. హిమకర్ పబ్లికేషన్స్, రాజమండ్రి వారు పుస్తకాన్ని ప్రచురించారు.

→

## ఈ రచనలు ఎవరివి? ఎందులోవి? - ముగింపు

"ఇదో తమాషా అయిన అదే సమయంలో ఆసక్తికరమైన పరీక్ష లాటిది. ఇది మన అవగాహనను మనం తెలుసు కోవడానికి మాత్రమే కాక అంతగా తెలియని కోణాలు తెలుసుకోవడానికి కూడా ఉపయోగ పడుతుంది.

ప్రస్థానం అన్ని తరగతులు సాహిత్య మిత్రుల కోసం ఉద్దేశించింది కనక ఈ విషయాలు ఎవరికి తెలియవు అని పెదాలు చప్పరించకండి. ముందుగా మీరే చెప్పేసి ఔత్సాహికులకు పని లేకుండా చేయకండి. వాళ్లను తెలుసుకోనివ్వండి. చదువుకోనివ్వండి.

ఈ ప్రశ్నలకు జవాబులు తెలిసినా తెలియక పోయినా ఆ సంగతి ప్రస్థానంకు రాయండి. వాటిని ప్రచురిస్తాము. అదే సమయంలో ఇందులో ఇచ్చే అంశాలపై మీ అభిప్రాయాలు తెలియజేయండి. అలాగే దీనికి అంశాలను కూడా పంపవచ్చు." ఇంత ఉపోద్ఘాతంతో మొదలుపెట్టిన ఈ శీర్షికకు ఒక్కటంటే ఒక్కటైనా లేఖ రాకపోవడం నిరుత్సాహం కలిగించకపోయినా, నిజమని గుర్తించక తప్పడంలేదు.

ఎవరికైనా స్వీయ రచనల గురించి ప్రత్యేకాసక్తి, తాపత్రయం ఉన్నా కూడా తప్పేమీ కాదు. కాని సాహిత్యానికి, సమాజానికి సంబంధించిన వివిధ పార్శ్వాలను, చరిత్రను తెలుసుకోవడానికి ప్రయత్నించక పోవడంలోపమే. దాన్ని మనం గుర్తించడం అవసరం.

ఏమైనా స్పందన తీసుకు రాలేకపోయిన ఈ శీర్షిక ఇక కొనసాగదు.

జనవరి - మార్చి 2004 సంచికలో ఇచ్చిన కవిత తిలక్‌ది. ప్రధానంగా మానవతా వాద కవిగా ప్రఖ్యాతుడైన తిలక్.

"ఇది కవిత్వ కాలం" అర్థశతాబ్దం కిందట 'కల్పన'కు సంకలన కర్తలు రాసిన సంభాషణాత్మక రాసిన ముందు మాట ఇది.

తాను వివాహ వ్యవస్థలో వున్న అక్రమాలు పోవాలనే వాంఛిస్తున్నట్లు చెప్పే వాక్యాలు చలంవి.

## "ఇనుపగజ్జెలతల్లి" ఆవిష్కరణ



అనంతపురం జిల్లా కవులు, కళాకారులు, రచయితలు, వివిధ సామాజిక సంస్థల ప్రతినిధులు పల్లెల్లో తిరిగి బాధల్లో ఉన్న రైతులకు ఆత్మవిశ్వాసం కలిగించే ప్రయత్నం చేశారు. రైతుల్లో ఆత్మవిశ్వాసం కల్పించేందుకు కొత్తగా ఎన్నికైన ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. కానీ అదే సమయంలో రైతుల ఆత్మహత్యలు పెరిగిపోతున్నాయి.

గత ప్రభుత్వ హయాంలో వ్యవసాయానికి 'సాయం' కొరవడింది. పైగా వ్యవసాయం జూదం మాదిరైంది. ఈ పరిస్థితుల్లో తీవ్ర కరువు దాపురించిన అనంతపురం జిల్లాలో రైతులు విలవిల్లాడిపోతున్నారు. ఇక్కడ గత అయిదేళ్లలో నాలుగువందల మందికి పైగా రైతులు పాలకపక్ష దుర్నీతికి బలైపోయారు.

ఈ నేపథ్యంలో రెండేళ్ళ క్రితం రైతులు, ప్రజాసంఘాలు పోరుబాట పట్టి రెండురోజులపాటు 'రోడ్‌బంద్' కూడా నిర్వహించాయి. ఆత్మహత్యలు పెచ్చుపెరగడంతో రైతుల్లో ఆత్మవిశ్వాసాన్ని కల్పించేందుకు గత సంవత్సరం కవులు, కళాకారులు బృందాలుగా ఏర్పడి కార్యక్రమాలు చేపట్టారు. 'రైతు ఆత్మవిశ్వాస యాత్ర' పేరిట జిల్లా వ్యాపిత యాత్ర నిర్వహించారు. అలాంటి యాత్రనే ఈ సంవత్సరమూ నిర్వహించి నివేదికలు వెలువరించారు. ఎనిమిది నెలల్లో ఎనిమిది బోర్లు వేసి నీళ్ళు పడక దిక్కుతోచని స్థితిలో వున్న రైతుల వ్యథలు ఇందులో కనిపిస్తాయి. బ్యాంకు రుణాలు, బయట అప్పులతో బతుకుభారమై ఉరితాడే శరణ్యమని భావించిన కొండయ్యలు, బోర్లలో నీరెండి పొలం బీడు పడిపోగా పురుగుల మందే శరణ్యమనుకున్న శ్రీనివాసులు వంటి రైతుల దురవస్థలు ఇందులో అగపడతాయి. ఇలాంటి రైతుల్ని కవులు, కళాకారుల బృందాలు ఓదార్చాయి. వాళ్ళకు ధైర్యం చెప్పాయి. తాము తయారు చేసిన నివేదికల్ని ఈ నెల 12న అనంతపురం పోలీస్ వెల్ఫేర్ కాంప్లెక్స్‌లో జరిపిన సభలో విడుదల చేశాయి. అదే సభలో అనంతపురం జిల్లా రచయితలు రాసిన కరువు కథలతో కూడిన సంకలనం 'ఇనుప గజ్జెల తల్లిని' జిల్లా రచయితల సంఘం ఆవిష్కరించింది. ఈ సంకలనంలో 18 కరువు కథలున్నాయి. ఇందులో చిలుకూరి దేవపుత్రగారి 'నెర్లు', సింగమనేని నారాయణగారి 'అలజడి', శాంతి నారాయణగారి 'పేగు తెంచిన రాజ్యం', నిర్మలారాణి గారి 'కాటేసిన కరువు', ఎన్వి ప్రసాద్ గారి 'వ్యసనం', రాఘవేంద్రరావుగారి 'కరువు కురిసిన ధాత్రి' మొదలైన కథలున్నాయి.

**(ఇనుపగజ్జెలతల్లి, సింగమనేని నారాయణ, వెల : రు.50/-, ప్రచురణ : జిల్లా రచయితల సంఘం)**

**-కుమార స్వామి**

Printed and Published by Sri **V. Krishnaiah** On behalf of Sahiti Sravanti
1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500 020. Editor **T. Ravindranath**.
Printed at Prajasakti Daily Printing Press. 1-1-60/2, M.B. Bhavan, R.T.C. 'X' Road, Hyderabad.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

# ప్రజలు దీవించిన ప్రభుత్వం
# ప్రజా సంక్షేమమే అంతిమ లక్ష్యం

## ప్రభుత్వ ప్రాధాన్యతలు

- రైతులకు ఉచిత విద్యుత్
- పావలా వడ్డీకే డ్వాక్రా మహిళలకు, రైతులకు, నిరుద్యోగులకు రుణాలు
- రాష్ట్రంలో ఖాళీగా ఉన్న ఉద్యోగాలు భర్తీ
- సంవత్సరానికి 8 లక్షల ఇండ్లు నిర్మించి మహిళల పేరిట కేటాయింపు
- పెండింగ్‌లో ఉన్న సేద్యపు నీటి ప్రాజెక్టులు 5సంవత్సరాలలో పూర్తి
- అప్పుల ఊబిలో చిక్కుకున్న కుటుంబాల పట్ల ప్రత్యేక శ్రద్ధ - తక్షణసహాయం
- రుణాలు చెల్లింపులో రైతుకు వెసులుబాటు

65

జారీ చేయువారు : సమాచార పౌరసంబంధాల శాఖ




**In a class of its own !**

**Lepakshi Nandi** Note Books have always been the students' best friend. Acknowledged as the best in class, in terms of quality and price, APSTC makes the note books easily available at authorised dealers.

**Page after of advantages**

★ Superior paper quality. ★ Well delineated rules.
★ Long note books with white duplex board laminated covers.
★ Exercise books with chromo Art paper cover.

**OUR RETAIL PRICES**

| | | |
|---|---|---|
| 192 | Pages Bound | Rs. 9-00 each |
| 96 | Pages Bound | Rs. 5-75 each |
| 96 | Pages Unbound | Rs. 4-75 each |
| 48 | Pages Unbound | Rs. 2-75 each |
| 192 | Pages Unbound/Long Book (White) | Rs. 19-00 each |
| 192 | Pages Unbound/Long Book (Ruled) | Rs. 19-50 each |
| 192 | Pages Bound/Long Book (White) | Rs. 19-50 each |
| 192 | Pages Bound/Long Book (Ruled) | Rs. 20-00 each |
| 96 | Pages Unbound/Long Book (White) | Rs. 10-75 each |
| 96 | Pages Unbound/Long Book (Ruled | Rs. 11-00 each |

Books are available in the market with all leading stationers

BEWARE OF IMITATION



# Andhra Pradesh State Trading Corporation Ltd.

(A Government of Andhra Pradesh undertaking)
NOTE BOOKS DIVISION, 11-4-645, T.V.B. Complex,
A.C. Guards, Hyderabad - 500 004. Ph : 23307845/23393265



**OUR BRANCHES AT :** Visakhapatnam, Ph : 2794199. Kakinada, Ph : 2379213. Eluru, Ph : 252451. Vijayawada, Ph : 2476856. Guntur, Ph : 2320935. Ongole, Ph : 233541. Nellore, Ph : 2312887. Tirupathi, Ph : 2240725. Cuddapah, Ph : 250448. Anantapur, Ph : 274379. Kurnool, Ph : 222340 Mahaboobnagar, Ph : 243882. Warangal, Ph : 2579007. Khammam, Ph : 2248



| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A112 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |